# గీతా [illegible]తము



రచయిత :

**శ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామి**

ఈదుల బళాపురం - సోమందేపల్లి మండలం

అనంతపురం జిల్లా.

# గీతా బోధామృతము



రచయిత :

**శ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామి**

ఈదుల బళాపురం - సోమందేప మండలం

అనంతపురం జిల్లా.

ప్రచురణ : 2002




ప్రతులు : 1000

గ్రంథకర్త :
శ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామి
ఈదుల బళాపురం - సోమందేపల్లి మండలం
అనంతపురం జిల్లా.




ముద్రణ :
చంద్రకళ ప్రింటర్స్,
అనంతపురం.

# గీతా బోధామృతము



**తిరుమల తిరుపతి దేవస్థానముల** వారి

ఆర్థిక సహాయ సహకారములతో ఈ గ్రంథ ముద్రణ

కావించబడినది.


గ్రంథ రచయిత :

**పూజ్యశ్రీ రామకోటి రామకృష్ణానంద స్వామిజీవారు**

శ్రీరామకృష్ణానంద ఆశ్రమం, ఈదుల బళాపురం (పో)

సోమందేపల్లి మండలం. అనంతపురం జిల్లా. - 515 122

# ముందుమాట

పవిత్ర భారతావని కర్మభూమి, ధర్మానికీ, ఆర్ష్యసంస్కృతికీ, పవిత్రతకూ, ఇది పుట్టినిల్లు. ఇక్కడ వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, పురాణాలు, శృతులు, స్మృతలు వెలసి మన సంస్కృతికి అద్దం పట్టులై,
ఉపనిషత్తులు – బ్రహ్మసూత్రాలు భగవద్గీత, యీ మూడింటినీ ప్రస్థాన త్రయం అంటాం. సర్వ వేదసార సంగ్రహమే యీ భగవద్గీత!

గీతా గంగా చ గాయత్రీ
గోవిందేతి హృది స్థితే
చతుర్గకార సంయుక్తే
పునర్జన్మ నవిద్యాతే –

అన్న గకార చతుష్టయంతో గీత మొదటిది.

భగవద్గీత కంకి దధీతా, గంగాజలలిన గణికావీతా " అంటూ శంకర భగత్పాదులు గీతావైశిష్టాన్ని వివరించారు.

ద్వావరంలో నరులను నరాయణులుగా మార్చుడానికి శ్రీ కృష్ణపరమాత్మ కావించిన బోదమే ఈ భగవద్గీత. ఇది పంచమ వేదమయిన మాహాభారతము భీష్మపర్వములోనది.

" సర్వోపనిషదో గావః
దోగ్ధ గోపాల నందనః
పార్థో వత్సః సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహా మహత్ " అన్నారు పెద్దలు.

పార్థుని ఆధారంగా చేసుకొని వరమాత్మ కావించిన బోధయే గీతాబోధామృతము. ఆనాడు విష్ణువు దేవతలకు అమృతాన్ని పంచి ఇస్తే ద్వారకంలో శ్రీకృష్ణ పరమాత్మ ఈ గీతాబోధనమును అను అమృతాన్ని పంచి ఇచ్చి మర్త్యులైన మనకు అమరత్వ యోగసిద్ధిని చేకూర్చారు.

ఆ గీతా బోధనామృతాన్ని శ్రీశ్రీశ్రీ రామకోటి రామకృష్ణనంద స్వామివారు తమ ఆధ్యాత్మిక యోగసాధనా రూపాన అనుభవంతో మేళవించి జన బాహుళ్యానికి అందుబాటులోకి తెచ్చి, ఈ ప్రథమ షట్కాని వివరించి పంచారు. ఎందరో విజ్ఞులు, ప్రాజ్ఞులు గీతకు ఎన్నో వ్యాఖ్యలు వ్రాసినారు. అయినా అది నిత్యనూతనమే.

" కల్యాణాత్మకమైన విష్ణు కథలతో ఆకర్ణించుచూ ముక్తుడై కల్యుడెందదు తృప్తుడై "
అని వినంగ కొత్తవాచుండు అన్న పోతనార్యుని వాక్కు సార్థకమైనది. గీతా వాక్యలు
కూడా నిత్యనూతనాలే.

శ్రీశ్రీశ్రీ స్వామివారి గీతాబోధామృత కావ్యలో ఎన్నో ఉపమానాలు,
ఉపాఖ్యానాలు, శృతిస్మృతి ఉపనిషత్తులనుండి సమన్యాయాలు, నిదర్శనాలు, వాక్యలు,
వివిరణమునకు గోచరిస్తాయి. బరువైన ఆధ్యాత్మిక విషయాలను నిత్య జీవనములోని
దృష్టాంతాలతో వివరించి పాఠకలుకు అలసట శ్రాంతి కలుగనీయకుండ తమ వెంటనే
గీతా బోధనలోకి స్వామివారు తీసుకొని వెళుతారు.

సకామ నిష్కామ కర్మల
యోగ శద్ధ వివరణము
సన్యాసశర్బ సమన్వయము
గురుపద వాఖ్య
భావదోష భాష్యము
పురుషార్థ చతుష్టయము

చతుర్విద ఆశ్రమములతో సమన్వయించుట ఆత్మస్వరూప విశిష్ఠత. భావాద్వేత
క్రియాద్వైతముల స్వస్తికర్మ మోక్ష నిర్వచనము మొదలైనవి. పాఠకులలో ఆసక్తిని, జిజ్ఞాసను,
ఉత్సాహమును ద్విగిణీకృతము కావిస్తాయంటే అతిశయోక్తికాదు.

బలావాన్ ఇంద్రియ గ్రామరి విద్వాంనమః కర్షతి " ఇంద్రియ నిగ్రహము
కష్టము అనే సత్యాన్ని తెలిపే వ్యాగజైమిగునుల సంభాషణాత్మకతో మన హృదయాలలో
చెరగని ముద్రగా స్థిరపడుతుంది.

ఇందులో స్వామి శ్రవనానికి ఇచ్చిన ప్రాధాన్యము బహుజన ప్రయోజకారి.
ఒకసారి వారి బోధామృతము (విన్నాక) ఆస్వాదించాక అది మనల్ని ప్రభావించి తీరుతుందని
నా దృఢవిశ్వాసము. మనుష్యులను పునీతం చేసే ఈ గీతా బోధనామృతము శ్రీశ్రీశ్రీ
స్వామివారి రెండు భాగాలు (భక్తి, జ్ఞానాలు) త్వరలో లభించి మనకు అమృతత్వ ప్రాప్తిని
కూర్చి అమరత్వ సిద్ధికి దోహదపడాలని వేదుకుంటూ సెలవు తీసుకొనే సహృదయ హృదయ
విధేయురాలు

- జి. లక్ష్మమ్మ

21-4-2002

13/2/6, షిరిడి నగర్, అనంతపురం

# 1వ అధ్యాయము

త్రేతాయుగంలో భగవంతుడు రామావతారంగా అవతరించి వానరులను నరులుగా చేశాడు. ద్వాపరములో శ్రీ కృష్ణావతారంతో నరులను నారాయణులుగా మార్చడానికి అందించిన మహోపదేశమే "శ్రీమద్భగవద్గీత"

" గీతా గంగోదకం పీత్వా పునర్జన్మన విద్యతే " అన్న ఈ మహోపదేశమైన గీతాజ్ఞాన గంగను ఏ కొద్దిగ పానము చేసిననూ మరలా ఈ జనన మరణ సంసారములో జీవుడు ప్రవేశింపడు. శాశ్వతానంద స్వరూపమైన కైవల్యమును పొందును. ఎనబది నాలుగు లక్షల జీవరాసులలో మానవ జన్మమే శ్రేష్ఠమైనదని, ఈ జన్మయందే జ్ఞానార్జనకు తగిన అధికారం కలదని శాస్త్రము మనకు తెలుపుచున్నది. సర్వజీవులకు ఆహారము, నిద్ర మైథునములే ప్రధానంగా గల్గినవనియు, మానవ జన్మ మాత్రమే నిత్యానిత్య జ్ఞానంగల్గిన పవిత్ర జన్మగా చెప్పబడినది.

**" ఆహార నిద్రా భయ మైథు నంచ**
**సామాన్య మే తత్ పశుభిర్నరాణాం**
**జ్ఞానమ్నరాణాం మధికం విశేషః**
**జ్ఞానేన హీనః పశుభిః సమానః**

సర్వజీవులకు ఆహార, నిద్ర, మైథున భయాదులతో పాటు మానవునకు జ్ఞానం అనేది అధికంగా భగవంతుడు ప్రసాదించాడు. అట్టి వివేక జ్ఞానం లేనపుడు మనిషి కూడా పశువుతో సమానము. కాన భగవంతుడు ప్రసాదించిన ఈ వివేక జ్ఞానమును నూతగాగొని, తాననగా ఎవరు? ఈ సంసారమనగా నెయ్యది? ప్రపంచమనగానేమి? పరమాత్మ అనగానేమి? అని విచారించి తరచి, సార భూతమైన పరమాత్మను బొంది మానవ జన్మ సఫలత గావించు కొనవలెను. లేనియెడల ఎన్నోజన్మల సుకృతమున సంపాదించుకున్న ఈ జన్మ వృథా అగును.

పశుపక్ష్యాధి జీవులకు ఆహారం ప్రధానం. అంటే " తినేది " ప్రధానం. మానవునకు " వివేకం " ప్రధానం. తిని తిని పశువు బాగుపడుతుంది. విని విని (మంచిని) మానవుడు మాధవుడవుతాడు. నరుడు నారాయణుడవుతాడు. శ్రవణ ప్రభావంతో ఎంతటి పాపాత్ముడు కూడా పుణ్యాత్ముడౌతాడు.

మానవునికి అన్ని ఇంద్రియములకన్న శ్రవణేంద్రియము చాలా ప్రధానమైనది. భారతంలో కర్ణుని పాత్ర చాలా ప్రముఖమైనది. " కర్ణునితో యుద్ధం సరి, కార్తీకంతో వానలు సరి " అని పెద్దల నానుడి. భారతయుద్ధంలో కర్ణుడు పోయిన తరువాత జరిగిన యుద్ధం అంత చెప్పుకోదగినదిగాలేదు.

" భద్రం కర్ణేభిశ్శృణుయామదేవాః " అని ఉపనిషత్ వాక్యము. జీవితంలో మనిషి బాగుపడాలన్నా చెడిపోవాలన్నా శ్రవణమే ప్రధానం. మంచినివిని, ఎంతచెడ్డవాడైనా మంచి వాడౌతాడు. ఏడు రోజులు భాగవతాన్ని శ్రవణం చేసి పరీక్షిత్ మహారాజు ముక్తిని పొందినాడు. కాబట్టి ముక్తికి ముఖద్వారంలాంటి శ్రవణేంద్రియాన్ని లౌకికమైన శబ్దములకు పాల్పడనీయక పుణ్యప్రదమైన భక్తి, జ్ఞాన విషయములందే దాన్ని వినియోగించి, జన్మచరితార్థం కావించు కొనవలెను.

ఒకప్పుడు ఒక మహారాజుగారు పెద్ద సభ గావించి ఆ సభలో వున్న పండితులకు, మహాత్ములకు తనలోని సంశయాన్ని దెల్పినాడు. అయ్యా ! మహానుభావులారా !

" మానవునికి చెవులు భగవంతుడెందుకిచ్చాడు? " అని ప్రశ్నించాడు. ఆ సభలో వున్న పెద్దలు, పండితులు వారి వారికి తోచిన విధంగా సమాధానమిచ్చారు. కొందరు, మహారాజా ! మానవునికి తలకిరుప్రక్కలా చెవులుండటంవల్ల మంచి మంచి ఆభరణములు అలంకరించుకోవడానికి అనువుగా వుండునట్లు భగవంతుడు ప్రసాదించాడని, మరికొందఋ మంచి సంగీతాన్ని శ్రవణంచేసి ఆనందించడానికని, భగవంతుని కథలను భక్తులు పవిత్రంగా శ్రవణం చేయుటకు వొసంగబడినవి ఇంకొందరు, ఇలాగ వారి వారి అభిప్రాయాలను వెల్లడిచేశారు. ఈ సమాధానాలు రాజునకు సంతృప్తిని కలిగించలేదు. ఈలోగా ఒక పల్లెటూరి వాడు పైకిలేచి మహాగంభీరంగా మహారాజుతో ఇలా అన్నాడు. మహారాజా ! భగవంతుడు మనకు చెవులు ఇచ్చింది విళ్ళంతా చెప్పినట్లు ఆభరణాలు ధరించడానికి, సంగీతాన్ని వినటానికి, కథలు వినటానికి కాదు. మనకు బీడీ, చుట్ట, సిగరెట్ త్రాగేటప్పుడు ఆరిపోయినచో దానిని చెవిమధ్య పెట్టుకొనుటకు స్టాండులాగా వుండునట్లు చెవులను అమర్చినాడని సమాధానమిచ్చాడట. ఆ సమాధానం విన్న సభికులందరూ గొల్లున నవ్వసాగారు. కాని రాజుగారికి వీడిచ్చిన సమాధానం మంచిగానే అనిపించి, వాడికి బహుమానమిచ్చి పంపాడట.

భగవంతుడు ప్రసాదించిన ఇంద్రియములను బుద్ధిపూర్వకంగా అపవిత్ర విషయములచే పాడుచేసుకొని, మానవత్వమును మనిషి మంటగలుపుకుంటున్నాడు. మనకు భగవంతుడు ప్రసాదించిన ఇంద్రియములను, ఏఏ ఇంద్రియాన్ని ఎలా వాడుకోవాలన్న విషయాన్ని ఎలా వాడుకోవాలన్న విషయాన్ని బాల ప్రహ్లాదుడు భాగవతంలో ఎలా సెలవిచ్చాడో చూడండి.

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము

విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిదవిలిన మనము మనము
భగవంతు వల గొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభి నీధవుజెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరుమని యెడి తండ్రి తండ్రి

హరిని పూజించే హస్తమే హస్తంగానీ, హరి పూజకు వినియోగం కాని హస్తం హస్తంకాదు. ఎండిపోయిన చెట్టుకొమ్మతో సమానం. భగవంతుని కీర్తించే నాలుకే నాలుక కాని, లేకుంటే అది నాలుకే కాదు. కొండచిలువతో సమానం. శ్రీహరిని చూచే కన్నులు, కన్నులేకాని, లేకుంటే అవి గోడకున్న రంధ్రములలాంటివి. శేషశాయికి మ్రొక్కు శిరము శిరమేకాని, లేకుంటే అది శిరము కాదు. దృష్టమృగాలకు అది పెద్దకొండ. చక్రధారి కథలు వినిన చెవులు చెవులే గాని లేకుంటే అవి చెవులు గావు. సర్పములు దాగుకునే పుట్ట సొరంగాల్లాంటివి. మాధవుని తలంచే మనసు మనసేగాని లేకుంటే అది మనసేకాదు. మానవుల పాలిట మహమారి. పరమాత్మకు ప్రదిక్షణం చేసే పాదాలే పాదాలు. కానీ లేకుంటే అవి పాదాలు కావు. పాత ఇంటిని మోసే పెద్ద స్తంభాల్లాంటివి.

పద్మనాభుని భావించే బుద్ధి బుద్ధియే కానీ, లేకుంటే అది బుద్ధికాదు. దుర్బుద్ధి. అంబుజాక్షుని గూర్చి ఆలోచించే దినమే సుదినంకానీ, లేకుంటే అది దుర్దినమో, లేక తద్దినమో అయివుండాలి. చక్రధారిని గూర్చి చదివే చదువు కానీ మిగిలిన చదువులు, చదువులు కావు. అవన్నీ చావులు. గోవిందుని గురించి బోధించే గురువులు గురువులు కానీ, లేకుంటే వారు బరువులు మోసే పెద్ద ఎద్దులు. భగవంతుని సేవింపమని చెప్పే తండ్రులు, తండ్రులు కానీ, ప్రాపంచిక విషయముల గురించి బ్రోత్సహించు తండ్రి, తండ్రికాడు. వాని పాలిట యమధర్మరాజు.

బాలుడైన ప్రహ్లాదుడు మానవ దేహములో గల సర్వేంద్రియాలను ఎలా పునీతం చెయ్యాలో లోకానికి చాటాడు. ప్రతి గురువు, ప్రతి తండ్రి చేయవలసిన విద్యుక్త ధర్మమేమో చక్కగా బోధించాడు. నేటి గురువులు శిష్యుల విత్తాపరహారులే కానీ చిత్తాపహారులు కారు. నేటి తండ్రులు ధనార్జన గురించి బ్రోత్సహించే వారే కానీ బిడ్డలకు జ్ఞానార్జనను బ్రోత్సహించే వారుకారు.

మానవుడు భగవదనుగ్రహంతో తనకు లభించిన మానవ దేహాన్ని బాలప్రహ్లాదునిలాగా, బాలధ్రువునిలాగా, పరమాత్ముని స్మరణ, చింతన, ధ్యానముల చేతనే పునీతం గావించుకొని ధన్యుడు గావలెను గానీ, విషయలోలుడై విషయ ప్రపంచములో పరిభ్రమించి నరకమునబడరాదు.

" మలనిర్మోచనం పుంసాంజలస్నానం దినేదినే,
సకృత్ గీతాంభసిస్నానం సంసారమలనాశనం "

ప్రతి నిత్యము భౌతికదేహ శుభ్రత గురించి ఎలా స్నానం చేయుచున్నామో అలాగే జీవునికి సంసారమనే మాలిన్యం తొలగించుకొనుటకు నిత్యము గీతాజ్ఞానమున మనము మనసును వినియోగించి ధన్యులం కావాలి. " మహాపాపాది పాపాని గీతా ధ్యానం కరోతి చేత్ " గీతా ధ్యానతత్పరుని కొండలంతటి పాపాలు కూడా పటాపంచలవుతాయి. పరమాత్మ దర్శనం కలుగుతుంది.

పూర్వకాలంలో గీతను శూద్రులు పఠించరాదనేది బహుళంగా ఉండేది. కానీ నేటికాలపు జనుల పుణ్యమో అన్నట్లు ప్రతి ఒక్కరూ స్త్రీ పురుషాది, చిన్న పెద్ద తారతమ్యము లేక ఎల్లరు పఠించి ధన్యులు కావచ్చుననే అభయసందేశం శ్రీశ్రీశ్రీ సద్గురు మళయాళ స్వాములవారు వొసంగి, అందరినీ గీతోపదేశమునకు అర్హులుగా చెప్పి మహోపకారం గావించారు. ఆ మహామహుని కృషికి ఆంధ్రావని ఎంతో ఋణపడి వున్నదని అన్ననూ అతిశయోక్తికాదు.

పంచమ వేదమని ప్రసిద్ధి గాంచిన మహాభారతం పదునెనిమిది పర్వములలో భీష్మపర్వమునందు గీతోపదేశం చేయబడింది. ఇదియునూ పదునెనిమిది అధ్యాయములతో కర్మ, భక్తి, జ్ఞానములను కలిగి ఉపనిషత్తుల సారసంగ్రహమే ఈ భగవద్గీత.

మనవేద వాఙ్మయమున నెన్నియో వేదాంత గ్రంథములు కలవు. నాలుగు వేదములు, 108 ఉపనిషత్తులు, 18 పురాణములు, భారత, భాగవత రామాయణాది గ్రంథములెన్నియో ఉన్నవి. ఇన్ని గ్రంథముల చదివి, సారా సారములు గ్రహించుటకు, అల్పాయుష్కులు, అల్పబుద్ధులు బహురోగ సంజనితులైన నేటి మానవులకు కష్టతరమైనదిగానెంచి శ్రీ కృష్ణ భగవానుడు సర్వమానవోద్ధరణకై సర్వ వేదాంతసారముల నొకటిగావించి, కర్మ, భక్తి, జ్ఞాన, సముచ్చయమైన ఈ గీతోపదేశమును, అర్జునుని నెపముగానుంచి మన అందరికీ బోధించాడు.

" సారథ్య మర్జున స్యాదౌకుర్వన్ గీతామృతం తదౌ,
లోకత్ర యోపకారాయ, తస్మైకృష్ణాత్మనేమః "

అర్జునునకు రథ సారధ్యమును వహించి ముల్లోకములకందరికి ఉపకారము చేయవలెననడి తలంపుతో గీతామృతమును ప్రబోధించిన శ్రీకృష్ణ కృప అనన్య సామాన్యమైనది. ఆ భగవత్ కృపను మానవుడు సఫలీకృతం చేసుకోవాలంటే ఆ భగవద్గీతను నిత్య జీవితంలో మేళవింపు చేసుకోవాలి. అందుకు పుణ్యంకూడా కలసి రావాలి. లేకుంటే గీతపైన అందరికీ పూజ్యభావం కలుగదు. పాప ప్రక్షాళనము కలిగిన పుణ్యాత్ములకు మాత్రమే ఆ సద్బుద్ధి కలుగుతుంది.

గీతయందు మొత్తం పదునెనిమిది అధ్యాయములలో మొదటి అధ్యాయము అర్జున విషాదయోగము. ఇందు శాస్త్రమునకు అధికారి, అనధికారి అని ఇద్దరి పాత్రలు బాగా నిరూపింపబడినవి. అధికారిగా అర్జునుని, అనధికారిగా ధృతరాష్ట్రుని నిరూపించిరి. మనకు మొదటి అధ్యాయములోనే ఈ విషయం విశదమౌతున్నది. శాస్త్ర జ్ఞానమునకు అధికారి తగినవాడు తప్పుకాదు. పరుషవేది శుద్ధమైన యినుమును బంగారం చేయగలదుగానీ తుప్పుపట్టిన ఇనుమును బంగారుగా చేయజాలదు. అలాగే పాప పంకిలమున్న మానవునికి శాస్త్రం ఉపయోగపడదు. పాపం పరిహరించిన శుద్ధహృదయునికి మాత్రమే శాస్త్రం జ్ఞానమును కలిగించి ఉద్ధారకం చేయగలదు.

" తపోభిః క్షీణాపాపానాం " తపస్సు తోపాపం క్షీణించిన వారికి జ్ఞానంగానీ, భక్తిగానీ కలుగుతుంది. పాపభారంతో కృంగిపోయిన వారికి కలుగనేరవు. సింహము పాల పట్టి నిలిపేటందుకు ఒక్క బంగారు పాత్ర మాత్రమే ఉపకరిస్తుంది. ఇతర పాత్రలు పనికిరావు. కారణమేమన అన్యపాత్రలయందు సింహముపాలు పోసిన అవి తూట్లు పొడుచుకొని వెలకి పారిపోతాయి. అగ్నిద్రావకం పట్టి నిలపడానికి గాజుపాత్రలే కావాలి. అలాగే బ్రహ్మజ్ఞానము కలగాలంటే అద్దంవలే శుద్ధమైన హృదయం కావాలి. కామాస్తకమైన హృదయం పనికిరాదు.

" శుభమా అని మనం గీతాగ్రంథం తెరవగానే ధృతరాష్ట్ర ఉవాచ " అని అంధుని దర్శనం కలుగుతుంది. ఇందుకు కారణం లేకపోలేదు. వ్యాసుడు సాక్షాత్తు నారాయణ సంభూతుడు. గీతాగ్రంథమును శ్రవణము చేయువారు ధృతరాష్ట్రునివలే అనధికారులై శ్రవణం చేయకండి అని మన అందరినీ ఆయన హెచ్చరిస్తున్నాడు. ధృతరాష్ట్రుని భౌతికంగానే కాక పారమార్థికంగా కూడా గ్రుడ్డివాడే. భారతంలో విదురుడు ధృతరాష్ట్రునికి ఎన్నో ధర్మరహస్యములు బోధనచేశాడు. కానీ ఆయన బోధనలన్నీ బూడిదలో పోసిన పన్నీరులాగా వ్యర్థములయ్యాయేకానీ ఒక్కటి గూడా పట్టుబడలేదు.

మానవులకు అన్నింటికంటే మోహము చాలా చెడ్డది. మోహగుణానికి వశులై అసత్యమైన వాటిని సత్యమని, సత్యమైనదానిని అసత్యమని భావించే ప్రమాదముంది.

" అనిత్యమసుఖంలోకే " అనిత్యమైన లోకాన్ని నిత్యమని, దేహము నిత్యమని, కాలం గతించి, శరీరం ముడుతలు బడిపోతున్నా మోహం మాత్రం మానవుణ్ణి వదలదు.

ఇంకా ఇంకా బ్రతకాలనీ ఏవేవో చేయాలని మానవుడు తపనబడి రాబోవు మృత్యువును గూడా గ్రహించలేడు.

**" మోహం జహి మహామృత్యు దేహదార సుతా దిషు**
**యంజిత్వామునయోయాఽతి తద్విష్ణోః పరమం పదం "**

భార్యాపుత్రాదులయందు అతి ప్రేమ ఏదికలదో అదే మోహము. అదియే మృత్యురూపమగు సంసారమును కలుగజేయుచున్నది. ఇట్టి మోహమును జయించి మునీశ్వరులు ఏపదమును పొందుచున్నారో అదియే పరబ్రహ్మ స్థానము అని శంకరులవారు తెలిపివున్నారు. అన్నింటికీ మూలము దేహాభిమానము. ఈ దేహాభిమానము లేనివారు సర్వవ్యామోహములను జయించిన వారగుదురు.

**" దేహాభిమాన పాశేనచిరం బద్ధోసి పుత్రక**
**బోధోహం జ్ఞాన ఖడ్గేన తన్నికృత్య సుఖీభవ "**

అని ఉపనిషత్ వాణి " గురుబోధ " అను వివేక ఖడ్గముచేత " నేను దేహము " అను అజ్ఞాన పాశమును ఖండించి సుఖివికమ్ము అని బోధించుచున్నది. తనదిగాని దేహము తనదని భ్రమించుటయే అజ్ఞానము.

తనదిగాని రాజ్యమును తనదని భ్రమించిన వాడు ధృతరాష్ట్రుడు. పాండురాజు ఆ దేశముపై ధృతరాష్ట్రునికి రాజ్యాధికారిగా జేసిరేగాని వాస్తవికంగా తనకు ఆ అధికారంలేదు. కాన తన తదనంతరం రాజ్యాధికారం పాండవులకు చెందవలెనేగాని, తన కుమారులైన కౌరవులకు అర్హతలేదు. పాండవులకు రాజ్యాధికారము వొప్ప జెప్పవలసిన సమయముమొచ్చినా కల్లబొల్లి మాటలు జెప్పి కంటతడి బెట్టి, నేనేమి చేయుదు? ధుర్యోధనాదులు నామాట వినకున్నారని సమయాన్ని దాటవేసిన దుష్టబుద్ధి. సంధి రాయబారములు కుదరక యుద్ధం నిశ్చయించి యుద్ధమునకై వెళ్ళినివారిని గురించి నంజయుని ఇలా ప్రశ్నిస్తాడు.

**" ధర్మక్షేత్రే కురుక్షేత్రే, సమవేతా యుయుత్సవః**
**మామకాః పాండువాశ్చైవ కిమకుర్వత సంజయ "**

ఓయీ! సంజయా! నా కుమారులు, పాండవులు యుద్ధము చేయుటకై కురుక్షేత్రమున్కు వెళ్ళిరికదా! వారు అక్కడ ఏమిచేసిరి? అన్నాడు. యుద్ధానికి వెళ్ళినవారు యుద్ధభూమిల్లో యుద్ధము చేయక విందులారగిస్తారా! ఇది ఎంత విడ్డూరమైన ప్రశ్నో చూడండి. యుద్ధానికి వెళ్ళినవారు యుద్ధం ఎలాచేశారు? అని ప్రశ్నిస్తే సబబుగాని " ఏమిచేసిరి " అన్న దీని అంతరార్థం ఏమిటి? అంటే ఆ ధర్మక్షేత్రం వెళ్ళిన తర్వాత క్షేత్ర

ప్రభావం వల్ల ధుర్యోధనాదులకు ఏమైనా బుద్ధిమారి యుద్ధము మాని, ధర్మపరుడై, వారి తండ్రిదైన న్యాయమగు అర్ధరాజ్యం వారికిచ్చేనా! లేక ఆ క్షేత్ర మహిమతో ఇంకనూ ధర్మబుద్ధి తన సర్వస్వాన్ని ధుర్యోధనాదులకే విడిచెనా! అని గ్రుడ్డిరాజు ఆంతరిక కుటిల స్వభావము.

సంజయుడు కూడా ప్రజ్ఞావంతుడు గాన అంధరాజుగారి అభిప్రాయము పసిగట్టి " యత్రయోగీశ్వరః కృష్ణోయత్ర పార్ధోధనుర్ధరః తత్రశ్రీర్విజయోభూతిః ధ్రువానీతర్మ తిర్మమ " యోగీశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుడు ధనుర్ధారియైన అర్జునుడు యెచ్చట వుందురో అచటనే విజయలక్ష్మి నెలకొని వుండును అని ఒకే ఒకమాట అంధరాజు గుండె అదిరేటట్లు చెప్పినట్లు చెప్పివేశాడు.

గీతయందు మొదటి శ్లోకం చాలా భావ గంభీరమైన శ్లోకం " క్షేత్ర " మనగా ఇక్కడ " దేహమని " భావించి అర్థము చేసుకొన్న ముముక్ష లోకానికి ఎంతో శ్రేయస్సువుంది.

" క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి, సర్వక్షేత్రషు భారత " అని భగవానుడే పదమూడవ అధ్యాయంలో తెలిపి వున్నాడు. క్షేత్రము అనబడు ఈ శరీరములన్నింటి యందు క్షేత్రజ్ఞుడను నేనేయని చెప్పియున్నాడు గావున క్షేత్రమనగా దేహముగా అర్థము చేసుకొనిన చాలా ఫలదాయకముగా నుండును.

" అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి,
పుణ్యక్షేత్రే కృతం పాపం వారణాశ్యాం వినశ్యతి "

పూర్వము ఇతర జన్మములందు చేసుకున్న పాపము పుణ్యప్రదమైన ఈ మానవ దేహమునందు పోగొట్టుకొనవచ్చును. కారణమేమన అన్యక్షేత్రములలో (ఇతర జన్మలలో) సస్వరూపజ్ఞానమునకు కావలసిన సాధనములులేవు. మానవ దేహమునందు జ్ఞానార్జనకు కావలసిన శక్తి స్వతస్సిద్ధముగా వున్నది. కాబట్టి ఈ దేహము పుణ్యక్షేత్రముగా భావింపవలెను. మానవ శరీరం వచ్చినప్పటికీ అజ్ఞానముతో దుష్కర్మలు చేసినట్లయితే, వారణాసియందుగల పవిత్ర గంగా ప్రవాహములో స్నానమాచరించి సర్వపాపాలను ప్రక్షాళనమొనర్చు కొందురు.

అనగా గురు బోధారూపమైన జ్ఞానగంగ యందు జీవభ్రాంతియను పాపమును పోగొట్టుకొనవలెనని భావము. కనుక గురుస్థానము కాశీ క్షేత్రము (వారణాసి) వంటిది అని శృతి వాక్యము.

కం॥ ఎక్కడ గురువరు దుండిన
నక్కడనే కాశి, గురు పదాంబుజముల్
చక్కని గంగానదియగు,
దక్కిన కార్యముల మనసు దగ్గులగనేలా

అనగా ఈ మానవ దేహము ధర్మస్వరూపమైనది. అన్య జీవుల వలే పాప జన్మకాదు. ఇట్టి పవిత్ర దేహమును పొందిన మానవుడు తాననగా ఎవరు? తన స్వరూపమనగా ఏమిటి? బాగా విచారించి తెలుసుకొనవలెను.

ఈ అధ్యాయమును అర్జున విషాదయోగము అనుటచేత " విషాదము " అనగా దుఃఖము, విచారము అని అర్థము. ఇది అర్జుననికేకాదు లోకంలో ప్రతి మానవునికి ఈ దుఃఖము వుండనేవుంది. రాజ్యములేలే గొప్ప రాజులకైనా ఈ దుఃఖ, విచారములు తప్పినవికావు. దుఃఖమునకు కారణములు అనేకములుగా వుండవచ్చు. అర్జునుని దుః ఖమునకు కారణము తనతో యుద్ధము చేయుటకై వచ్చి తన ఎదుట ప్రతిపక్షముగా నున్నవారిని చూచి దుఃఖితుడయ్యాడు.

" నచశ్రేయోను పశ్యామి హత్వాస్వజన మాహవే " ఈ యుద్ధమునందు తన బంధువర్గమును చంపుటకు అర్జునుని మనసు అంగీకరించలేదు. తన తండ్రులను, తాతలను, గురువులను, మిత్రులను చంపుట అధర్మమనిపించింది. ఇట్టి అధర్మ యుద్ధము చేయుటకన్నా, వారి చేతనే నేను చంపబడినను నాకు మంచిదేకాని, యుద్ధము చేయుటకు సమ్మతించలేనంటూ ధర్మాన్ని ఎంచి, పాపభీతితో దుఃఖించాడు. అయితే అర్జుననకు కలిగిన దుఃఖము, లోకమందు మానవులకు కలుగు దుఃఖము విషయ్గముల గురించే. అర్జునుడు జీవితంలో ఎన్నడూ దుఃఖించలేదు, విచారించలేదు. ఈ కౌరవ పాండవ యుద్ధమునందు మాత్రమే ఆయనకు దుఃఖము కలిగింది. ఆయన విచారము యోగమైంది. మనకు కలుగు దుఃఖాలు, విచారాలు మనపాలిటికి గ్రహచారాలయ్యాయి.

దైవం గురించి, ధర్మం గురించి ఏడ్చే ఏడుపు, చేసే విచారం యోగమౌతుంది. సంసారం గురించి, ప్రపంచం గురించీ విచారించే, విచారం దుఃఖం మనపాలిటికి రోగమై కూర్చున్నాయి. అర్జునుని యొక్క విషాదమే భగవద్గీతా గ్రంథంగా మారి మనకు అంద జేయబడింది. ఆయనకు ఆ విషాదమే కలుగకపోతే మనకీ గీత అంది యుండేదికాదేమో! ఏడ్చే ఏడుపేదో నేర్పెరిగియుంటే అదే మన పాలిటి యోగమౌతుంది. మనం కూడా అర్జునునిలాగా, రామకృష్ణ గురుదేవునిలాగా ఏడ్వాలె. అది చేతకాకపోతే వారి మాదిరి ఏడవలేక పోతిమే ! అని అయినా ఏడ్వాలె.అపుడే భగవదను గ్రహం కలుగుతుంది. " కాంతా కనకముల కొరకు కడవలకొద్దీ కన్నీరు కారుస్తారే! భగవంతుని గురించి కన్నీరు కార్చేవారు లేరు గదా! " అని రామకృష్ణ గురుదేవులు వాపోయారు. తాను తన జీవితంలో రోజులు లెక్క పెట్టుకుంటూ, ఇంకా నాకు దైవదర్శనం కలుగకపోయెనే అని వెక్కివెక్కి ఏడ్చేవాడు. ఆయన ఏడుపు అమ్మ అనుగ్రహమునకు పాత్రుని చేసింది. అమ్మదర్శనం కలిగింది. మనం ఏడ్చే ఏడ్పులు రోగాలుగా మారి డాక్టర్ల దర్శనం, ఆస్పత్రుల దర్శనం కలిగిస్తున్నాయి.

అర్జునుడు ముందు ధర్మప్రసంగాలు ఏకరువు పెట్టాడు. అయినా కృష్ణ భగవానుడు మౌనం వహించి వింటూనే వున్నాడు. అన్నీ తనకు తెలిసినట్లు మాట్లాడుతున్న అర్జునుని యొక్క ప్రజ్ఞాపాటవము గమనిస్తూనే వున్నాడు. ఆఖరికి " శిష్యస్తేహం శాధిమాంత్వాం ప్రపన్నం " అంటూ శరణాగతిని పొందేవరకూ శ్రీ కృష్ణపరమాత్మ నోరువిప్పలేదు. కారణమేమన, హృదయంలో అహంకారముడగనంత వరకూ జ్ఞాన బోధ ఫలించలేదు. ఆ అహంకారం నశించవలె, నిరహంకృతి కలిగినపుడే బోధ సఫలమౌతుంది. గాననే శ్రీకృష్ణ పరమాత్మను, అర్జునుడు తనను శరణువేడుతూ, నేను నీకు శిష్యుడను నిన్ను శరణు బొందుచున్నాను. నన్ను కడతేర్చమంటూ పలుకగా అప్పుడు తన గీతోపదేశాన్ని మొదలపెట్టాడు.

కొందరు మహాత్ముల సన్నిధికి వెళ్ళినపుడు మహాత్ముల సన్నిధిలో తామెట్లు మెలగవలెనో, ఎట్లుండవలెనో తెలుసుకోలేరు. వారికున్న మిడి మిడి జ్ఞానం కాస్తా వారి ముందు ఏకరువు పెట్టి, అన్నీ తెలిసిన వారమన్నట్లు వాచాలత్వం గలిగివుంటాడు. కొందరు బుద్ధిమంతులైతే, వెంటనే మహాత్ముల ఉదాసీనత్వం గమనించి తెప్పరిల్లి వారికి శరణాగతులై వారిద్వారా మహోపదేశం పొంది ధన్యులవుతూ వుంటారు.

మహాత్ముల సన్నిధికి వెళ్ళినపుడు ఫలభారంచే వృక్షం వొంగి వున్నట్లు వినయ విధేయతలతో వినమ్రుడై వుండాలి. అప్పుడే ఆ మహాత్ములకు అట్టివారిపై కృపగల్గి సంసారసాగర తరుణోపాయమునకు చక్కటి బోధచేసి, తరింపజేస్తారు.

ధృతరాష్ట్రుని లాగ మమకార, మోహముల పెట్టుకొని అజ్ఞానముగల మూర్ఖమానవులు కుడితి కుండలో పడిన ఎలుకలాగా, తేనెలో పడిన ఈగలాగా, పాలలో పడిన చీమలాగా సంసారంలోనే మునిగి తేలుతూ, కొట్టు మిట్టాడుతుంటారేగాని, పరమాత్మ చింతనాసక్తి కలగడానికి గాని, ప్రపంచ విషయ భోగాలయందు విరక్తి కలుగుటగానీ లేక, మహాత్ములను ఆశ్రయిద్దామనే సుబుద్ధి కూడా వారికి కలగక మాయలో పడివుందురు.

**సీ॥ అర్థంబు భూములు నార్జింపగా దీరు**
**ఘన మంది రంబుల గట్టు దీరు**
**సతులతో భోగింప సౌఖ్యమొందుట దీరు**
**సతుల వేడుకలెల్ల జూడదీరు**
**బుట్టు ముచ్చటలను ప్రొద్దు పుచ్చగ దీరు**
**దిరముగా పొరుగిండ్లు దిరుగుదీరు**
**గార్యంబు పెంచుచూ కలహమాడగదీరు**
**జులువుగ పరుల దూషింప దీరు**

గీ॥ గోరినీ చాత్మల నెల్ల గొల్వగోగదీరు
మందమతులగు నీ దుష్ట మానవులకు
బవల రాత్రియుదీరదు పరమ గురుని
చెంత జేరంగ పరమార్థచింత జేయ.

అన్నట్లు ప్రపాంచిక విషయాదులబడి తీరిక లేకుండా వృథాగా జీవితం పాడు చేసుకుంటారేగాని, భక్తిజ్ఞానముల నార్జించి, జన్మ చరితార్థం చేసుకొనవలెననే బుద్ధిపుట్టదు అజ్ఞానులకు. ఇట్టివారి గురించి ప్రహ్లాదుడేమంటున్నాడో చూడండి.

సీ॥ కంటిరే మనవారు ఘనులు గృహస్థులై
విఫలులైగ్గె కొన్న వెట్టి తనము
భద్రార్థులై యుండి పాయరుసంసార
పద్ధతినూరక పట్టు బడిరి
కల యోనులందెల్ల గర్భాదవ్యస్థల
బురుషుండు దేహియైపుట్టు చుండు
దన్నె రుంగడు కర్మ తంత్రుడై కడపట
ముట్టడు భవశతములకు నైన

ఆ॥ దీన సుఖములేదు, దివ్యకీర్తియులేదు
జగతి బుట్టి, బుట్టి, చచ్చి, చచ్చి
పొరలనేల మనకు బుట్టని చావని
త్రోవ వెదికి కొనుట దొడ్డ బుద్ధి.

అంటూ ప్రహ్లాదుడు జీవులు పడుతున్న పాట్లు గురించి ఎలా వర్ణించాడో చూడండి. మానవుడు ఆనందం కోరుకుంటాడే కానీ, ఆనందానికి మార్గమేదో తెలుసుకోడు.

వెర్రితనముతో సంసారమనే ఊబిలో కూరుకుపోతాడు. తల్లి గర్భంనుంచి రకరకాలుగా, నానా అవస్థలుపడి జన్మిస్తాడు. తననుతాను తెలుసుకోలేడు. వందల కొద్ది జన్మాలు ఎత్తినా కర్మబంధాల చిక్కులనుంచి బయట పడలేడు. భగవంతుని సన్నిధి చేరుకోలేక పోతున్నాడు. గాన ఈ సంసారంవల్ల ఏమీ సుఖంలేదు అన్నీ దుఃఖాలే. లోకంలో పుట్టడం చావడం అనే జనన మరణాల బాధలెందుకు పడాలె? పుట్టి చావని మంచి మార్గం యేదో లోకానికంతటికీ మహోపదేశం చేశాడు. పుట్టేది, గిట్టేది గొడ్డుబుద్ధి. పుట్టిన తరువాత మళ్ళీ పుట్టకుండా వుండేది దొడ్డ బుద్ధి. ఈ మానవునికి దొడ్డ బుద్ధి వుండాలే తప్ప గొడ్డుబుద్ధి మాత్రం వుండరాదు. పవిత్రమైన బుద్ధితో అర్జునుడు గీతోపదేశ శ్రవణం చేశాడు

" నష్టోమోహః స్మృతిర్లబ్ధా, త్వత్ప్రసాదాన్మయాచ్యుత, స్థితోస్మిగత సందేహః కరిష్యేవచనం తవ"

ఓ అచ్యుతా ! నీ దయవలన నా మోహం తొలగింది. జ్ఞానం కలిగింది. సందేహములు పటాపంచలైనవి. ఇక నీవు చెప్పినట్లు చేస్తాను. అంటూ మోహనివృత్తిని బొందాడు.

కాబట్టి అర్జునుని లాగా భక్తి విశ్వాసములతో గీతా జ్ఞానమును శ్రవణం చేసి సంసార మోహ నివృత్తినిబొంది శాశ్వతానందమైన పరమ పదవినిబొంది తరించవలెను. ఇదే మానవ జన్మయొక్క ముఖ్య ఉద్దేశ్యము.

పరీక్షిత్తు తాను మృత్యు ముఖమున వుండినట్లు తెలుసుకుని, ఏడు రోజులు భాగవతమును శ్రవణంచేసి ముక్తిని పొందాడు. అట్టి తీవ్రమైన ఏకించిత్తూ ప్రాపంచిక విషయములుండరాదు.

గీతోపదేశమును అర్జునుడు విన్నాడు. ధృతరాష్ట్రుడు విన్నాడు. ఇద్దరూ విన్నది గీతనే. ఇక చెప్పిన వక్తలు ఇద్దరూ గొప్పవారే. ఒకరు కృష్ణ పరమాత్ముడు, ఇంకొకరు సంజయుడు. కానీ ధృతరాష్ట్రునియందు గీతాబోధ ఫలించలేదు. అర్జునుని యందు ఫలించింది. కారణం?

ధృతరాష్ట్రుడు అంతఃపురంలో నిశ్శబ్ద నిర్మల వాతావరణంలో సింహాసనాధిష్ఠుడై సంజయునిచేత గీతను శ్రవణం చేశాడు. కాని చిత్త ఏకాగ్రతలేదు. అర్జునుడు పదునెనిమిది అక్షౌహిణీల సైన్యముల మధ్య రణగొణధ్వనుల మధ్య, చిత్తము నిర్మలంచేసి ఏకాగ్రతతో గీతను శ్రవణం చేదాడు. అందువల్లనే అర్జునుని యందు గీతాజ్ఞానం ఫలించింది. ధృతరాష్ట్రునివలె చిత్తపరాధీనంలో శ్రవణం చేయక, అర్జునునివలె ఏకాగ్ర చిత్తముతో శ్రవణం చేయవలయునని వ్యాసుడు, ధృతరాష్ట్రుని పాత్ర గీతలో ముందుచి మనకు అధికారత్వమును ఋజువు పరచి చూపించినాడు.

శ్రద్ధ శ్రవణానికి చాలా ముఖ్యము. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం. శ్రద్ధగలవారికే జ్ఞానం సిద్ధిస్తుంది. అశ్రద్ధాపరులకు జ్ఞానం ఫలించదు.

" అశ్రద్ధదానాః పురుషా ధర్మస్యాస్యపరన్తప,
అప్రాప్యమాం నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని "

అని మునుముందు భగవంతుడే సెలవిచ్చాడు గీతలో. దైవమునందు, ధర్మమునందు, విశ్వాసములేని వారు, శ్రద్ధలేనివారు భగవంతుని పొందజాలక మృత్యురూపమున సంసార సముద్రమున మునిగుపోదురని భావము. గాన శ్రద్ధగల వారికి

అర్జునుని లాగా గీతా జ్ఞానసిద్ధి తప్పక కలుగును. ఒక తీర్థమునందు గానీ, ఒక వైద్యుని యందుగానీ, గురువునందు గానీ మన మెంతెంత శ్రద్ధా విశ్వాసములు గలిగివుందుమో, అంతం ఫలం మనకు చేకూరగలదు. సంశయాత్మావినశ్యతి అన్నట్లు సంశయము గలవారు దేనిని పొందలేరు. అట్టివారు. బాగా చెడిపోదురు. శ్రద్ధగలవారు భూమిపైన గూడా ఓడ నడిపించగలరని మళయాళ స్వాములవారు చెప్పేవారు. గావున శ్రద్ధా విశ్వాసములు గలిగి గీతా గ్రంథమును పఠించి, అందలి జ్ఞానమును నిత్యజీవితమున అనుభూతి యొనర్చుకొని జీవితమును ధన్యము గావించుకొందురుగాక. గీతాచార్యుడు మిమ్ములను అనుగ్రహించుగాక.



# 2వ అధ్యాయం

# సాంఖ్యయోగం

**శ్లో॥ వేదేషు పౌరుషం సూక్తం, ధర్మశాస్త్రేషు సుమానవః**
**భారతే భగవద్గీతా పురాణే షు చ వైష్ణవః**

వేదములో పురుష సూక్తమును పురాణములలో విష్ణుపురాణము ధర్మశాస్త్రములలో మనుధర్మశాస్త్రము ప్రధానములైనట్లు భారతమునందు భగవద్గీత చాలా ప్రసిద్ధమైనది. సర్వశాస్త్రము ఈ గీతా అన్ని శాస్త్రములకంటే గీత చాలా ముఖ్యమైనది. గీత రెండవ అధ్యాయం సాంఖ్యయోగం. ఆత్మానాత్మా విచారమునే సాంఖ్యమని అంటారు. " సాంఖ్యమాత్మస్వరూప విచారకంబు " అని సీతారామంజనేయ సంవాదం. " అవి చారేణ కృతో బద్ధో, విచారేణ నివర్తతే" విచారం చెయ్యని కారణముచేత మానవుడు బద్ధుడైనాడు. ఆత్మానాత్మా విచారం బాగా నల్పి, "ఆత్మ" అనగా నేదో, అనాత్మ అనగా నేదో తెలునుకొన్నవారికి ఈ సంసార బంధముండదు అని ఉపనిషత్ వాణి.

నేటి నవనాగరిక మానవునికి అన్నింటికీ తీరుబడి వుంటుంది గాని ఆత్మ విచారానికి మాత్రం తీరుబాటు వుండదు. కాలమంతా కాంతా కనకాల గురించి, కడుపు కక్కుర్తి గురించి, నిరంతరం ఆలోచిస్తాడే తప్పా, తన గురించి తాను తెలుసు కోవటానికి సమయం లేదంటున్నాడు.

" అచ్చపు చీకటిబండి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై " అన్నట్లు అజ్ఞానమనే అచ్చపు చీకటిలోబడి, దేహాదుల గురించి, ఇంద్రియ విషయములను తృప్తిని గావించుటకే కాలం అంతా హారతి కర్పూరం లాగా హరింప చేసుకుంటున్నాడే గాని జన్మ సాఫల్యమైన జ్ఞానం గురించి కొంచమైననూ ప్రయత్నించలేకున్నాడు.

తే॥ "పగలు పొట్ట కొరకు బహు ధనార్జన చింత
పొలతి తోడ రాత్రి భోగ చింత
మోక్ష చింత యింక మూఢుల కెపుడురా
ఆర్థిహరణ కృష్ణ యాదిదేవ"

అన్నట్లు పగలంతా ధనార్జన చింత, రాత్రి నిద్రా భోగముల చింత, ఇక ఈ మూఢమానవులకు మోక్షచింత ఎపుడు కలుగుతుంది! భోగాలు అనుభవించే కొద్దీ అగ్నికి ఆజ్యము తోడైనట్లు, భోగాభిలాష పెరుగుతుందే తప్ప, తృప్తిచెందదు. ఈ భోగాభిలాష నశించదు.

క॥ "కామోప భోగ సుఖములు
వేమారును పురుషుడను భవింపుచున్నన్
కామంబు శాంతి పొందదు
ధూమధ్వజుదాజ్య వృష్టి తాగుదువగనే

క॥ ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములు, తనువు ముదిసెన్ తనకున్
ముదియనివి రెండు చిక్కెను
బ్రతికెడు తీపియును, విషయ పక్ష స్పృహాయున్"

అని యయాతి తన భోగానుభవం గురించి ఎట్లు తెలిపాడో చూడండి. పండ్లూడినా కనుచూపు తగ్గినా, వెంట్రుకలు తెల్లబడినా, దేహం ముదిసి వంగిపోయినా, వడ వడ వణికి పోతున్నా, బ్రతికే తీపి, విషయ చింతన, మాత్రము మానవుని మనసున మిగిలే వుండి పీడిస్తూ వుంటాయట.

యయాతి తన యవ్వనం చాలక, తనకుమారుని యవ్వనం కూడా తీసుకుని భోగాలను అనుభవించి తృప్తి జెందలేకపోయాడు. కాబట్టి లౌకికమైన భోగము మానవునికి శాశ్వతానందము నివ్వజాలదు. అందుకు విరక్తియే పరమ ఔషధము. విషయములందు విరక్తి, వైరాగ్యము కలగనిదే అజ్ఞాన జనితమైన మోహ పాశములు విడనాడవు. ఈ రెండవ అధ్యాయమున జ్ఞానముయొక్క మహత్తర గొప్పతనము, దాని పవిత్రతను గూర్చి చక్కగా వర్ణింపబడినది. "నహిజ్ఞానేన సదృశం, పవిత్రమిహ విద్యతే"

జ్ఞానమునకు మించిన పవిత్రమైన వస్తువు ఇంకొకటి ప్రపంచమున మరేదియూ లేదనియు, జ్ఞాన మొక్కటే సంసార మోహపాశాదులను, వాటి ఆద్యంతిక దుఃఖనివృత్తి ఆనందప్రాప్తి చేకూర్చగలదనిరి. జ్ఞానం లబ్ధ్వా పరం శాంతిః అనియూ, మునుముందు అధ్యాయములలో ఇదే జ్ఞానమును గురించి తెలుపబడివున్నది.

అర్జునుడు యుద్ధరంగమున యిరుసేనల మధ్య తన రథాన్ని నిలుపమని, తనతో పోరుకు వచ్చిన వారందరినీ ఒక్కతూరి పరికించవలెనని వాసుదేవుని వేడగా, భగవానుడు అట్లే గావించెను. ఇరు సేనల మధ్య నిలిచినతాను, తనముందు యుద్ధ సన్నద్ధులైన వారినిజూచి, కృష్ణా ! పూజనీయులగు భీష్మ ద్రోణులను యుద్ధమునందు ఎదిరించి బాణములతో కొట్టుటయా! మహనీయులగు గురువులను చంపుటకంటే లోకమున నింద్యమైన పనిగలదా!. ఇట్టి నింద్యమైన చేయుటకంటే లోకమున భిక్షమెత్తి బ్రతుకుట మంచిది. వారిని వధించినచో వచ్చు రాజ్యసుఖము, నెత్తురు కూటిలాంటి భోగము నాకువలదు. అయినా యుద్ధమున మనమే జయింతుమని ఏమి నమ్మకము, జయాపజయములు దైవాధీనములకదా! అని బిన్నవదనుడై కర్తవ్య విమూఢుడై ఇది యుద్ధమని ఏదియు నిర్ణయించలేక డోలాయమాన చిత్తుడై తనముందు రథముపై నున్న వాసుదేవున్ని ఈ విధంగా శరణాగతుడై ఇలా అన్నాడు.

కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామిత్వాం ధర్మ సంమ్మూఢచేతాః
యచ్ఛ్రేయఃస్యాన్నినిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తే హంశాధిమాం త్వాంప్రపన్నమ్

మనోదౌర్బల్య దోషమువలన నా స్వాభావికశక్తి చిన్నాభిన్నమైనది. నా చిత్తమునందలి ధర్మాధర్మ వివేకము నష్టమైపోయినది. నీకు విన్నవించు కొనుచున్నాను. ఏది నాకు శ్రేయస్సో దానిని నాకు చెప్పుము. యుద్ధం చేయుట మంచిదా, మానుట మంచిదా తెలియకున్నది అని శరణాగతినొంది నేను నీకు శిష్యుడను, నీవు నాకు గురవు, నాకు హితకరమైన దేదియో దయచేసి సెలవిమ్ము.

" అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపిచాధి పత్యమ్ "

ఎదురులేని చక్రవర్తి పదవి లభించినా లేక సరులోక సామ్రాజ్యము చేజిక్కినా, యిప్పుడు నా సర్వేంద్రియములను కాల్చి తినుచున్న ఈ దుఃఖము చల్లారేటట్లు లేదు అని కన్నుల నీరు కారుచున్న వదనుడై యుద్ధమునుమాని కూర్చుండిపోయెను.

అట్టి మ్రానువలె కూలబడియున్న అర్జునుని చూచి శ్రీకృష్ణ భగవానుడు " అశోచ్యానన్య శోచస్త్వ " అంటూ గీతోపదేశము మొదలుపెట్టాడు. గీత బహుశా ఇక్కడనుండే ప్రారంభమైనట్లు పెద్దల అభిప్రాయము. ఎందుకనగా మనము నిత్యపారాయణము చేయునపుడు అంగన్యా కరన్యాసములలో " అశోచ్యా నన్యచో చస్త్వ, ప్రజ్ఞావాదాంశ్చ భాషసే " ఇతి బీజం అని చెప్పుకుంటూ, అంటే ఇది గీతకంతటికి బీజం అని భావం. గీతోపదేశమునకు ఈ శ్లోకం (2–6) బీజ శ్లోకముగా చెప్పబడినది.

లోకములో ప్రతివారును గుట్టుగానో రట్టుగానో ఈ దుఃఖమును అనుభవిస్తూనే యున్నారు. అమాయకులైతే రట్టుగా ఏడుస్తారు. కొంచెం వివేకులు గుట్టుగా ఏడుస్తూవుంటారు. సృష్టిలోగల మానవులేగాదు ప్రతిజీవికూడా దుఃఖమును అనుభవిస్తూనే ఉటుంంది. జీవి దుఃఖమునకు కారణమేమో తెలుసుకోలేక పోతున్నాడు.

యుద్ధరంగములో అర్జునుడు - భీష్మద్రోణ కృపాచార్యులైన బంధువుల, గురువులను జూచి దుఃఖితుడైనాడు. అంటే వారు యుద్ధములో చస్తారనిగాదు, చచ్చేవారు నా వారనే మోహము, మమతే దుఃఖమునకు కారణం.

సామాన్యంగా లోకములో జనులు చచ్చేవారిని గురించిగాదు ఏడ్చేది, చచ్చేవారు నావారు అనే మోహంతో ఏడుస్తున్నారు గాన విచారించి చూచినట్లైన చనిపోయిన గురించి దుఃఖం కాదనియు చచ్చేవారు తనవారు అనే మోహోమే దుఃఖకారణమని అర్థమౌతుంది. కాబట్టి దుఃఖనివృత్తి, మోహనివృత్తి ముఖ్యకారణము.

లోకములో ప్రతిజీవి కూడా ఆద్యంతిక దుఃఖనివృత్తి ఆనంద ప్రాప్తగురించే అహరహం పాటుపడుతున్నది కాని నిజమైన దుఃఖహారిత్యమునకు మార్గమేమిటో తెలుసుకోలేక, జననమరణాలపాలై జన్మలకు జన్మలు ఎత్తవలసి వచ్చినది. బాగా విచారించి ఈ దుఃఖమునకు కారణనేమో తెలుసుకోవలెను. మనకు తెలియనవుడు శాస్త్రమునుగాని, సద్గురువులనుగాని ఆశ్రయించి తెలుసుకోవలసియున్నది. అర్జునునిలాగా సద్గురువుల శరణార్థులమైతే వారు దుఃఖనివృత్తికి మార్గము, ఆనంద ప్రాప్తికి మహోపదేశం చేసి మనలనుద్ధరించగలరు.

ఈ శాస్త్రమునందు దుఃఖమునకు కారణం దేహమనియూ, దేహానికి కారణం కర్మయనియూ, కర్మకు కారణం రాగ ద్వేషములనియూ, రాగద్వేషాలకు కారణం సుందరత్వా, అసుందరత్వములనియూ, అందుకు కారణం ద్వయిత బుద్ధి. అద్వైయిత బుద్ధికి కారణం అజ్ఞానం అని దెల్పబడినది. మహాత్ముల అనుభవాక్యములు కూడా ఇదే అభిప్రాయమును దెల్పుచున్నవి.

కాబట్టి దుఃఖమునకు కారణం అజ్ఞానం అని తేలినది. అజ్ఞానమునట్లే యుంచి, పైపై ప్రయత్నములు ఎన్ని చెసినా దుఃఖము తాత్కాలికముగా పోవచ్చునోమ గానీ, సంపూర్ణంగా మాత్రం తొలగదు.

ఈ మధ్య ఒకాయన తన కుమారునికి తేలు కుట్టిందని డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. డాక్టరుగారు మందును ఇచ్చి తేలు కుట్టినచోట దీన్ని వేసి కాస్త మర్దన చేయండి. నొప్పి పూర్తిగా తొలగి పోతుందని మందు ఇచ్చిపంపాడు. ఆ పెద్దమనిషి నేరుగా ఇంటికి వెళ్ళి తేలు కుట్టి నొప్పితో బాధపడుతున్న పిల్లవాడిని అడిగాడు నీకు తేలు కుట్టిందెక్కడని.

అందుకు ఆ పిల్లవాడు అదిగో ఆ వాకిలి పంచన కుట్టిందని బదులు చెప్పాడు. ఈ పెద్ద మనిషి ఆ స్థలంలో డాక్టరు ఇచ్చిన మందేసి మర్ధన చేశాడట. వాకిలి పంచకు మందు వేస్తే అబ్బాయికి నొప్పి పోతుందా!

ఈ విధంగా వుంటుంది పామరుల కర్మకలాపాలు కాబట్టి దుఃఖానికి మూలకారణమైన అజ్ఞానం వైదొలగించిన, అజ్ఞాన జన్యమైన దుఃఖం పూర్తిగా సమూలంగా నివృత్తి అవుతుంది గానీ, భౌతిక కర్మకలాపములచే జీవునికి వున్న దుఃఖం పోవునదికాదు. అజ్ఞానం అనగానేమి? " అతస్మిన్ తద్బుద్ధిః రధ్యాసః " (విపర్యయం) యధార్థము గాని దానియందు యధార్థ బుద్ధి అనగా త్రాటిని జూచి పామనుకోవడం, ఎండమావులను జూచి నీటి ప్రవాహమనుకోవడం, ఇదియే అజ్ఞానం, అవిద్య అనికూడా అంటారు. ఒక వస్తువునందు ఇంకొకవస్తువును అరోపించటం, త్రాటిని జూచి పామనుకోవడం ఎట్ల అజ్ఞానమో అలాగ తానుగాని దేహమును తాననుకోవడమే అజ్ఞానము. బ్రహ్మమునందు ప్రపంచమును ఆరోపించుట ఆజ్ఞానంగాన ఈ రూపమైన అజ్ఞానం వైదొలగవలెనంటే ఉన్న వస్తువును ఉన్నట్లు చక్కగా విచారించి, సత్యవస్తువును తెలుసుకొనడం జ్ఞానం అనబడుతుంది. అట్టి వస్తు జ్ఞానం కలిగినపుడే అజ్ఞాన జనితమైన సర్వానర్థములు దుఃఖములు వైదొలగగలవు. గృహస్థునికి గృహము సౌకర్యార్థమై కల్పించుకొన్నట్లు జీవుడు తన సౌకర్యార్థము శరీరమనే ఇంటిని కల్పించుకొన్నాడు. ఇంటికి కలిగే శీతోష్ణాదులు ఇంటి యజమానునికి ఎట్లు అంటవో, ఇల్లు శిథిలమైన ఇంటి యజమాని ఎలా నశించడో అలాగే దేహసంబంధమైన వికారాలు దేహి అయిన జీవునికి (ఆత్మకు) అంటవు. జనన మరణాదులు దేహ ధర్మాలు, కష్టసుఖములు మనోధర్మాలు కర్తలే. బుద్ధిధర్మాలు తాను అయిన జీవునికి (ఆత్మకు) యివి ఏవి లేవు, కాని అజ్ఞానము వలన తనవి కాని ధర్మములైన కష్టసుఖాలను కర్తృత్వముఉలు. జనన మరణాలను, ప్రాణధర్మములైన ఆకలి దప్పికలను తనపై ఆరోపించుకొని జీవుడు దుఃఖితుడవుతున్నాడు.

**" వాసాంసి జీర్ణానియధా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా**
**న్యన్యాని సంయాతి నవాని దేహీ" (2-22)**

అన్నట్లు మనుష్యుడు జీర్ణించిన గుడ్డలను వదలి నూతన వస్త్రముల ధరించునో దేహమునందుండెడి జీవుడు జీర్ణ శరీరములను వదలి, మరలా క్రొత్త దేహములను పొందుచున్నాడు.

ఎవరూ ! పాతబట్టలు వదలి క్రొత్తబట్టలు ధరించినపుడు ఏడ్వరు. అలా వారిని అజ్ఞానులనే తలంచవలెను. తను ధరించుచున్న వస్త్రాలు ఎన్నైనా మారవచ్చు.

అతడు వాడు మారువాడుకాదు. అలాగే జీవునికి దేహము లెన్నైన మారవచ్చుగాని దేహి అయిన జీవుడు (ఆత్మ) మారువాడుకాదు. జననమరణములైన దేహధర్మాలు తనను ఎప్పుడు అంటవు. కావున ఇలా బాగా విచారించి చూచిన దేహపతనానికి దుఃఖించాల్సిన పనేలేదు.

సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబు
పురుషుండు దీనిలో పూర్వకర్మ
వశమున ఒకవేళవర్తించు దీపించు
తరియైన నొకవేళ దొలగిపోవు
జెడునేని దేహంబు చెడుకాని పురుషుండు
సెడదాతనికి నింతసేటు లేదు
పురుషునికి దేహపుంజంబునకు వేరు
గాని ఏకత్వంబుగానరాదు

ఆ॥ దారువుల వెలంగు దహనుని కైవడి
కాయముల జెరించు గాలిభంగ
నాళలీనమైన నభము చాట్పున వేరు
తెలియవలయుదేహి దేహములకు

అని భాగవతము. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశమనే పంచభూతములచే ఈ మానవ శరీరం తయారయ్యింది. భూమి అంశములు, చర్మం, మాంసం, యముకలు, వెంట్రుకల వంటివి.

నీటినుంచి మూత్రము, రక్తము వంటి. అగ్నినుండి ఆకలి. దప్పికవంటివి. గాలినుంచి కదలడం, నడవడం వంటివి. ఆకాశమునుండి కామ, క్రోధ లోభముల వంటివి. ఈ దేహమునందు ఏర్పడి మానవ దేహం తయారయ్యింది.

అలా పంచభూతములతో తయారయన ఈ దేహము జీవునికి భవనము వంటిది. ఈ భవనము వాటి శరీరములో ఆత్మ పురుషుడు పూర్వకర్మాను సారియై వర్తిస్తూ ఉంటాడు. కాలం తీరిపోగానే ఈ భవనము నుంచి వెళ్ళిపోతాడు. దేహం అశాశ్వతం. అందరిలోని ఆత్మ స్వరూపుడు శాశ్వతము. ఎప్పటికైనా దేహం చెడిపోతుంది కాని లోపలి ఆత్మ మాత్రము నాశరహితుడు. శాశ్వితుడు. దేహంవేరు దేహి అయిన ఆత్మ వేరువేరు కాని ఎప్పుడు ఒక్కటికాదు. కట్టెలందు అగ్నివలె దేహములందు వాయువు వున్నట్లు తామరతూడు లోపల ఆకాశమున్నట్లు, దేహంలో దేహి (ఆత్మ) అంటక, విలక్షణుడైవిలసిల్లుతూ ఉంటాడు. ఈ రహస్యం తెలియని అజ్ఞానులు మాత్రమే దేహం పుడితే నేను పుట్టాను అని, దేహం చస్తే నేను చచ్చానని దేహధర్మాలు తనపై ఆరోపించుకొని బాధపడుతూ ఉంటారు.

ఒకప్పుడు ఒక కుటుంబమువారు బెంగుళూరు నుండి మద్రాసుకు పోవలసి అంతా బస్సు ఎక్కి కూర్చున్నారు. కొన్ని గంటలు ప్రయాణము చేసి బస్సు మద్రాసు చేరుకొనింది. అందులో ప్రయాణం చేస్తున్న ఈ కుటుంబములోని పిల్లలు ఆ మద్రాసు వచ్చింది మద్రాసు వచ్చింది అని అరవటం మెదలు పెట్టారు. వాస్తవికంగా మద్రాసుకు బస్సు వచ్చిందేకాని మద్రాసు రాలేదు. వచ్చేది పోయేది బస్సుకాని మద్రాను కాదు, బెంగుళూరుకాదు.

అలాగే దేహము పుట్టవచ్చు, చావవచ్చు కాని ఆత్మ పుట్టేవాడు కాదు చచ్చేవాడుకాదు. దేహము పుడితే తాను పుట్టాటని, దేహం చస్తే తాను చస్తానని భావించడము ఆ బస్సులోని పిల్లలలాంటి వారే.

**"నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥**

ఈ ఆత్మను ఆయుధములు నరకలేవు, అగ్ని దహించలేదు, నీరు నాన్పనూలేదు, గాలి శుష్కింపజేయలేదు.

" నిత్యసర్వ గతఃస్థాణుః, ఆచలోయం సనాతనః". ఇది సనాతనమైనది. సర్వవ్యాపకము, స్థిరము అయినది. ఇట్టి అవికారి నిర్గుణము అయిన ఆత్మను వికారిగా భావించడమే అజ్ఞానము. ఈ ఆత్మకు చావు పుట్టకలు ఉన్నవని భావించడమే అజ్ఞానము.

అర్జునా! ఒకవేళ ఈ ఆత్మ మాటిమాటికి పుట్టుచున్నది చచ్చుచున్నదని తలంచినా, ఈ చచ్చువారు అంతా నావారు అని తలపించినా దుఃఖించుటకు అర్థములేద. ఎందుకంటవా

**"జాతస్యహి ధ్రువోమృత్యుః**
**ధృవం జన్మమృతస్యచ**
**తస్మాదపరి హార్యార్థే**
**నత్వం శోచితు మర్హసి"**

పుట్టినవాడు చచ్చుటయూ, నిజము చచ్చిన వానికి జన్మ కలుగుటయూ నిజము. అనివార్యంగా జరుగుచున్న ఈ జనన మరణాదుల గురించి దుఃఖించుట వివేకమనదగదు. అగ్నికి వేడిమి, నీటికి చల్లదనము, గాలికి చలనము ఎట్లు స్వభావికమో ప్రాణికోట్లకు కూడా జననమరణాదులు స్వాభావికములు. ఇట్టి స్వాభావికములైన మార్పుల గురించి విచారించిన లాభమేమి? ఎట్టి వారికి కూడా యీ చావు జరిగి తీరవలసినదే, అట్టి అనివార్యమైన మరణం గురించి విచారించుట అజ్ఞానమే.

ఉ॥ మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము. దేహి పుట్టుచున్,
జచ్చుచు నుండ చూచెదరు చావకమానెడు భంగి యీ
చచ్చిన వారికేడ్చెదరు చావునకొల్ల కడాగవచ్చునే
ఎచ్చట బుట్టె నచ్చటికేగుట నైజము ప్రాణికోటికిన్

అని భాగవతము. అజ్ఞానులు ఎక్కువ మక్కువ పెంచుకొని, కాలం తీరిపోయిన వారికోసం దుఃఖించుట ఆశ్చర్యం. దేహం ధరించిన ప్రతివారు పుట్టుట గిట్టుట సహజము. నిత్యమూ మనము చస్తూనే వుంటాము. మనము ఒకప్పుడు మృత్యుముఖమునకు పోవలసినదే అని తెలిసి కూడా మనము మాత్రము శాశ్వతముగా ఉంటాము అన్నట్లు అనుకొంటాము. మృత్యువునుండి తప్పించుకోవడానికి ఎట్టివానికి సాధ్యంకాదు. ప్రాణి ఎక్కడినుండి ఇక్కడికి వచ్చినదో మళ్ళీ అక్కడికి చేరుకోవలసిందే.

అసలు మరణము అంటేనే చెవులు మూసుకొనే వారంతా ఆ మరణానికి బలి అయి పోతూనే వున్నారు. సర్వసృష్టికర్త అయిన బ్రహ్మకూడా ప్రళయ కాలంలో తాను కూడా దేహం వదలవలసినదే అయినపుడు సామాన్యుల మాట చెప్పనక్కరలేదు. యోగవిద్య నేర్చిన ఒక హఠయోగి చాయ పురుష లక్షణ విద్యతో తనకు మృత్యువెపుడు వచ్చేది గ్రహించాడు. మృత్యువు నుండి తప్పించు కోవాలనుకొన్నాడు. బాగా యోగ సిద్ధిని పొందిన సిద్ధపురుషుడు గాబట్టి. కాయసిద్ధి ప్రభావముతో తనలాంటి యోగులనే వెయ్యిమందిని సృష్టించాడు. అందరికి మధ్యగా తానుండిపోయాడు. మృత్యువు రావలసిన సమయానికి విధిగా వచ్చినది. వచ్చి ఈ యోగి చేసిన యోగమహిమకు ఆశ్చర్యపడిపోయింది. ఈ వెయ్యిమందిలో తాను తీసుకు వెళ్ళవలసిన యోగిపుంగవుడు ఎవరో గుర్తించుట చాలా కష్టమైపోయింది.

వెంటనే ఒక ఉపాయము మనసుకు తట్టినది. అయ్యా యోగిపుంగవా అన్నీసరే అన్నీ బాగానేవున్నాయి నీ కల్పించిన ఈ వెయ్యిమంది అచ్చం నీలాగే వున్నారు కాని ఒక్కటి పొరపాటు చేశావు గదయ్యా అని అన్నది.

ఆమాట విన్న యోగి ఏమిటా పొరపాటు అని ప్రశ్నించాడు. ఇదే నీవు చేసిన పొరపాటు అని ఆ మాట్లాడిన యోగే నిజమైన యోగిగా నెంచి గభాలమున ఆయోగిని కబళించుకొని పోయినది.

ఎక్కడైనా మోసాలు, టోపీలు వేయవచ్చుగాని మృత్యువుదగ్గర ఈ ఆటలా, అతితెలివి తేటలూ సాగవు. కర్మశేషం ఉన్నంతవరకు జీవుడు దేహంతో సంబంధం కలిగి యుంటాడు. కర్మశేషం కాస్త తీరిపోగానే జీవుడు ఇహం వీడి లోకాంతర ప్రయాణం చేస్తాడు. ఇది తెలిసిన పెద్దలెవరుగాని మరణానికి విచారించరు.

మరణించిన వారు నావారు అనుకుంటేనే మనకు దుఃఖము కల్గుతుంది గాని లేకుంటే దుఃఖానికి చోటులేదుగదా! ఒక్కొక్కప్పుడు మన యింటి ప్రక్కవారు చస్తారు అనుకోండి, కాని మనకు దుఃఖంగలుగదు కారణం వారు నావారు అనే భావం లేదుకాబట్టి. మనముండే ఇంటిలో మనతోపాటు మరెన్నో ప్రాణులు కుక్కలూ, పిల్లులూ, ఎలుకలూ, కోళ్ళూ వుంటాయి. కాలంతీరి అవి చస్తాయి. అయితే మనకు బాధగాని, దుఃఖముగాని కలుగదు. కారణం అవి నావి అనే మమతా మోహములు లేవుగాబట్టి. కాన బాగా విచారిస్తే చావుకు ఎవరు ఏడ్వరు. చచ్చినవారు నావారు అనే భ్రాంతితో ఏడుస్తారు. " భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు " అన్నట్లు భ్రాంతి కాస్తాపోతే అంతా ఆనందమే. అంతా బ్రహ్మమే.

మ॥ చెలలుందల్లులు దండ్రులాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు నీ
గేహంబులటంచు గూర్తురు మహా మాయాగుణ భ్రాంతులై
కలలో దోచిన యర్థముల్ నిజములే, కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక మాను బిదపంగర్మాంత కాలంబునన్

అజ్ఞానాంధులైన కొందరు మాయలోబడి భ్రాంతులై తల్లిదండ్రి భార్యాపుత్రులు, స్నేహితులపైనా, ఆశ్రితులపైనా, అనురాగాలు అనుబంధాలు పెంచుకొని, ఇల్లువాకిళ్ళు, సంపదలు, సామ్రాజ్యాలు సంపాదించుకొంటారు. ఇవన్ని ఎలాంటివంటే స్వప్నంలో గనుపించిన సంపదలాంటివి. గాని యదార్థాలుగావు గదా. అలాగే కర్మానుబంధంవల్ల జీవులకు సంయోగ వియోగాలు, కల్గుతూ వుంటాయి. ఆ కర్మఫలం కాస్త తీరిపోగానే బంధాలు విడిపోతాయి. ఈ రహస్యం తెలుసుకొన్న మహాత్ములు వీటిగురించి మోహంజెందరు. అశాశ్వతమైన ఈ సంయోగమును గురించి వారి చిత్తమును కదిలింపజేయజాలవు. అజ్ఞానులు మాత్రమే ఈ సంయోగ వియోగములకు అల్లాడిపోతూ ఉంటారు.

అసలు మరణము అంటే మార్పు. ఈ ఇంటి నుండి మరొక ఇంటికి పోయినట్లు. జీవుడు ఒక దేహమునుండి మరొక దేహమును ప్రవేశించుట అగును. ఇందుకు దుఃఖించుట ఎంత అవివేకము. "చనిపోయెను" అని విడిదీసిన చని+పోయెను చని అనగా వచ్చి అని అర్థము. పోయెను అనగా వెళ్ళెను అని అర్థము. ఒక లోకమునుండి వచ్చాడు జీవుడు పనిపూర్తి కాగానే తన లోకానికి తాను పోయాడు. వచ్చిన వాడు పోవక తప్పదు కదా!

ఒక గమ్యము చేరదలచిన బాటసారి తన అనుకూలమైన వాహనము లెక్కి తన గమ్యం చేరుకుంటాడు. మద్రాసునుండి బొంబాయికి పోవలెనన్న దారిలో బస్సులు, రైళ్ళు, జటకాలు, ట్రాంబండ్లు ఎన్నో తనకు అనుకూలంగా ఉన్న వాహనములు ఎక్కి ప్రయాణం చేస్తాడు. గమ్యం చేరగానే వాహనాలను వదలినట్లు జీవుడు కూడా తన

కర్మానుగుణ్యముగా అనేక దేహములు ధరిస్తాడు. కర్మ సమసి పోగానే స్వస్వరూపమనే తన యదార్థ స్వరూపము పొంది శాశ్వతానందమును పొందుతాడు. కాబట్టి జీవుల మరణమును గురించి దుఃఖించవలసిన అగత్యములేదు. బస్సులోనో, ట్రైనులోనో ప్రయాణంచేసే ప్రయాణికులు వారివారి గమ్యం వచ్చే వరకూ ఒకరికొకకరు అన్యోన్యంగా మిత్రభావముతో వ్యవహరిస్తారు. వారివారి గమ్యస్థానం రాగానే దిగిపోతూనే ఉంటారు. మన జీవనయాత్ర కూడా ఇంతే. ఋణానుబంధము ఉండేవరకు ఒక కుటుంబముగా తల్లి అని, తండ్రి అని, అన్నలని, భార్య అని, పుత్రులని యిలా కలసిమెలసి ఉంటారు. కాని ఋణం తీరిపోగానే దేహత్యాగం చేసి పోతూనే వుంటారు. పోయినవారిగురించి అజ్ఞానులు దుఃఖిస్తారు. జ్ఞానులు దుఃఖించరు.

కాబట్టి ఓయీ అర్జునా ! ఎటు విచారించి చూచినా దుఃఖించుటకు కారణములేదు. నీ ఎదుట కనిపించే ఈ భీష్మ ద్రోణాచారులు మొదలగు వారందరూ నీవు నేను ఎప్పటికీ ఉందువారమె. ఒకప్పుడును చచ్చువారముకాదు. పోనీ వారుకాదు వారు ధరించిన దేహములు చచ్చునని దుఃఖించుచున్నానందువా అది ఇంకను పరిహాసమైనది. ఈరోజు కాకపోయిన రేపైన గతించిపోయె ఈ భౌతిక దేహముల గురించి దుఃఖించుటక మరీ అజ్ఞానం కాబట్టి "లే నీకర్తవ్యమైన కర్మరంగమునందు కాలుముందుకు సాచి, క్షత్రియ ధర్మమైన ఈ యుద్ధమును చేయుము. తనకుతానై కలసి వచ్చిన యుద్ధము క్షత్రియునకు తెరచియుంచిన స్వర్గద్వారము వంటిది. గాన అజ్ఞాన చిహ్నమైన చింతను వదలి నీ స్వధర్మమైన యుద్ధము చేయుము. క్షత్రియులకు యుద్ధము మృష్టాన్నము వంటిది. అందునా! యుద్ధరంగమున ప్రవేశించి యుద్ధము చేయకుండా ఉండుట ఎంత అపఖ్యాతి. ఇంతకన్న క్షత్రియునకు మరణం మేలుకదా. కాబట్టి అర్జునా లెమ్ము నేను వీరందరిని చంపుచున్నాననే అహంకారము వదలి నిరహంకారముతో నీపాలిటికి వచ్చిన యుద్ధము గాద మరేదైనా చేయుట అయుక్తము. గాండీవము ధరించు. అహంకారాన్ని వదులు అటుగాక ధరించవలసిన గాండీవమును వదలి అహంకారం పట్టుకొన్నావో దానికి మించిన అవివేకములేదు. కావున కిరీటీలే" యుద్ధసన్నద్ధుడవుకమ్ము.

**శ్లో॥ హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ (2-37)**

ఈ యుద్ధమునందు చచ్చినచో స్వర్గమును, గె[illegible] ఏలుకొందువు. ఎటు చూచినను నీకు మేలేయున్నది. గానలెమ్ము యుద్ధమునర్చుము.

ఈ శ్లోకార్థము మానవ మాత్రులైన వారందరికి పరమార్థ జ్ఞాన సముపార్జన గడంగవలయుననియు, అదియే మానవతా ధర్మమని జెప్పకనే జెప్పుచ్నుది.

కేవలం మానవునికి లౌకిక జ్ఞానం ఎంత వున్నా పరమార్ధ జ్ఞానం లేనిదే జన్మ చరితార్థము నొందనేరదు. ఎన్ని చదువులు చదివి ఎన్ని విద్యలు నేర్చినా పరమార్థ జ్ఞానంలేనిదే అవన్నియు "భుక్తయేనతు ముక్తయే" అన్నట్లు అవన్ని కేవలం భుక్తికేగాని, ముక్తికి కొఱగావు. "చదివి చదివి చావంగ నేటికి చావులేని వద్య చదువలెను" అన్న వేమనగారి మాట సార్థకత చేసుకొనవలెను. చదివే చదువులు, నేర్చే విద్యలు సంసార తరుణోపాయమునకు సహకరించనేరవు. సంసార సాగరగర్భమున పరిభ్రమించు మానవులందరికి పరమ పునీతమైన బ్రహ్మ జ్ఞానమొక్కటియే దిక్కు.

ఆత్మజ్ఞాన నిమిత్తమయ్యే జీవుడు ఈ మానవ దేహమును బొందియున్నాడని శాస్త్రములు ఎలుగెత్తి చాటుచున్నవి.

"దుర్లభో మానషోదేహః
ప్రాణి నాంక్షణ భంగురః
తత్రాపి దుర్లభం మన్యే
వైకుంఠ ప్రియదర్శనం

అని శంకరులవారు సెలవిచ్చిరి. క్షణభంగురమైన ప్రాణి కోట్లయొక్క జన్మలలో మానవ జన్మము, అత్యంతదుర్లభమనియు, అట్టి జన్మము పుణ్యవశముచే లభించును. భగవద్భక్తుల దర్శనము గల్గుటయు, అందుచే భక్తిజ్ఞానములు గలుగుట యెంతో సుకృతమని దెల్పిరి.

శతక్రతుడైన ఇంద్రుడు సైతము మళ్ళీమళ్ళీ మానవ జన్మనే కోరునట, ఎందుకనగా ఊర్ధ్వ అధోలోకములందున్న సర్వప్రాణులు, భోగజన్మలేగాని యోగజన్మలుగావు. యోగము వలననే ఆత్మజ్ఞానము సముపార్జనము గల్గును. అట్టి యోగము గల్గినది ఈ మానవ జన్మమొక్కటే. గాన ఆత్మజ్ఞాన సముపార్జన కలిగించేది. అందుచే ముక్తిని పొందునను వగు జన్మను పొందియు నెవడు ప్రాపంచిక విషయములందే మునిగి పోవునో వానికి మించిన మూఢాత్ముడు మరొకడులేడు అని శ్రుతి మనను హెచ్చరించుచున్నది.

బాల్యావస్థయందు అజ్ఞాన వశుడై ఏమియు తెలియక పోవును. యౌవనము రాగానే కొంత జ్ఞానము కలిగినను, దానిని పరమార్థ విషయమున పోనీక, కామపిశాచము బారినబడి స్త్రీలోలుడై కాలమంతయు గడుపును. వార్ధ్యాకమురాగానే శరీరం శుష్కింపగా అనుభవించిన భోగములన్నిటిని నెమరువేయుచు చింతా పరంపరలచే కాలం గడుపును.

ఇట్లు వుండుటచేత జడుడైన మానవుడు పరమార్థమును విచారించి తెలుసుకొనలేక మరలా మరలా ఈ భవసాగరముననే పరిభ్రమించి రౌరవాది నరకములననుభవించుచున్నాడు. కడతేరు తెరంగును తెలియజాలకున్నాడు. ఇంతకన్నా మించిన ప్రమాదము మరేమున్నది.

సీ॥ క్షణభంగురంబని జర్చింపలేక
ఈ తనువు శాశ్వతమంచు దలచు నరుడు
భ్రాంతుడై యిలదాను బ్రతికినన్నాళ్లను
మోహవారాశిని మునిగి యుండు
పగటికాలము కుటుంబాది సంరక్షణకును
ధనదాన్యముల్ కూర్చుకొనుచు
రాత్రికాలము సతీరతులచే కొంతయు
గలత నిద్రలను కొంత గడుపు కొనుచు

తే॥ నంతలోజచ్చు బహుగర్భ నరకములను
గాంచు సుఖదుఃఖ జన్మాదికములబడుచు
గాలమూరక ఈ రీతి గడుపుగాని
తాను కడతేరు మార్గంబు దలచదెవడు

ఇంతటి పవిత్రమైన మానవజన్మను పొందియు అజ్ఞాన వశమున క్షణభంగురమైన దేహమును నిత్యమని భావించి భ్రాంతికి జిక్కి మోహవశంబున కాలమంతయు ధనదాన్యాదుల గురించి, భార్యాబిడ్డల గురించి జీవితం కష్టనష్టాలు గావించుకొని మృత్యుముఖమున బడిపోవుచున్నాడేగాని, తాను తరించు మార్గమునకై ఏ కించిత్తు కూడా ప్రయత్నింపకున్నాడు.

సుడిగుండంలో బడిన క్రిమి అందుండి బయట పడు తెరంగు దెలియక, సుడివేగమునకు జిక్కి గిరగిరా తిరిగి అందులోనే బడి చచ్చునట్లు అజ్ఞానియైన మానవుడు జనన మరణాదులతో గూడిన సంసారమను సుడిగుండంబున బడి అందులోనే జన్మలు జన్మలు గడుపుతూ వున్నాడేగాని, సంసారము నుండి తరించు ఆత్మజ్ఞానమునకు గురించి ప్రయత్నించడములేదు. నీరసములైన విషయములందు భోగాసక్తి గల్గి సర్వదాభోగాయత చిత్తుడై ఆత్మజ్ఞానమునకు దూరుడై ముక్కు త్రాటిచే నీడ్వబడు పశువువలె లోకములందు పరిభ్రమించుచూ శాశ్వత శాంతికి నోచుకొనలేక హింసింప బడుచున్నాడు.

**" భోగైశ్వర్య ప్రసక్తానాం, తయాప్రహృత చేతసాం,**
**వ్యవసాయాత్మికా బుద్ధిః, సమాధౌన విధీయతే"**

భోగైశ్వర్యములందు ఆసక్తి గలవారును, వానిచే అపహరించబడిన చిత్తము

గలవారును నగు మానవులకు ఆత్మ చింతనయందు రుచి జనించదు. ఎండమావులవంటి ప్రాపంచిక సుఖములందే భ్రాంతిగల్గి పరవశుడై జీవితమునంతా అజ్ఞానంతో గడుపుతాడు. తేనెకాసించి ఈగ తేనెలో జిక్కుకొని ప్రాణాలు వదులునట్లు, మూర్ఖ మానవునికి బుద్ధి పరమాత్మవైపు ఒకించుకైనా మరలదు. దేహందుఃఖాయిష్ఠమై రోగగ్రస్తమైనా సరే విషయాదులందు విరక్తి మాత్రం పొందడు. ప్రజ్వలించే అగ్నిలో మిడుతలు బడినట్లు కామాగ్నికి లోనై తపించి పోతుంటాడు కాని పరమపద ప్రాప్తికై పదినిముషములైనా జీవితంలో ప్రయత్నం చెయ్యడు గాని విజ్ఞులైనవారు విషయములందు విరక్తిగల్గి జీవితం అశాశ్వతమని నెంచి శాశ్వతానంద ఆత్మజ్ఞానమునకై ప్రయత్నించి ధన్యులౌతారు.

పవిత్రమైన మానవ జన్మను పశుపక్ష్యాదుల వలె మూఢమతులై వ్యర్థపుచ్చరాదు. ఇహలోక, పరలోకములందున్న సర్వభోగములుకూడా అశాశ్వతమైనవి. క్షణికమైనవేగాని శాశ్వతమైనవి మాత్రముగాదు.

విషయము సుఖముల గురించి పరుగిడి వినాశనము కొనితెచ్చుకొను మందమతుల చిత్తమేవిధముగ విక్షేభము పొందునో అక్రమ పరిణామమును భగవానుడు ఎట్లు వర్ణించియున్నాడో గమనింపుడు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే ।
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥

మానవుడు శబ్దాది విషయములను సదాచింతించుట వలన వాటియందు మిక్కుటముగ నాశనజనించును. దానివలన అనుభవించవలెనన్నకోర్కె పుట్టును. ఆ కోర్కె నెరవేర్చుకొనుటకు అడ్డు తగిలిన వారిపై క్రోధముగల్గును, క్రోధమువలన అవివేకము కల్గును. అవివేకము వలన మతిభ్రమగల్గును. మతిభ్రమ వలన బుద్ధి నశించును. బుద్ధి నాశనంవలన సర్వనాశనం గల్గుచున్నది.

చూచారా ! విషయ చింతనల వలనగల్గు పతనము ఎంత ఘోరమైనదో యోచింపుడు. విషముకన్నా విషయము చాలా ప్రమాదకరమైనదని శాస్త్రవాక్యము.

" దోషేణతీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి।
విషం నహంతి భోక్తారం ద్రష్టారం చక్షుషా హ్యయం॥

శబ్దాది విషయము (వనితాది కామవిషయం) నల్లత్రాచుకంటే తీక్షణమైనది. విషమును భక్షించిన వానినే చంపును. కానీ ఈ వనితాది కామ విషయం కంటితో చూచినంత మాత్రముననే చంపుచున్నది.

చూచితిరా విషమునకు విషయములకున్న భేదము. విషము తినిన వానికి దేహమున క్రమముగా ప్రాకి రక్తమును కలిసి అందుండి సర్వనాడులకు వెళ్లి చంపును. దీనికి ఔషధములు గలవు. అయితే ఈ విషయాభిలాష అట్టిదికాదు. మనసున తలంచినంతనే కంటిచే చూచినంత మాత్రముననే వెంటనే ఎంతటి ప్రజ్ఞావంతున్ని గూడా నింద్రియసుఖములకు లాగి, వాటిబారిన బడవేచి, వాని ధీశక్తిని విజ్ఞానమును నాశనము చేయుచున్నది. దీనికి ఏమందులు పనికిరావు. ఇందుకు భాగవతమునగల అజామీళొపాఖ్యానము నిదర్శనము.

ముందు అజామిళుడు మంచి బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవాడు మంచి వేదాధ్యాయన సంధ్యావందనాది సత్క్రియలుగల్గి సంతతము సదాచారవంతుడై వుండేవాడు. ఒకరోజు తండ్రి ఆజ్ఞ ప్రకారం అడవికి సమిధలకు వెడుతాడు. అక్కడ ఒక విచిత్రమైన దృశ్యము ఈ బ్రాహ్మణుని కంటబడుతుంది.

త్రప్పత్రాగిన ఇద్దరు స్త్రీపురుషులు ఒకపొద మధ్యమున రతికేళీలోలులై, మోహాతురులై యుండిరి. ఈ సన్నివేశమును జూచిన అజామిళుని హృదయం అనే కారడవిని దావానలము అంటుకున్నట్లు కామాగ్నికి గురియై తదేక భావనాపరుడై ఆఖరికి వెలయాలి తోటినేస్తం చేసి పతితుడైనట్లుఆయన చరిత్ర చెపుతుంది.

కాన విషయములెంతటి ప్రమాదమైనవో గమనించి వాటి బారిన పడక సదా ముముక్షులైనవారు జాగ్రత్తపడాలి. ఎంతటి తాపసులకు సయితము విషయ దర్శనము గల్గిన వెంటనే విషయాభిలాష ప్రజ్వరిల్లి హృదయమును దహింపజేయును. ఇందుకు సౌభరియను మహర్షి పడినపాటు గమనార్హము.

పూర్వం సౌభరి మహర్షి ప్రతిదినము నియమ నిష్ఠలతో తపోవ్రతుడై ప్రక్కనేగల యమునానదిలో స్నానసంధ్యాదులు చేసుకొంటూ జీవితం ఎంతో పునీతంగా గడిపేవాడు. ఒకరోజు యధాప్రకారంగా యమునానదికి స్నానముకు వెళ్ళి, స్నానమాచరించు, తరి రెండు చేపలు హాయిగా తన పిల్లలతో నీటిలో దిరుగుచు, ఒకదానికొకటి మూర్కొనుచూ అన్యోన్యముగా వుండుట చూచినాడు. సౌభరి మనస్సు చలించ్చినది. మనసులో సంసారేచ్ఛ గలిగినది. అది నానాటికి ప్రబలముగటచే భరించలేక పోయాడు స్త్రీపురుషుల పరస్పర ఆ లింగనములో ఎంత సౌఖ్యముందో? లేకున్న నోరులేని ఈ మూగజీవులు సైతము [illegible] అన్యోన్యాందముగా నుండునా? అని పదేపదిగా ఆ విషయచింతనతోటే ఆలోచింపసాగెను. మహాత్ముల సంకల్పాలు కార్యరూపం కానక మానవు. సౌభరికి అప్పటికే వృద్ధాప్యములో యున్నాడు. తనకు కన్యనెవరు నిత్తురు అని ఆలోచింపసాగాడు. ఆ కాలములో మాంధాతకు యాభైమంది ఆడపిల్లలుండేవారు. ఈ విషయం దివ్యదృష్టిచే గ్రహించి నేరుగా ఆ మహారాజు

దగ్గరు వెళ్ళాడు. మాంధాత మహర్షి రాకకు నెంతయో సంతసించి పాదప్రక్షాళన గావించి మర్యాద పూర్వకముగా అతిథి సేవలుచేసి తన రాకకు కారణమడిగాడు.

మహర్షి తన మనసులోగల వివాహకాంక్షను తెలియజేసాడు. మహారాజును నీకుగల కుమార్తెలలో ఒకరిని తనకిమ్మని కోరినాడు. మహర్షి మాటలు విన్న మహారాజుకి నెత్తిన పిడుగుబడినట్లైనది. అస్థిపంజరములెనున్న ఈ ముదసలికి నాకుతురు నివ్వటమా! ఇంతటి తపోవ్రతుడైన ఈ మహాత్మునికేల ఈ విపరీతకాంక్ష గల్గినది. " కామమునకు కన్నులు లేవనుసామెత నీతనియడ సార్థకమైనట్లున్నది" అని మనసులో ఎంతో విచారించాడు. ఏమి చెప్పుటకు నోరు రావడంలేదు. కాదంటే ఏ శాపమిచ్చునో, ఇస్తానందునా ఇంతటి ముదుసలని ఏ కూతురు మాత్రం ఒప్పుకొనును. అసలు తనకే మనస్కరించలేదే. ఇకీ విషయం కుమార్తెలతో ఎలా చెప్పడం అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఈ ముసలి వానిని ఎలాగు నా కుమార్తెలు అంగీకరింపరు. నేను యివ్వనని చెప్పి ఈయన కోపమునకు కారకుడు కావడమెందుకుని, మహాత్మా మిమ్ము మా అంతః పురమునకు తీసుకొని వెళతాను. మా కుమార్తెలనందరిని చూపిస్తాను. ఏ కుమార్తె మిమ్ము వివాహమాడుతానంటే ఆ కుమార్తెను మీకిచ్చి పరిణయం చేస్తానని, సౌభరి మహర్షితంటా విడిపించుకోవాలనుకున్నాడు. ఎందుకనగా ఎలాగూ ఆ కుతుళ్ళా వొప్పరు అపుడు సమస్య సులభంగా పరిష్కారమౌతుందనుకున్నాడు. రాజుగారి ఆలోచనను సౌభరి తన దివ్యదృష్టిచే గమనించి సరేనన్నాడు. తీరా అంతఃపురమునకు వెళ్ళి మహర్షుల వారిని తన కూతుళ్ళకు పరిచయం చేసి మహర్షుల వారి అభిప్రాయం కూడా తన బిడ్డలందరికి తెలియజేశాడు. అయితే తాను తలంచిన ఆలోచన అంతా వ్యర్థమైనది. ఆ యాభైమంది కుమార్తెలు ఆ మహర్షిని చూచి అందరు ఆయన్నే వివాహమాడుటకు ఒప్పుకున్నారు. దాంతో రాజుగారికి మతిపోయినట్లైంది. దీనికి కారణము సౌభరి మహర్షి తనయోగశక్తి ప్రభావంతో రాజు కుమార్తెలకు నవ మన్మధుడిలాగ కనిపించాడు. అద్భుతమైన అందం బలిష్టమైన దేహం, బంగారులాంటి కాంతిపుంజం, అమాంతం అందరి కన్యలను అట్లే ఆకర్షించినది.

రాజు చేయునది లేక అందరిని ఆ మహాత్మునికే యిచ్చి వివాహం చేశాడు. వివాహానంతరం మహర్షి అందరికి అన్ని సుందరమైన భవనాలను, నందనోద్యానవములను, అద్భుతమైన భోగభాగ్యాలను, మనోహర దృశ్యాలను తనయోగ మహిమచే కల్పించాడు. ఇదిచూచిన మాంధాత ఆనందమునకు మేరలేదు. సౌభరి వారందరితో కూడి రాత్రింబవలనక స్వేచ్ఛగా కావ భోగములు అనుభవించినాడు. ఇట్లెంతో కాలం గడిచిపోయినది. సౌభరికి తృప్తి కలుగలేదు. అగ్నికి ఆజ్యము వృద్ధి కల్గించునట్లు భోగానుభవము అనుభవించు కొలది తృష్ణ అధిగమిస్తుందేగాని తృప్తి గలుగలేదు.

ఒకరోజు మహర్షి ఏకాంతముగా కూర్చుని ధ్యాన నిష్ఠయందున్నాడు. మెరుపు తీగలాగా చేపలజంట మిధున దృశ్యము తనకెంత విపత్తు కల్గించినదో మునికి అర్థమైనది. అహో ఏమి ఈ సంగదోషము యొక్క ప్రభావము. నేను చిరకాలము నుండి చేసుకొన్న తపస్సు అంతయు వ్యర్థము గావించుకొంటిని గదా యని తన ప్రమాదమును గుర్తెరింగి మనసును మార్చుకొన్నాడు.

మోక్షార్థియగు తాపసికి దాంపత్య జీవనం గడిపే పామరజన సాంగత్యముండరాదు. ఇంద్రియాదులు ఏ మాత్రం బహిర్ముఖమైనా వాని ప్రజ్ఞాన మంతయు హరింపజేయును. నిరంతర ఏకాంత వాసులై భగవదాయత్త చిత్తులై సత్పురుషుల సాంగత్యం గల్గియుండవలెనేగాని తాపసికి ఎంతమాత్రం పనికిరాదు.

ముముక్షులైన మునికి మిథున సాంగత్యం కూడదు. అది వానకి పతనహేతువు. ఇంద్రియాలను బహిర్గముగా వదలరాదు. ఏకాంత వాసులై ఏకాగ్రచిత్తముతో ఆత్మచింతన గావించుచూ మహాత్ముల సాంగత్యం గల్గియుండవలెను.

అని సౌభరి మహర్షి తలంచి దీనికి వ్యతిరేకముగా నడచినందుకు గదా నాకిట్టి దురవస్థ గల్గినదని తనమనంబున భావించి సర్వసంగ పరిత్యాగియై జీవితమంతయు తపస్సుతోనే పవిత్రత గావించుకొని పరమాత్మను చేరుకొనేను.

కావున విషయ సంకల్పము ముక్షువైన వానికి నెంత దురవస్థ గొనితెచ్చునో యోచించవలయును.

"ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః," ఎంతి ప్రయత్నశీలుడైన పురుషునియొక్క మనస్సును సైతం ఇంద్రియాలు ప్రక్కకు లాక్కపోతాయి. కావున విషయ చింతనా ప్రభావము ఎట్టి బాహ్యేంద్రియాలు పని చేయునుగాన సాధకునికి విషయచింతన మహా ప్రమాదకరము. " మనవ మనుష్యాణాంకార బంధుమోక్షయోః " అని ఉపనిషద్వాణి, బంధానికి గాని బంధవిముక్తిగాని మనస్సే కారణం. ఇంద్రియములు చేసే పనికంటే మనసు చేసే పనికే పుణ్యంకాని పాపంగాని కలుగుతుంది. అంతరింద్రయమైన మనస్సునుబట్టే బాహ్యేంద్రియములు ప్రవర్తిస్తూ ఉంటాయి. కావుననే ధర్మశాస్త్రమిలా చెబుతుంది.

**" మనసై వకృతం కర్మ- నశరీరకృతం కృతం ।**
**యేనై వాలింగితాకాంతా - తేనైవాలింగితా సుతా ॥**

మనస్సుతో చేసిన కర్మకే విలువగాని శరీరంతచో చేసిన కర్మకుకాదు. పురుషుదు భార్యను కౌగలించుకుంటాడు, బిడ్డను కౌగలించుకుంటాడు. శరీరంతో చేసిన పనిమాత్రం ఒకటే. అయినా ! లోపలి మనస్సును బట్టి వ్యత్యాసం చాలా ఉంటుంది.

కావున స్థితప్రజ్ఞత కోరేవాడు సర్వదా అంతరింద్రయములైన మనోబుద్ధులను ఆత్మనిష్ఠయందే నిలుపుటకు ప్రయత్నించాలి. ఏ మాత్రం మనసులో విషయ చింతన కల్గినా వాని ప్రజ్ఞానమంతయు పాడుచేసి పతితుణ్నిచేస్తుంది.

**ఆ॥ వినుమొక రహస్య మెరిగింతు వేయినేల**
**యో మహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు**
**పంచినట్లాజ్ఞలో నిల్చిపనులు సేయు**
**నాతడాత్మ స్థితప్రజ్ఞుడగు మహాత్మా॥**

అని సీతారామాంజినేయ సంవాదము. స్థితప్రజ్ఞునకు బాహ్యేంద్రియముల నిగ్రహం ఒకటేచాలదు. అందు లోపలి మనస్సు ముఖ్యము. ముందు ముందు బాహ్యేంద్రియముల నిగ్రహించి తరువాత తరువాత అంతరింద్రియమైన మనస్సును కూడా చక్కగా అరికట్టవలెను. అపుడే వాని ప్రజ్ఞ స్థిరప్రజ్ఞ కాగల్గుతుంది.

బైటగేటు (వాకిలి) లో పాటు లోపలి తలవాకిలి కూడా గట్టిబందోబస్తు చేయాలి. ఆదమరచి తలవాకిలి తెరచి వుంచితే ఎపుడో ఒకపుడు ఆ యిల్లు దోపిడీ పాలు అగుట తథ్యము. అలాగే సాధకుడు బాహ్యేంద్రియములతోపాటు అంతరింద్రయమును నిగ్రహించుటలో ఏమరపాటు తగదు.

**" ఇంద్రియాణాం హిచరతాం, యన్మనోనువిధీ హతే**
**తదస్య హరతి ప్రజ్ఞాం, వాయుర్నావ మివాంభసి"**

ఇంద్రియములయొక్క చెప్పు చేతులకు లోబడిన మనస్సు నీటిలోని పడవ సుడిగాలి లాగినట్లు పురుషుని బుద్ధిని అమాంతము విషయములవైపు లాగి వేస్తాయి.

మనస్సు బుద్ధివైపు లాగబడితే సుకృతాత్ముడౌతాడు. అదే మనస్సు ఇంద్రియులచే లాగబడిందా దుష్కృతాత్ముడౌవుతాడు. కావున మనస్సును బుద్ధివశ వర్తిగా నుంచాలి. ఇంద్రియవశవర్తి అయిన పతనం తప్పదు.

ఇంద్రియములు పశువులాంటివి. పచ్చగా కనబడితే పరుగెత్తే స్వభావం గలవి. వాటివెంటబడిన మనస్సుకు దుర్గతేగాని సద్గతి లేదు.

**" విషయ శత్రులౌ విశ్రాంతితోడ సా**
**రథిసమేతుడయిన రథికుబట్టి**
**యుగ్రగతిమిర మృత్యుయుత మగుసంసార**
**కుపమధ్యమందు గూల్చురథిప "**

విషయవాసనలకు లోనైన ఇంద్రియాలు, మనసు, సారథి అయిన బుద్ధి, రికుడైన

జీవున్నికూడ పట్టుకొని భయంకరమైన అంధకారావృతమైన మృత్యుగహ్వరమైన సంసార కూపంలోకి కూలదోస్తాయని భాగవతము.

కావున యింద్రియాలకు వశమైన మనస్సు విషయ ప్రవాహములోబడి కొట్టుకొని పోతుంది. సముద్ర ప్రయాణం చేస్తున్న పడవ తుపాను గాలికి గురియై మునిగిపోయినట్లు ఏ ఒక్క యింద్రియానికి మనస్సు లోబడినా విషయాలకు గురికాక తప్పదు. కాబట్టి విషయాకర్షణకు గురిగాక సాధకుడు వివేకవంతుడై సాధన మార్గమున పట్టుసడలక సాధన సాగించవలెను. అపుడే వాడు స్థితప్రజ్ఞను పొందగలుగుతాడు.

**" తస్మాదస్య మహాబాహో నిగృహీతానిసర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ (2-68)**

అందువలన అర్జునా! ఎవడు తనయింద్రిములను, ఇంద్రియార్థములైన విషయాదుల నుండి సంపూర్ణంగా నిగ్రహిస్తాడో అట్టి వానికి ప్రజ్ఞ ప్రతిష్టతమై వుంటుంది. అట్టివాడే స్థితప్రజ్ఞుడు అనబడుతాడు.

స్థితప్రజ్ఞుడు కాగోరేవాడు ఇంద్రియాలను కడు జాగరూకతో కనిపెట్టియుండాలి. వీటిని ప్రబల శత్రువులుగా భావించి వాటి చేష్టలకు యెడమీయక నుండవలెను.

" ఇంద్రియంబులకు జిక్కిన రక్కసులకు హరి భజనంబు శత్యంబుగాదు" అని ప్రహ్లాదుని మాట. రక్కసులంటే కొమ్ము, కోరలు గలిగి వుంటారనికాదు. నీతికి దూరమైన విషయాలలో కూరుకుపోయినారు. అట్టి ఇంద్రియములకు జిక్కన నరధాములకు హరిచింతన కలుగదు అని దెల్పిరి. మనువు కూడా ఈ ఇంద్రియముల ప్రమాదమును గురించి చెప్పినది చూడుము.

**మాత్రాస్వ స్రాదు హితావా నవివిక్తా సనో భవేత్**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥**

ఏకాంతములో తల్లితోగాని, చెల్లితోగాని, కూతురుతోగాని కలిసి పరుండరాదు. ఎందుకంటే ఇంద్రియాల బలము గొప్పది. అవి పెద్దపెద్ద పండితులను కూడా పల్టీ కొట్టిస్తాయి.

ఒకమారు వ్యాసభగవానులు ఇదే శ్లోకం తన శిష్యులైన జైమిని మహర్షికి చెప్పుతూ " బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి", ఇంద్రియాలు విద్వాంసుణ్ణి కూడా లాగుతాయి అని చెప్పుతున్నాడు. ఈ మాట జైమికికి నచ్చలేదు, గురువుగారు చెప్పిన అర్థానికి విరుద్ధంగా అర్థము వ్రాసుకొన్నాడు. " విద్వాంసం నాపకర్షతి" విద్వాంసుని ఇంద్రియాలు లాగలేవు అని వ్రాసుకొని ఏదో పెద్ద ఘనకార్యం చేసినట్లు వుబ్బిపోయాడు.

వ్యాసులవారు ఈ విషయాన్ని పసిగట్టాడు. అలా వ్రాయడం తప్పని చెప్పినా వినేరకములో లేడు జైమిని. ఇక లాభం లేదనుకున్నాడు. అయ్యా జైమినీ! నేను అత్యవసరంగా వేరొక చోటికి పోవలసివుంది. నేను వచ్చువరకు జాగ్రత్తగా వుండవలసిందిగా చెప్పి వెళ్ళిపోయాడు.

సాయంత్రం చల్లటి పిల్లగాద్పులు వీస్తున్నాయి. అకాశం మేఘావృతమైంది. ఆశ్రమమందు ధ్యాననిష్ఠలో జైమిని కూర్చుని యున్నాడు. సూర్యుడు అస్తమించాడు. వరుణ దేవుడు వర్షిస్తూవున్నాడు. ఈలోగా ఒక లావణ్యవతి కోమల కంఠముతో సుందరమైన దేహముతో ఆశ్రమ ప్రాంగణమున ప్రవేశించినది. స్వామీ! స్వామీ! అంటూ తన కోమల కంఠధ్వనితో పిలిచింది. జైమిని ఎవరా కోమల కంఠంగల వారని కన్నులు దెఱచి చూచాడు. అంగనామణి వర్షమునకు బాగా తడిసి, తడి వస్త్రములు దేహమునకంటుకొని దేహ సౌష్ఠవంతో యింద్రియములన్నీ కొట్టివచ్చినట్లు కనబడుతున్నాయి.

ఆ వచ్చిన కన్య స్వామీ ! ఈ పూట కాస్త మీ పవిత్ర ఆశ్రమమున తలదాచుకోనివ్వండి. రాత్రి సమయం మేఘములు ఆకాశమును గప్పుటచే మా గ్రామం చేరడానికి దారి కనిపించలేదని బ్రతిమాలింది. సరేనని జైమిని ప్రక్కనగల ఒక కుటీరం చూపించాడు. ఆమె తిన్నగా వెళ్ళి ఆ కుటీరంలో తలుపులు బిగించుకొని పడుకొనివుంది.

ఇక్కడ జైమినికి ధ్యానం కుదరటంలేదు. స్వరూపనిష్ఠ మరుగుపడింది. మనస్సు అంతా ఆ అంగనామణి దేహ సౌష్ఠవం గురించే చింతన చేస్తూంది ఇంటిలోని పోరు ఇంతింత గాదన్నట్లు మదనుని బాధ భరించలేకపోయాడు. తిన్నగా వెళ్ళి తలుపు తట్టాడు. లోపల కన్య తలుపులు తీసే సూచన కనిపించలేదు. బైట ఎక్కువ కాలం జైమిని నిలువలేకపోయాడు. కుటీరంపైకి ఎక్కి కప్పు కాస్త తొలగించి లోపలికి దూకి ఆ చీకటి కుటీరంలోవున్న అంగణామణిని వళ్ళుమరచి గట్టిగా కౌగలించుకొన్నాడు. ఇంకేముంది తన కౌగిటవుండేది మానినీకుల శిరోరత్నంకాదు. మహర్షికుల చంద్రుడు తనగురుదేవులు అయిన వ్యాసులవారు.

జైమినికి జన్మలో మరచిపోని గుణపాఠము జరిగింది. "విద్వాంసమపి కర్షతి కర్షతి కర్షతి, కర్షత్యేవ" అని ముక్కు చెంపలేసుకొన్నాడు. వ్యాసులవారు మందహాస వదనంతో జైమినీ నీవెళ్ళి పాఠమును చక్కగా దిద్దుకోమని శెలవిచ్చాడు.

కావున యింద్రముల దాడికి సముద్రములో జలచరాలు జలవేగాన్ని సహించినట్లు సహించే స్థిత ప్రజ్ఞతకావలెను. గత ప్రజ్ఞుడు ఇంద్రియముల దాడికి నిలువడలేదు అంటూ భగవానుని సందేశము.

ఆత్మోన్ముఖమైన మానసేంద్రియములు శుద్ధీకరించిన పాదరసంలాగా మహోపకారం చేస్తాయి. " రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వాన్ని వర్తతే" అన్నట్లు పరమాత్మ

దర్శనం గల్గిన మనస్సు యింద్రియములు ప్రసన్నత జెందుతాయి. ప్రసన్నుని చిత్తము బుద్ధికి స్థిరత్వమును గల్గించి శాశ్వతానందమును గలుగజేయును.

**" విహాయ కామాన్ యః స్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః స శాన్తిమధిగచ్ఛతి**

కోర్కెల నెల్లవదలి ఆశయు, అహంకారమమకారములు లేని వాడై స్వరూపస్థితి యందు నిల్కడగల్గిన పురుషుడు ముక్తిని పొందుచున్నాడు. అట్టివాడు మళ్లీ ఈ జననమరణ దుఃఖసాగరమైన సంసారమున ప్రవేశింపడు. ఇదియే పరమ పావనమైన మానవ జన్మకు సాఫల్యము. ఇట్టి పరమపద మార్గమున ఒకవేళ సిద్ధికి పూర్వమే దేహము వదలినను, అట్టివాడు స్వర్గలోకమును పొందును. గావున పరమార్థ పదజీవనము ఎటుచూచినను శ్రేయస్సునే గల్గించును. అట్టి శ్రేయోమార్గమే మానవ మాత్రులైన వారందరికీ పరమధర్మము.



## 3వ అధ్యాయం

# కర్మయోగం

శ్రీమద్భగవద్గీతలో ఈ రోజు మూడవ అధ్యాయము కర్మయోగం గురించి మనము తెలుసు కోవలసివుంది. నిన్నటి దినం రెండ అధ్యాయమును గురించి విచారించి తెలుసుకొన్నాము. " అధ్యాత్మ విద్యా విద్యానాం " అన్నట్లు విద్యలో ఆధ్యాత్మిక విద్యను నేనే అని భగవాను దెల్పియున్నాడు. ప్రపంచములో మొత్తము అరవైనాల్గు విద్యలు. ఈ విద్యలన్నీ సంసారమునుండి విముక్తి గల్గించలేవు. సరిగదా, ఇంకా అధికబంధాన్ని కలిగిస్తాయి. అయితే ఆధ్యాత్మిక విద్య అట్టిదిగాదు. ఇది కల్గినవారికి సంసార తాపత్రయ బంధముగాని, అవిద్యా బంధముగాని పటాపంచలైపోతాయి. వెలుగు రాగానే చీకటి దూరమైనట్లు ఆధ్యాత్మిక విద్య ఆత్మవిద్య గల వారికి అజ్ఞానం అనే బంధం మటుమాయమై పోతుంది. లౌకిక విద్యలు ఎన్ని నేర్చినా మరణం తప్పదు. కాని ఆత్మవిద్య మృత్యువునుండి అమృతత్త్వమును, తమస్సునుండి జ్యోతిలోకి తీసుకొనిపోవును. అమరవిద్య. బ్రహ్మవిద్య. " ఏకవి జ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి " అన్నట్లు ఈ బ్రహ్మ విద్య గల్గిన వారే సర్వవిద్యల సారం గ్రహించిన సర్వజ్ఞులు. అట్టి బ్రహ్మ విద్యను బోధించు శాస్త్రమే శ్రీమద్భగవద్గీత.

వేదము కాండత్రయాత్మకము. కర్మ, ఉపాసన, జ్ఞానములను మూడు భాగములుగా వేదము విభజింపబడినట్లు, శ్రీభగవద్గీతయు కాండత్రయాత్మకము వలె కర్మ, భక్తి, జ్ఞానములనుపదేసించి సర్వ శాస్త్రమయీ గీతా అన్న సార్థక నామధేయమును పొందినది.

" ప్రభాతే కరదర్శనమ్ " అని మనం ఉదయం లేగవానే మన రెండు అరచేతులను చూసుకొని నమస్కరించుకొనే ఆచారం వుంది. ఎందుకనగా కర్మాదికారం గల్గినది మానవ జన్మ. సృష్టిలో ఇతర ప్రాణులకు ఈ అధికారంలేదు. కావుననే వాటికి కరద్వయయములులేవు. సృష్టిలో ఒక్క మానవునికే ఈ కరద్వయములు భగవానుడు ప్రసాదించాడు. మానవుడు ఏకర్మ చేయవలయునన్ననూ ఈ రెండు చేతులతోనే గావున, ఉదయం లేవగానే కర్మకు కారణమైన ఈ రేండు చేతులను చూసి నమస్కరించి, ఓ భగవంతుడా నేను లేచినది మొదలు మరల పరుండువరకు కర్మచేయలసివుంది. ఆ కర్మ తెలిసిగాని తెలియకగాని చేసి నా జీవితావసరములను తీర్చుకొనవలెను గావున సర్వదా నా హృద్గతంగా వుండి నీచే ప్రసాదించబడిన ఈ రెండు హస్తములను సుకర్మములందే ప్రవేసింపజేసి నాజీవితమును పవిత్రము చేయుము అని ప్రార్థించి నమస్కరించుకొనవలెను.

కాని నేడు అంతటా వికట మానవుడు లేవగానే కరదర్శనమునకు ముందు కప్పుదర్శనం(కాపికప్పు) చేస్తున్నాడు. మరికొందరు నవనాగరకము ముదిరిన బుద్ధిమంతులు 'బెడ్‌కాఫీ' అంటూ ముఖ ప్రక్షాళన కూడా చేయకుండా పాచినోటనే వేడికాఫీ త్రాగి అనారోగ్యాలకు అనాచారాలకు లోనగుచున్నారు. ఇది యెంతయో సిగ్గుచేటు పని.

జన్మలకన్నిటికి కడసారి జన్మ మహాపుణ్య ప్రదమైన జన్మమెత్తికూడా లేచి లేవగానే శుచి శుభ్రతలు పాటించకుండా ప్రార్థన పవిత్రత లేకుండా కడుపే కైలాసంగా తినేదే ప్రధానంగా నెంచి పశువులాగా జీవితం గడపడం చాలా విచారకరమైన విషయం.

చదువు సంస్కారం గల్గినవారు కూడా ఉదయం లేవగానే స్నానం సంధ్యావందనం, ప్రార్థన, శుచిశుభ్రత ఆచారం లేకుండా మనస్సులాగినట్లు యింద్రియాలు కోరినట్లు వర్తించడం చాలా ప్రమదాకరం. ఇది దేశ భవిష్యత్తుకు, సమాజ సంస్కృతికే తీరన హానికరం. ఎందుకనగా నియమనిష్ఠలు, ఆచారవిచారములు మానవులకేగాని పశువులకు లేవుగదా. మన జీవితాలపైననే భావిపౌరులైన మనపిల్లల భవిష్యత్తు ఆధారపడివుంది. అట్టితరి మనము ఏ వర్తన గలిగి జీవిస్తామో అదే మన బిడ్డలకు అలవడుతుంది. బిడ్డలు మంచి సంస్కారవంతులు దేశోద్ధారకులు, పరోపకార పారాయణులు కావలనంటే మనం వారికి ఆదర్శంగా నిలిచి, చిన్న తనంమండి బిడ్డలకు ఉగ్గుపాలతో మానవతా పవిత్రతలను, కర్మ పవిత్రతలను వారికి అందజేయవలసిన బాధ్యత మనకెంతైనా వుంది. కావున మానవ జీవితమంటే కేవలం తినేది, నిద్రించేదికాదు. కర్మాధికారం కల్గిన

మానవుని వూర్ధ్వ అధోలోకాలకు పంపు సామర్థ్యము గలది కర్మ. మానవుడు తన చేయబడిన కర్మ ఫలాఫలములబట్టి పుణ్యంగాని, పాపంగాని, సుఖంగాని, దుఃఖముగాని పొందుతూవుంటాడు. కావున తన మంచిచెడ్డలకు కారణమైన కర్మకు నమస్కకరించి రెండు చేతులను కన్నులకద్దుకొని కర్మరంగంలో ప్రవేశించవలెను. కర్మయొక్క గొప్పదనములు గురించి శాస్త్రము చెప్పినది గమనింపుడు.

శ్లో॥ నమస్యామో దేవాన్ననుహ విధేస్తే పివశగాః
విధిర్వంద్యః సోపిప్రతినియతకర్మైకం సలదః
ఫలంకర్మాయత్తంకిమ మరగణైః కించవిధినా
నమస్తత్కర్మభ్యోవిధిరపినయేభ్యః ప్రభనతి॥

దేవతలకు నమస్కరిస్తున్నాము. వాళ్ళుకూడా విధికి లోబడి వుండువారే కాబట్టి విధికి నమస్కరించాలి. ఆ విధికూడా కర్మననుసరించే ఫలము ఇస్తున్నది. ఫలం కర్మాధీనం కాబట్టి ఆ దేవతలకు ఈ విధికి నమస్కరించుట కంటే ఆ కర్మకే నమస్కారము.

విధికూడా కర్మనతిక్రమింపలేదు గాన అన్నిటి కన్నా విధి, దేవతలకన్నా కర్మయే గొప్పది అని అర్థము.

బ్రహ్మను సృష్టికర్తగా, విష్ణువును కూడా దశావతారములుగ ఎందుకు చేసినదో, రుద్రునిచేత పుత్తె పట్టించి, బిక్షుకునిగా చేసినదో, ఏది సూర్యచంద్రాదుల బాటసారులుగా చేసి గగనమును త్రిప్పుచున్నదో అట్టి కర్మకు నమస్కారము.

క॥ విను కర్మం బొనరించును
జననము మరణంబు నదియు సౌఖ్యము దుఃఖం
బును గావించుదన చే
సిన దానిని బడక పోవ శివునకు వశమే

జనన మరణాలుగాని, సుఖదుఃఖాలుగాని కర్మఫలము వల్లనే మానవులకు గల్గుతాయి. తనచే చేయబడిన కర్మఫలంబుల తప్పించుకొనుటకు హరునికి కూడా సాధ్యముగాదు అది కర్మరహస్యము.

క॥ కర్మమున బుట్టు జంతువు
కర్మంబునవృద్ధి జెందు కర్మమున జెడున్
కర్మమే దేవతనరులకు
కర్మమె సుఖదుఃఖములకు కారణపథిపా.

అని భాగవతము కర్మముయొక్క గొప్పశక్తిని గురించి దెల్పియున్నది. కర్మమే జన్మకు కారణం. కర్మమే వృద్ధిక్షయాలకు, కష్టనష్టాలకు, సుఖాలకు కారణం. గావున కర్మమే మానవుల పాలిటకి దేవత, దైవము.

శ్లో॥ వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్తకేవా
సుప్తం ప్రమత్తం విషమ స్థితంవా
రక్షన్తి పుణ్యాని పురాకృతాని

అడవిలోగాని, శత్రువులనుగాని, నీళ్ళలోగాని, నిప్పులోగాని, మహాసముద్రములోగాని, పర్వత శిఖరముపైన గాని మనుష్యుడు నిద్రస్తున్నా, మత్తులోవున్నా, అపాయంలోవున్నా సరే తాను ముందు జేసిన సుకృతాలు తప్పక రక్షిస్తాయి అని శ్రుతి.

కాబట్టి " గహనాకర్మణోగతిః " అని చెప్పడం జరిగినది. తనగతికిగాని, మతికిగాని తనచే చేయబడిన కర్మలే కారణములు. కావున మతిమంతులు కావలయునన్న పుణ్యవంతులు క్వావలయునన్న నూతన చేయబడు కర్మలే కారణములు.

ఇట్టి కర్మయొక్క రహస్యమును దెల్పునదే ఈ అధ్యాయం. అందులకే భగవానుడు దీనికి కర్మయోగం అని ప్రత్యేకమైన నామకరణం చేసి లోకానికి కర్మ చేయవలసిన విధివిధానమును గురించి కూలంకషంగా బోధిస్తున్నాడు.

రెండవ అధ్యాయంలో సాంఖ్యయోగమునందు ఎక్కువ జ్ఞానము గురించి బోధించడం జరిగినది. తరువాత ఈ అధ్యాయమునందు కర్మను గురించి చెప్పనున్న భగవానుని చూచి అర్జునునికి సంశయం కల్గినది.

" ఏషాబ్రహ్మీ స్థితిఃపార్థ, నైనాం ప్రాప్యవిముహ్యతి " ఓయీ ! అర్జునా! ఈ బ్రహ్మస్థితి నొందిన వారికి మోహబంధం గలుగనేరదు. అట్టి బ్రహ్మస్థితి అంతకాలంలో కూడా ముక్తిని కల్గించును అని దెల్పిరి. మళ్ళీ యిపుడు కర్మను గురించి చెప్పడము పార్థుని మనసులు పరిపరి విధాలుగా పరిభ్రమించి తనకు ఏది శ్రేష్ఠమో దానిని దెల్పమని అర్థిస్తున్నాడు.

" ఆత్రగానికి బుద్ధిమట్టు " అన్నట్లు కొంతమంది శిష్యోత్తములు గురువుగారు చెప్పుచున్నది పూర్తిగా శాంతముగా వినకముందే, మధ్యలోనే సంశయ గ్రస్తులై బోధకు మధ్యలోనే అడ్డు ప్రశ్నలు వేస్తుంటారు. గురుదేవుని సన్నిధిలో సంశయం పనికిరాదు. గురుబోధయందు పరిపూర్ణ విశ్వాసం గల్గి గురుదేవులబోధ పూర్తి అగువరకు మధ్య మధ్య అడ్డు ప్రశ్నలు వేయరాదు. బోధానంతరం ఏవైనా సంశయములున్న ప్రశాంతముగా తనకు గల్గిన సంశయాల్ని గురుదేవుల ముందుంచి అడిగి తెలుసుకొనుట సబబుగాని మధ్యలో ఎప్పుడూ అడ్డుతగలి అడుగరాదు.

రెండవ అధ్యాయం 39వ శ్లోకంలో భగవానుడు " ఏషాతే భిహితా సాంఖ్యే బుద్ధిర్యోగేత్విమ్‌శృణి" ఇంతవరకు నీకు సాంఖ్య బుద్ధి చెప్పాను. ఇక యోగబుద్ధిని చెపుతాను

విను అంటూ, జ్ఞాన యోగానికి, సాంఖ్య బుద్ధి అని, కర్మ యోగానికి యోగబుద్ధి అనే పేరుతో భగవానుడున్నాడు. తరువాత 49వ శ్లోకంలో "దురేణాహ్యా వరం కర్మబుద్ధి యోగాద్ధనంజయ" అని బుద్ధికంటే కర్మ తక్కువైనదిగా చెప్పాడు. అనగా నిష్కామ కర్మ యోగం కంటే సకామ కర్మ తక్కువయినదిగా చెప్పాడు. అయితే అర్జునుడు భ్రాంతితో బుద్ధి అనేమాటకు జ్ఞానమని అర్థం చేసుకొన్నాడు. అందుచేత జ్ఞానం కంటే కర్మ తక్కువైనదిగా భగవంతుడు చెప్పినట్లు భావించి

"జ్యాయసీ చేత్ కర్మణస్తే మాతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోయసి కేశవ ॥

జనార్ధనా! కర్మకంటే జ్ఞానమే శ్రేష్ఠమని, అభిప్రాయమైనచో వారి నన్నెందుకు పురిగొల్పెదవు అని అడిగాడు.

వాస్తవంగా జ్ఞానం కంటే కర్మ తక్కువైనదిగా భగవంతుడు గీతలో ఎచ్చటా చెప్పినట్లు కనిపించదు. కర్మకంటే జ్ఞానమే గొప్పదని భగవంతుడు తలంచియుండిన కర్మయోగమనే ఈ అధ్యాయమే గీతలో బోధించి యుండేవాడు కాదు. ఎందుకన మానవుని దేహమే ఒక కర్మరాశి. జన్మే కర్మము ద్వారా కల్గినది. తల్లిదండ్రుల మిధున కర్మవల్లనే ఈ దేహం కలిగింది. అలాంటపుడు కర్మములో పుట్టిన ఈ కర్మదేహం కర్మ చేయక ఒక క్షణంకూడా వుండటానికి వీలులేదు. " నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్టిత్య కర్మకృత్, కార్యతేహ్యా వశఃకర్మ, సర్వఃప్రకృతి జైర్గుణైః. ప్రకృతి జన్యములగు గుణములకు లొంగి ప్రతివారును కర్మచెయ్యవలసినదే.

అసలే కర్మమానితే జీవయాత్ర జరుగటమే కష్టము. నోరులేని పశుపక్షాదు, క్రిమి కీటకాదులు మొదలు బ్రహ్మ పర్యంతం ఈ కర్మ లోకాలోకములను వ్యాపించివుంది. అలాంటపుడు కర్మలుమాని వుండటం సాధ్యముగాని పని. సూర్యచంద్రాదులైన ప్రత్యక్ష దైవములుగా మనం భావించేవారు కూడా ఈ కర్మరంగమున విరామం లేకుండా చేస్తూనే యున్నారు. అసలు కర్మ అనగా ఏమి? జీవుల జీవనయాత్రే పెద్ద కర్మరంగమైన పోయె. ఇక కర్మమనే అవకాశమేలేదు. కాబట్టి భగవంతుడు కర్మరాహిత్యం గాదు బోధించేది. కర్మ కేవలం యోగః కర్మసు కౌశలం " కర్మలు చేయుటలోగల కౌశలమే యోగం. అట్టి యోగమే భగవంతుడు బోధిస్తున్నాడు.

కర్మలు వేరు కర్మయోగం వేరు. కర్మణా బధ్యతే జంతుః, కర్మతో బంధం ప్రాణి కోటికి కల్గునని ఉపనిషత్ వాణి. ఏదేని ఒక కర్మ మనం చేసినపడు దానికొక ఫలం వస్తుంది. దాన్ని మనం అనుభవిస్తాము. ఆ అనుభవము ద్వారా చిత్తంలోబడక వాసన ముద్రపడి పోతుంది. అదే భోగవాసనా సంస్కారం. ఆ సంస్కారం మళ్ళీ జన్మకు బీజమై జన్మనిస్తుంది. ఆ జన్మతో మళ్ళీ కర్మ ప్రారంభము. కర్మలతో ఫలం, ఫలంతో భోగం,

వాసన అంటుకొని జనన మరణాలకు కారణమైకూర్చుంది కర్మ. కాబట్టి " కర్మణాలభ్యతే జంతుః " శాస్త్రము చెప్పడం జరిగినది. పోనీ కర్మ చెయ్య వూరకుంటే కదా? అని అనుకుంటే అది సాధ్యముకానిపని. ఎందుకంటే శరీరమే జగత్తే ఒక కర్మరాశి అయిపోయె. ఒక కర్మ మానడం అనేమాట హాస్యాస్పదము అని ముందు చెప్పుకొన్నాము. కాన కర్మ చేద్దామా కర్మబంధానికి కారణం. పోనీ సుతారం మానుదామా అది అంతకు సాధ్యముకాని పని. ఎగతీస్తే గోహత్య, దిగతీస్తే శిశుహత్య అన్నట్లు ఇది ఒక పెద్ద గండంగా సమస్యగా తయారై కూర్చున్నది. ఈ గండం సమస్యను పరిష్కరించి కర్మకు వశులు కాకుండా చేయు ఉపాయమే ఈ కర్మయోగ రహస్యము. భగవానుడు మానవ లోకమునకు తన శ్రీముఖంగా బోధింస్తు వున్నాడు.

**" లోకస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తామయా నఘ**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం, కర్మయోగేన యోగినామ్**

పాపరహితుడవగు ఓ అర్జునా ! సాంఖ్యలకు జ్ఞానయోగము, యోగులకు కర్మయోగము అనెడి ముక్తి మార్గముల రెండింటిన మొదట ప్రపంచమున నేను యేర్పరచియున్నాను. సాంఖ్యులు అనగా జ్ఞాననిష్ఠగలవారు, అనగా కార్యకారణాలను బాగా విచారించి, కార్యమునకు కారణమైన దానియందు నిష్ఠ, అనగా నిశ్చయాత్మకమైన స్థితి. స్వరూప స్థితియందున్నవారు ఈ జగత్తు కార్యం, ఈ జగత్తుకు కారణం పరమాత్మ. కారణంలేనిదే కార్యం జరగడానికి వీలులేదు గాన కార్యమును బట్టి కార్యకర్తను ఊహించడమే సాంఖ్యము. సాంఖ్యము ఆత్మ స్వరూప విచారము అని ముందు చెప్పినట్లు ఈ సృష్టి స్థితిగల ప్రపంచమును కార్యమునకు కారణమైన పరబ్రహ్మమునందు మనస్సు స్థితిగల్గి సర్వము బ్రహ్మ స్వరూపమునందు మనస్సు స్థితిగల్గి సర్వము బ్రహ్మస్వరూపముగా చూచు బ్రహ్మస్థితి నొందినవారు సాంఖ్యులు, అనగా జ్ఞానులు ప్రతి వస్తువుకు మూలకారణమైన మూల తత్త్వాన్ని గుర్తించిన ముక్త పురుషులు అనబడుతారు.

మనం ఆ భరణాలను చూస్తాము. కంసాలి చూస్తాడు. కాని మనదృష్టి వేరు. కంసాలిదృష్టి వేరు. మన దృష్టిలో నామరూపముగల ఒక అభరణము ఏదివుందో కంసాలి దృష్టిలో నామరూపములకు ఆధారమైన బంగారును చూస్తాడు. వాని దృష్టిలో బంగారే సత్యంకాని, నామం రూపంగల అభరణం హులిక్కి, నిజమంతే వున్నా మనదృష్టి మాత్రం నామరూపంగల ఆభరణంగానే దాన్ని కమ్మని చైను అని, నాగరం అని, హారమని, ఏమేమో వికారదృష్టితో దర్శిస్తూ రాగ మోహాదులకు గురి అయిపోతాము. ఆ భరణంకాక ముందు బంగారు బంగారంగానేవుంది. ఆభరమైన తరువాత బంగారు బంగారంగానే వుంది. ఆభరణం కరిగించిన తరువాత కూడా బంగారు బంగారుగానే మిగిలివుంది. ఒక్క బంగారే త్రికాలములందు సత్యమై వుండేది.అలాగే జగత్తుకు పూర్ణం బ్రహ్మ బ్రహ్మగానే వుంది.

జగత్తు ప్రళయం అయినా బ్రహ్మ బ్రహ్మగానేవుంది గాని అది మాగదు. ఈ సృష్టి స్థితిలయకు అంటక సాక్షియై బ్రహ్మవుంది. స్వర్ణకారుని దృష్టిలో అభరణాలన్ని బంగారే అయి గోచరించినట్లు జ్ఞానియొక్క దృష్టిలో అంతా బ్రహ్మమే అనే అఖండజ్ఞాన నిష్ఠగల్గి కార్యరూపమైన ఈ ప్రపంచ స్థితిగతులను మిథ్యగాదలుస్తారు. ఇది సాంఖ్యుల జ్ఞాన మార్గం. ఇది అపవాద పద్ధతి.

ఇక రెండవది " కర్మయోగేన యోగినాం " కర్మయోగం కర్మయోగి సర్వసమర్థుడైన పరమేశ్వరుని చేతిలో తానొక పనిముట్టుగాతల్చుస్తాడు. ఏది జరిగినా అది అంతా పరమాత్మ ప్రేరణగా భావిస్తాడు. తాను ఆడేవాడు. భగవంతుడు ఆడించేవాడు. ఇనుము, అయస్కాంతం సన్నిధిలో చలించనట్లు ఆ పరమాత్మ సంకల్పమే తనచేత ఈ కర్మలు చేయిస్తున్నాడు అని తలంచుతాడు. శివుని ఆజ్ఞలేక చీమైనా కుట్టదనే విశ్వాసం కర్మయోగిది. తాను చేస్తున్న కర్మ ఫలాఫలాలు ఈశ్వరార్పణచేసి నిష్కామ బుద్ధితో కర్మలాచరిస్తాడు. నిష్కామ భవానతతో కర్మలాచరించుటచేత కర్మకు కారణాలు అయిన రాగద్వేషాలనంటడు. కర్మయోగి చేయు కర్మలు రాగద్వేషాలు లేవుగాన రాగద్వేషరిహతమైన పవిత్రహృదయం గల్గి పరమాత్మ కృపకు పాత్రుడవుతాడు.

కర్మయొక సర్పము లాంటిది. సర్పమునకు రెండు విషదంతములులాగా, కర్మకు కుడా రాగద్వేషములను రెండు గుణములుగలవు. విషదంతములు గల సర్పము భయానకమైనది. అయినను, పాములవాడు దాన్ని నేర్పుతోబట్టి ఆ విషదంతములు రెండు తొలగించి ఆ పాముచే తన జీవినం సాగించుకుంటాడు. అలాగే కర్మయోగి రాగద్వేశరహితమైన పవిత్ర హృదయం గలిగి కర్మలాచరించి భగవతుకృపకు పాత్రుడౌతాడు.

మానవునికి సకామ కర్మలెంత బంధకాలో, నిష్కామ కర్మలంత బంధవిముక్తికి సహకారములు. సకామ కర్మ ఎట్లు బంధం కలిగిస్తుందో నిష్కామ కర్మ బంధవిముక్తిని కల్గిస్తుంది. ఇది కర్మకాదు. కర్మయోగం అని భగవానుడు చెపుతున్నాడు.

ఒకడు రాగంతో మామిడిపండు తింటాడు. దానితో ఒక వాసన లోపలచేరి మళ్లీమళ్లీ తినాలనిపిస్తుంది. ఇదే రాగంతో చేసిన కర్మకు సంస్కారం.

మరొకడు డాక్టరు యిచ్చిన మందు తనకు యిష్టము లేకపోయినా అది చేదుగావున్నా తనకున్న రోగనివృత్తి గురించి కన్నులు మూసుకొని అయినా గుటుక్కున మ్రింగుతాడు. కానీ మళ్లీమళ్లీ మందు మింగాలనిపించదు. కారణం వానికి మందు మింగాలనే కోరికలేదు. అయినా మింగకతప్పదు గాన ఇష్టము లేకపోయినా మ్రింగిన మందు సంస్కారం కల్గించలేదు. మళ్లీ మందు మ్రింగాలనే వాసన వానిలోలేదు. కావున రాగ విరాగాలతో చేసే కర్మకు యింత తేడావుంది. రాంతో చేసే ర్మ మారకమౌతుంది. విరాగంతో చేసే కర్మ తారకమౌతుంది.

కాబట్టి కర్మకాదు మనకు బంధకం. కర్మలో మనం పెట్టుకొన్న భావన బంధం కల్గిస్తుంది. తాళం చెవి ఒకటే అయినా ఒక ప్రక్క తిప్పితే తాళం విడిపోతుంది. మరొక ప్రక్క తిప్పితే బంధిస్తుంది. తాళంచెవి ఒక్కటే అయినా, తాళంచెవి త్రిప్పటంలో తాళం బంధించడం విడిపోవటం ఎట్లు జరుగుతుందో అలాగే కర్మఒకటే అయినా కర్మచేసే విధానమును బట్టి బంధము, బంధ విముక్తికి ఒకే కర్మవల్ల జరుగుతుంది. కర్మలు మానింతమాత్రముననే ముక్తిగలుగదు. అలాగైతే రాయిరప్పలాంటి జడవస్తువులకు కూడ ముక్తిచేకూరవలసి వుంటుంది. కర్మ రాహిత్యంకాదు కావలసింది కర్మలో కౌశలం, కర్మయోగం కావలయును. కర్మ సన్యాసం కాదు కావలసింది కర్మ ఫలిత్యాగం కావలె, కర్మఫలత్యాగం చేసినపుడు చిత్తశుద్ధిని గల్గించి ఆత్మజ్ఞానానికి దోహదం చేస్తుంది. కర్మయోగం జ్ఞానయోగానికి మొదటిమెట్టు. యోగమునగా! సమత్వబుద్ధి ఈ సమత్త్వబుద్ధి కర్మతోనే కలగాలెగని, కర్మత్యాగంతో ఎప్పటికి కలుగదు. నమత్త్వంయోగ ఉచ్చతే కర్మలవల్ల గలిగే ద్వంద్వాలలో సుఖదుఃఖాలలో నమత్వబుద్ధి నిజమైన యోగము, అహంకారమమకారములు వదలిచేసేకర్మచిత్తశుద్ధికిని, చిత్తశుద్ధిజ్ఞానసిద్ధికిని, జ్ఞానంమోక్షానికి కారణమైతుంది. ఇలాగా! కర్మయోగం మోక్షమునకు పరంపరా సాధనమౌతుంది.

చేయలవసిందిచేస్తే నరుడు నారాయణుడౌతాడని మహాత్ముల మాట, విహిత కర్మలు చేయకపోవడం వల్లను అహితమైన కర్మలు అనగా శాస్త్ర నిశిద్ధకర్మలు చేయటవల్లనే మానవుడు పతితుడవుతున్నాడు అని శాస్త్రము చెప్పుచున్నది.

" నహికశ్చితక్షణ మపిజాతుతిష్ఠంత్యకర్మకృత " ప్రాణికోటలో యే ఒక్కటి కూడ కర్మ లేక మనజాలదు. కర్మలు మానడం సాధ్యముగానిది. తినడం, తిరుగడం, చూడడం, కూడకర్మలయినపుడు వదలుట అనడం హాస్యాస్పదముగా నుండును. బండితోలుట ఎట్లాకర్మో బండిని ఆపివుంచడం కూడ కర్మేకాగలదు. ఒకవేళ హఠంతో బాహ్యేంద్రియాల వుగపట్టినావాని మనస్సు వ్యక్తిని మాత్రం లోపల పరవళ త్రొక్కుతూ వుంటుంది. ఇట్టి మిధ్యాచారి అని భగవానుడు దెల్పియున్నాడు. మిధ్యాచారియై కర్తవ్యకర్మల వదలి భ్రష్టాచారీ డగుటకంటె కర్త వ్యకర్మలాచరించి కర్మ శ్రేష్ఠుడు కావటం మంచిది.

చేసేకర్మ సహజంగా అయిపోవాలె "సహజం కర్మకాంతేయ" అహంకారముతో చేసే కర్మ కతృత్వంతో చేసే కర్మ, మనిషికి కర్త్వత్వా భావనతో చేసేకర్మ విపరీత ఫలితాలనిస్తుంది. అహంకారము కర్తృత్వం లేకుండా చేసేకర్మ సహజకర్మ అయిపోయింది. సహజకర్మ ఎంతచేసినా బాధవుండదు. సూర్యచంద్రాదులు అహరహం ఎంతోకర్మ చేస్తున్నారు. అయినా వారికి అలసటగాని ఆవేశంగాని, విశ్రాంతిగాని లేవు. కారణం, వారికి అహంకారం లేదు. మేమీకర్మచేస్తున్నాము గదా అనే అభిమానము లేదు. అహంకార మనుమకారం లేని కర్మ నీటిలో బరువును మోసినట్లు తేలిక అవుతుందేగాని, బరువు అనిపించదు. అలసట కల్గించదు.

"నియతం కరుకర్మత్వం" నియమితమైన కర్మచేయుటే మానవునికి శ్రేయస్సు, నియతకర్మలనగా! శాస్త్రము నిర్ణయించిన కర్మలు, ఆకర్మలుకూడా నిష్కామంగాచేయాలె, సక్రమంగా చేస్తే శాస్త్రం నిర్ణయించిన కర్మకూడ బంధాన్నే యిస్తుంది. కాబట్టి శాస్త్రనియమైన కర్మకూడ బంధాన్నేయిస్తుంది. కాబట్టి శాస్త్రనియమైన కర్మలు కూడ నిష్కామభావంతో చేసినపుడుముక్తి దాహకములు అవుతాయి. అసలు కర్మలుగాదు బంధకాలు కర్మలో మనం పెట్టుకొన్న భావం బంధానికి బంధవిముక్తలో కారణాలు అవుతాయి. గాన నిష్కామిగా చెయ్యమని భగవంతుని ఆదేశము.

హాస్పటల్‌లోనర్సు లుంటారు. ప్రసవించిన స్త్రీలకు పురిటికర్మలు చేస్తారు. ఆ బిడ్డ ఆలన పాలన స్నానం అంతా చేస్తువుంటారు. కాలందీరి బిడ్డ చస్తే తల్లి ఎడుస్తుంది కాని, నర్సులుకంటికి తడికూడా పెట్టరు. ఎందుకు తల్లికి ఇదినా బిడ్డ అనేమమకారం వుంది. నర్సుకు మమకారంలేదు. గానబిడ్డచ్చినా ఆమెకు దుఃఖములేదు. కావున కర్మలో మనం పెట్టుకొన్న భావమే కష్టసుఖాలకు కారణమౌతుంది. మమకారం లేకుండా చేసే కర్మ దుఃఖాన్ని దూరంచేస్తుంది. కర్తవ్య పరిపాలన గావించి సిద్ధినియిస్తుంది.

" శరీరయాత్రా పిచతేన ప్రసిద్ధ్యేదకర్మణః " కర్తవ్యకర్మ చెయ్యని దానివలన శరీరయాత్ర కూడ జరుగదు. అట్టివాని జీవితం నిరర్థకమై నష్టభ్రష్టమై పోతుంది . సృష్టిలో గల ప్రతిచరాచరములన్నియు తెలిసో తెలియకనో- ఆత్మార్పణంగా కర్మచేయబట్టే మానవుడు ఇంత సుఖభోగాలు పొందుచున్నాడు. అడవిలో చెట్లు సైతము దానిపాటికది ఎన్నో ప్రాణులకు నిలువ నీడనిస్తున్నాయి. పూలు, పండ్లు యిస్తున్నాయి. మానవుడు చెట్లను నరికి వంట చెరుకులుగా, కలపగా, తనయింటి నిర్మాణమునకు, తనకిట్టమెచ్చిన సామాగ్రిని తయారుచేసుకుంటున్నారు. పశువులను, పక్షులను తమ సుఖములగురించి వాటిని పెంచుతున్నాడు. రాయిరప్పలతో తనసౌకర్యార్థముగా గృహనిర్మాణము చేసుకొనుచున్నాడు. ఇలాగా సృష్టిలోని ప్రతిది మానవునికి సహకరించినపుడు బుద్ధిగలిగిన మానవుడు ప్రత్యుపకారంగా తాను, లోకానికి సృష్టికి చేయవలసిన సహకార కర్మ యెంతైనవుంది. సృష్టికి తానెంత ఋణపడియున్నాడు అట్టిఋణాన్ని దీర్చికొనుటమానవుని ముఖ్యకర్తవ్యము. లోకములో ఎన్ని ప్రాణులు ప్రత్యుపకారంలేకలో కానికి ఆత్మార్పణంగా జీవితాల నర్పించినపుడు బుద్ధి గిలిగిన ఈ మానవుడు తనప్రత్యుపకారం లోకానికి అందించవలసిన బాధ్యత యెంతయినా వుంది.

కాబట్టి అర్జునా! యెటు ఆలోచించిన నీవు కర్మ మానే అవకాశంలేదు అందునా నీకు యుద్ధం నియతకర్మ, అట్టి నియమితమైన యుద్ధము మానితే శాస్త్రోల్లంఘనం చేసిన వాడవైపోతావు. పైగా ఏమిచెయ్యకపోవటం వల్ల జీవయాత్ర కూడా జరుగదు. అందుచేత భిక్షమెత్తవలసివస్తుంది. ప్రజ్ఞాతవాసంలో మీరు బ్రాహ్మణవేషధారులై భిక్షమెత్తినది చాలక మళ్ళీ యిపుడు భిక్షమెత్తుట తగనిపని. అలాభిక్షమెత్తినా అదికూడా ఒక కర్మ అవుతుంది

గదా? నియమితమైన స్వధర్మాన్ని వదలి పరధర్మములో ప్రవేసించుట భయానకము పాప హేతువు అవుతుంది. అసలు ఈ శరీరము ఒక కర్మ యంత్రం అట్టి కర్మ యంత్రమైన శరీరం పొంధి కర్మ చెయ్యకపోవటం దైవాను గ్రహంతో కలసివచ్చిన అవకాశమును కాలదన్నినవాడివైతావు. జీవాత్మను పరమాత్మ స్థానమునకు చేకూర్చురథము లాంటిదీ శరీరము దీనిద్వారా జీవన ప్రయాణంచేసి పరమాత్మను చేరుకోవాలె.

సీ॥ రథముమేనెల్ల, సారధిబుద్ధి, యింద్రియ
గణము గుఱ్ఱములు, పగ్గములు మనము
ప్రాణాదిదశవిధపవనంబు, లిరుసు, ధ
ర్మాధర్మగతులురథాంగకములు
బహుళతరంబైన బంధంబుచిత్తంబు
శబ్దాదికములు సంచార భూము
లభిమానసంయుతుండయిన జీవుడురథి
ఘనతర ప్రణవంబు కార్ముకంబు

తే॥ శుద్ధజీవుండుబాణంబు శుభదమైన
బ్రహ్మమంచితలక్ష్యంబు, పరులురాగ
భయ, మద, ద్వేషశోకలోభప్రమోహ
మానమత్సరముఖములు మానవేంద్ర

ఈ శరీరము రథము, బుద్ధిసారధి ఇంద్రియాలు గుఱ్ఱములు, మనుస్సు కళ్ళెం, ప్రాణ అపానవ్యానదాన సమాననాగ కూర్మకృకహ, దేవదత్త, ధనంజుయ, అనే దశవిధపవనాలు ఇరుసులో ధర్మాధర్మములురెండు రెండు చక్రాలు చిత్తము కఠినమైన త్రాడు (బంధం) శబ్దస్పర్శ రూప రసగంధాధులు రథం సంచరించే మార్గాలు అహంకారి అయిన జీవుడు రథమునవధోరహించిన రథికుడు, ఘనమైన ప్రణవమే ధనస్సు శేద్ధజీవుడే బాణం, బ్రహ్మమే పరమలక్ష్యము. రాగ,భయ,మద,మోహ,శోక,లోభ, అహంకార, మత్సరాలు బద్ధ శత్రువులు.

ఇటువంటి శరీరరూపమైన రథమును మానవుడు పొంది చేరవలసిన గమ్యం పరమాత్మను చేరకపోతే వాని జన్మనిర్థకము, మళ్ళీ ఇట్టి పరమాత్మ సన్నిధిని కావలసిన రథం దొరుకుట కష్టము.

పుణ్యకర్మవశమున పొందబడిన ఈ దేహము వచ్చినపుడే జన్మరాహిత్యమైన పరబ్రహ్మమును చేరుటకు ప్రయత్నించాలె. అలాకాక వచ్చిన జన్మను పశుపక్ష్యాది క్రిమికీటములవలె ఆహారనిద్రాదులందే జీవితమంతయు వ్యర్థము చేసిన మళ్ళీ ఇట్టి

కర్మాధికారం, మోక్షాధికారంగల మానవజన్మవచ్చునను నమ్మకము లేదు. గావున వచ్చిన మానవజన్మ గొప్పదనాన్ని గుర్తెరిగి, జన్మసాఫల్యం బొందుటకు ప్రయత్నించవలెను. అదేమానవ జన్మకే సాఫల్యము.

క॥ నరజన్మంబున మోక్షము
కనకుండినలేదు లేదుయేజన్మమునన్
ఇదిగోయిప్పుడు సమయము
నినునీవెతెలియవయ్యనారాయణకనీ

మోక్షాధికారం ఈ ఒక్క నరజన్మకేగాని మరి యేజన్మలలో లేదు. అట్టి జన్మయిది, ఇట్టి జన్మను వృథా జేసుకొనిన యింక ఏ జన్మకు ఇట్టి సదావకాశంలేదు. దైవానుగ్రహంతో దొరికిన ఈ జన్మను భగవదాయత్తచిత్తుండై జీవితమును ధన్యముగా వించుకొనవలెను. భగవంతుని పురస్కరించుకొని చేయు కర్మ యజ్ఞముగాను, భగవంతుని తిరస్కరించి చేయు కర్మ దుర్షకర్మగా అగుసు కావున అర్జునా ! భగవదాయత్తచింత్తుండవై నిష్కామ భావనతో విద్యుక్త ధర్మంగా భావించి నీ పాలిటిబడిన యుద్ధమొనర్చుము.

" యజ్ఞార్థాత్కర్మమణో న్యత్రలోకోయం కర్మ బంధనః ।
తదర్థంకర్మ కౌంతేయ ముక్త సంగస్సమాచర ॥

అర్జునా ! యజ్ఞార్థం చేసే కర్మలు బంధాన్ని కలిగించవు. అటుగాక స్వార్థరూపాలైన కర్మలు చేసి లోకము బంధానికి గురి అవుతూవుంది. యిది తెలుసుకొని నీవు నిస్సంగుడవై కర్మలు, భగవదర్పిత బుద్ధితో చేయుము. యజ్ఞోవైవిష్ణుః. యజ్ఞనమనగా విష్ణువని అర్థము. అనగా భగవంతుడు భగవదర్పితముగా కర్మలు చేయుమని అర్థము. " యజ్ఞార్థాత్కర్మణోః " అను పదానికి అర్థము. అటుగాక " అన్యత్రలోకోయం కర్మబంధనః " భగవదర్పితము కాకుండ స్వార్థముతో చేయబడే కర్మలు, బంధానికి కారణము అవుతాయి. అని రెండవ పదానికి అర్థము. యజ్ఞమనగా వైదిక యజ్ఞముకాదు. ఈ శ్లోకమునందు చెప్పబడినది. కావున చేయబడే కర్మలు భగవదర్పిత భవనతో చేయుట ఒక యోగం అని అర్థము. ఈ యోగమే మనలను భగవంతుని కృపకు పాత్రులను చేస్తుంది.

భగవదర్పితముగాని కర్మ ఎంతగొప్ప కర్మ అయినప్పటికీ శునకముచే నాకబడిన పాయసములాగా అపవిత్రమవుతుంది. భగవదర్పితముగా చేయబడిన కర్మ ఎంతటి అల్పమైనప్పటికీ భగవంతునికి నివేదించిన పదార్థము ప్రసాదమైనట్లు పవిత్రత చెందుతుంది. గోధుమపిండి, చక్కెరతోచేరి మధురమైనట్లు భగవద్భావనతో చేయబడిన కర్మ పవిత్రత చెంది భవరోగ నిర్మూలకను కారకమవుతుంది. " స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే

మహతోభయాత్" అన్నట్లు భగవదర్పితమై ధర్మబుద్ధితో చేయబడిన కర్మ అతిస్వల్పమైనా, భయానకమైన సంసారసాగర తరుణోపాయము కాగలుగుతుంది. ఇందుకు ప్రసక్తుని జీవితమే మనకు పరమ ప్రమాణము. సక్తప్రస్థుడను బ్రాహ్మణుడు భగవద్భావనతో, ధర్మబుద్ధితో ఏ కొద్దిగనో దానముచేసిన పేలపిండి, ధర్మరాజు చేసిన యజ్ఞముకంటే గొప్ప ఫలితాన్ని యిచ్చినట్లు మనకు భారతము చెప్పుతుంది. అలాగే రంతీదేవుడు చేసిన స్వల్పమైన జలదానము భగవంతుని సాక్షాత్కారము కలిగించి ముక్తినిబొందినట్లు రంతీదేవుని కథమనకు సూచిస్తుంది.

యజ్ఞము, దానము తపస్సులాంటి గొప్ప కర్మలు కూడా భగవద్భావన లేకుంటే అహంకార మమకారాలకు కారణమై మంచికంటే చెడ్డనే ఎక్కువ కలిగిస్తాయి.

భాగవతములో దక్షుడు చేసిన యజ్ఞము చాలాగొప్పది. దేవతలు సైతం దక్షయజ్ఞమునకబ్బరపడి, విమానములపై బారులుతీరి పోయినట్లు చెప్పబడినది. అయితేనేమి ఆ యజ్ఞము దక్షుని పాలిటికి మారకమైంది (కారణము) భగవంతుని పురస్కరించుకొని చేయవలసిన యజ్ఞము. భగవంతుని తిరస్కరించి అహంకారముతో పరమశివుని పరిహాసింప చేయుటకు చేసిన యజ్ఞము. కావుననే అది రణభూమిగా రుద్రభూమిగా మారిపోయింది. ఉన్నతల కాస్తపోయి గొఱ్ఱెతలను పొందాడు. యజ్ఞము గొప్పదైనా దక్షుని చెడు ప్రభావముతో విపరీత ఫలము యిచ్చినది.

అలాగే దానం చాలా గొప్పదే అయితే నృగుమహారాజు గోదానంచేసి ఊసరవెల్లి అయినాడు. దానం మంచిదే అయినా భావ ప్రభావంతో విపరీత ఫలితాన్ని పొందాడు.

" తపసాతిల్బిషంహంతి" అన్నట్లు తపస్సుతో ఎంతటి పాపాలు సైతం పరిహరింపబడుతాయి. అయితే భస్మాసురుని తపస్సు వాని ప్రాణాలే తీసింది. ఎందుకు వరాలు యిచ్చిన పరమేశ్వరున్నే భస్మం చేయాలనే పాపపుబుద్ధి వాన్ని సర్వనాశనం చేసింది. కావున చేయబడే కర్మలు యజ్ఞార్థంగా (భగవదర్పితంగా) వుండినపుడే ఆకర్మలు మహోన్నత ఫలితములనిచ్చి మానవున్ని మాధవునిగా, నరుని నారాయణునిగా మార్చివేస్తాయి.

కావున చేయబడే కర్మలు పవిత్రమైన భావన గలిగి చేయాలి. అపుడే అవి కర్మలు కర్మలుగాక యజ్ఞంగా మారి జన్మ సాఫల్యాన్ని ఇస్తాయి. కర్మకన్న కర్మలో పెట్టిన భావన గొప్పది. నీవు ఏ కర్మ చేస్తున్నావో కాదు కావలసింది, ఏ భావనతో చేస్తున్నావో ఆ భావము ప్రధానము. భగవంతునికి " భావగ్రాహీ జనార్దనః" భగవంతడు భావాన్ని చూస్తాడేగాని కర్మను చూడడు. నీ పాలికి వచ్చిన స్వధర్మం పాకి పని అయినా భగవద్భావనతో చేస్తే అదే భగవంతునికి ప్రీతి. ప్రతికర్మలో కూడా భావం అనే పవిత్రత మేళవించినపుడు అదే మహాష్టాంగా మారుతుంది. దానికి మించిన యోగంలేదు. యజ్ఞములేదు.

**"ఆత్మాత్వం గిరిజామతిః పరిజనః ప్రాణాః శరీరంగృహం।**
**పూజాతే విషయోపభోగరచనా, నిద్రాసమాధిస్థితిః**
**సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరః**
**యద్యత్కర్మ కరోమితత్తదఖిలం శంభోతవారాధనం॥**

ఈశ్వరా! నా ఆత్మయే నీవు, నా బుద్ధియే నీ అర్ధాంగియగు పార్వతి, నా ప్రాణములే నీపరిజనులు. నా శరీరమే నీ యిల్లు. నేను నా జీవితా వసరములగు విషయములననుభవించుటకే నీయొక్క పూజ. నా యొక్క నిద్రయే సమాధిస్థితి, నేనెచట సంచరించిననూ అదియంతయు నీకు ప్రదక్షము చేయుటే, నేను మాట్లాడునదంతయు నిన్ను గూర్చిన స్తోత్రములే. ఈ విధముగానే నేది చేసినను అది యంతయు నీ యొక్క అరాధనయే అయి యున్నది. అని శివానందలహరిలో చెప్పబడినట్లు ఇట్టి పవిత్ర బ్రహ్మాఖానగల మహాత్ముల కర్మలు కర్మలుగావు. వారి జీవితమే ఒక మహాయజ్ఞము.

పై విధముగానేభక్తుడు భావించునో అట్టివారి జీవితమంతయు హరి పూజగా మారి జన్మ చరితార్థము కాగలదు. మానవుడు తరించుటకు ఇంతకన్నా సులభతరమైన మార్గము వేరొకటిలేదు. జన్మ తరించుటకు పెద్దపెద్ద యజ్ఞములు, యాగములు, తపస్సులు చేయలేకపోయినను, మనసులోని భావం మంచిగా మార్చుకంటే అంతకుమించిన తారకం మరేదిగలదు. ప్రపంచంలో దేనికైనా దరిద్రం వుండవచ్చుగాని భావానికి దరిద్రం లేదుగదా. "భావశుద్ధియే జ్ఞానసిద్ధి" అనిగదా నానుడి.

తొల్లి ప్రజాపతి (బ్రహ్మ) ప్రజలను యజ్ఞములతో సహాసృష్టించి ఈ లోకానికి పంపాడు. కావున ఈ యజ్ఞకర్మ మానవకోటికి స్వధర్మముగా దేవుడు తెలియజెప్పాడు. యజ్ఞకర్మలతో ఊర్ధ్వలోకమున గల దేవతులు సంతసించి వారు మానవులకు ఇష్టార్థసిద్ధిని ప్రసాదించగలరని తెలియజెప్పిరి. అట్టిదైవ ప్రసాదితములైన భోగవస్తువులను భుజించువారు ధన్యులు. అటుగాస స్వార్థ పరులై భగవదర్పితం చేయక భుజించువారు "తేత్వఘం భుంజచతే పాపాయేపచం త్యాత్మకారణాత్" అట్టివారు తినునది అన్నముగాదు పాపమునే తినుచున్నారు అని దెల్పిరి.

**" అన్నాద్భవంతి భూతాని, పర్జన్యాదన్న సంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యః యజ్ఞఃకర్మ సముద్భవః ॥**

అన్నమువలన భూతకోటి గల్గుచున్నది. వర్షమువలన అన్నం ఉత్పత్తి అగుచున్నది. ఆ వర్షము యజ్ఞమువలన గలుగుచున్నది. యజ్ఞము కర్మవలననే సిద్ధించుచున్నది. అట్టికర్మ వేదము నుండి పుట్టినది. వేదము పరమాత్మ నుండి గల్గినది. కావున సర్వవ్యాపకమగు పరమాత్మ నుండి గల్గినది. కాపున సర్వవ్యాపకమగు పరమాత్మ

సర్వదా యజ్ఞమునందు ప్రతిష్ఠితుడై యున్నాడు. ఈ విధముగా జరుగుచున్న యజ్ఞ చక్రమును అతిక్రమించువాడు పాప జీవనుడగుచున్నాడు. అట్టివాడు ఇంద్రియలోలుడై పశువులకంటే హీనస్థితిని పొందుచున్నాడు.

యజ్ఞమనగా త్యాగముతో కూడిన కర్మ సృష్టిలో ప్రతి ప్రాణికూడ యజ్ఞకర్మను అనుసరిస్తూ వున్నది. ఒక్క నరరూపముననున్న రాధముడు నరరూప రాక్షసుడు తప్ప మిగిలిని ప్రాణికోటి అంతయు తెలియకనో తమ జీవిత స్వరస్వమును పరోపకారార్థంగా త్యాగం చేస్తూనే వున్నాయి. పంచభూతములైన భూమి, నిప్పు, నీరు, గాలి, వాయువు ఆకాశము కూడా పరోపకారంగా తమ సహకారం లోకానికి అందిస్తున్నాయి. ఇంతసేవ చేస్తున్నా, అహంకారంలేదు. కర్తృత్వబుద్ధిలేదు. ఫలాపేక్ష లేదు. పరోపకారమే పరమ ధర్మంగా అవన్నీ అహర్నిశాలు యజ్ఞకర్మ (త్యాగం) చేస్తూనేవున్నాయి. అవికాస్త విశ్రాంతి తీసుకుంటే బ్రహ్మాండం మొత్తం పెద్ద విశ్రాంతి పాలౌతుంది. ఈ విధంగా బ్రహ్మదేవుడు యజ్ఞకర్మల సకామంగా కాకుండా నిష్కామంగా చేసి మీ యిష్టార్థ సిద్ధులు పొందడు అని ఆజ్ఞాపించెను.

ప్రతినిత్యం మన చేసే జీవనరంగములో సంపాదించుకొను సంపదలు ఎన్నో ప్రాణుల సహాయమున కావలసివుంది. మనము అనుభవించే బోగములలో ఎన్నో ప్రాణుల హింసారూపమైనదో దోషం పాపం కలిసివుంది. మనం భుజించు అన్నమునందు ఎన్ని జీవుల సహకారం, ఎన్నో ప్రాణుల హింస కలసివుంది. అట్టి హింసాత్మకము పరప్రాణుల సహకారం లేకుంటే అన్నమేలేదు. ఇట్టి పరప్రాణుల సహకారంతో తాను అనుభవించు ఆహారమునందు గల దోషములు వైదొలగి పాపములు పరిహరించుటకు వేదము మనకు పంచయజ్ఞములు విధిగా నిర్ణయించినది.

**" ఖండినీ పేషిణీ ఛుల్లీ ఉదకుంభీచ మార్జనీ, పంచ సునా గృహస్థస్యతాభిః స్వర్గంనవిందతి, పంచ సూనకృతం పాపం పంచయజ్ఞైర్వ్యపోహతి"**

కత్తితో తరుగునపుడు, విసురాయితో విసురునపుడు, వంట చేసేటపుడు (వంట చెరుకులు పొయ్యిలో పెట్టునపుడు) నీళ్లు నింపేటపుడు, చీపురుతో చిమ్మేటపుడు ఈ అయిదు కర్మలలో అనివార్యంగా కాస్తోకూస్తో ప్రాణిహింస జరుగుతూనేవుంది. అట్టి హింసాదోష నివృత్తికి, వేదం (1) బ్రహ్మయజ్ఞము, (2) దేవయజ్ఞము, (3) పిత్రుయజ్ఞము, (4) అథితియజ్ఞము, (5) భూతయజ్ఞము, అని పంచయజ్ఞములను విధించినది. పంచయజ్ఞములతో సర్వపాపములు సమూలంగా పరిహరింపబడి మానవుడు పరిశుద్ధుడై పరమాత్మను పొందుచున్నాడు.

1. బ్రహ్మయజ్ఞము : దీనినే సంధ్యాపాసన (సంధ్యావందనం) అందురు బ్రహ్మయనగా సృష్టికర్త సర్వఘ్నుడు, కరుణానిలయుడు. మానవ కళ్యాణముకొరకు ఈ జగత్తును సృజించెను. సృష్టిలోని సకల పదార్థములననుభవించుట కనువైన చక్కని సుందర శరీరమును ఇచ్చెను.

లోకములో మనకెవరైనా ఏ కొద్దిపాటి సహకార మొనర్చినా వారిని గూర్చి పదేపదే చెప్పుకొందుము. అట్టి యడల ఇంతి మహోపకారమొనర్చిన పరమేశ్వరుని స్మరింపుకుండుట ఎంతటి అవివేకము, అజ్ఞానమగును. కనుక మానవులు నిత్యము ప్రాతః సాయంసంధ్యా సమయములలో ఈ క్రింది విధంగా ప్రార్థించవలెను.

ప్రాతఃకాలమున జేసిన సంధ్యోపాసన సాయంకాలం వరకును సాయంకాల మొనర్చిన సంధ్య ప్రాతఃకాలము వరకును మనలను కాపాడి పాపకర్మలనుండి పునీతులుగావించును.

అనగా ! సూర్యోదయమునకు పూర్వము, సూర్యాస్తమయమునకు పూర్వము పరమేశ్వరుని గుణములను గూర్చి స్మరించుటే సంధ్యా పాసన లేక బ్రహ్మయజ్ఞము అనబడును.

**శ్లో॥ సంధ్యా ఉపాసతేయేతు, సతతం సంశితవ్రతాః**
**విధూత పాపాస్తేయాంతి, బ్రహ్మలోకం సనాతనం॥** (మనుశ్రుతి)

ఏ మానవుడు శ్రద్ధావంతుడై సంధ్యావందనాది కర్మలు ఆచరించునో అట్టివాడు సర్వపాప విముక్తుడై సనాతనమైన బ్రహ్మలోకమును పొందును. కావున ప్రతివారును సంధ్యోపాసన అను దైవస్మరణ రోజు నాచరించుట ఏదికలదో అదే బ్రహ్మయజ్ఞమనబడును.

2. దేవయజ్ఞము : దీనికే అగ్ని హోత్రమని పేరు. అగ్ని పరమేశ్వరుని కొఱకును, జలవాయుల శుద్ధి కొఱకును, ఈశ్వరుని ఆజ్ఞాపాలన కొఱకును, హవనము, హోత్రము, దానము దేనిద్వారా చేయబడునో ఆ కర్మకు " అగ్నిహోత్రమని పేరు"

**" సమిధాగ్నియందువ స్వతఘ్నుతైర్ బోధయతాతమ్**
**అస్మిన్ హవ్యాజు హోతన"**

ఓ మానవులారా ! మీరు వాయువు, ఓషధాలు, వృష్టి, జనము వీనిని శుద్ధమొనర్చి యెల్లరకు ఉపకారమొనర్చుటకుగాను అమ్రఫలాశాది కాష్టములతోను, శుద్ధమైన నేతితోను అతిథియగు అగ్నిని నిత్యము ప్రజ్వలింప జేయుడు. ఆ అగ్నియందు హోమము చేయుటకు యోగ్యములు. దుగ్ధములు, ఘృతము మున్నగు పుష్టికారకములు తేనెబెల్లము మున్నగు మధురములు, కుంకుమ పువ్వు, కస్తూరి మున్నగు, పరిమళ ద్రవ్యములను, శుద్ధము చేసియుంచి వానితో నిత్యమగ్ని హోత్రము చేసి ఎల్లరుకు ఉపకారము చేయుట దేవయజ్ఞమగును.

3. పిత్రృయజ్ఞము : పితరులనగా తల్లిదండ్రులు, వృద్ధులు, విద్వాంసులు. తల్లిదండ్రులు మనకు జన్మనిచ్చిన దాదిగా ఎన్నోకష్టములకోర్చి, మనలను పెంచి పెద్దవారిని చేసి విద్యాబుద్ధులు నేర్పి ఎంతో వున్నతిని ప్రతిష్టలనార్జించుటకు కావలసిన సంస్కారవంతులను జేతురు. అట్టివారిని వృద్ధాప్యములో ఎట్టి కష్టములకు లోనుకానీయక సకాలమునకు అన్న పానములనిచ్చి ఆదరించుట పితృయజ్ఞమందురు మరియు అమావాస్య, పౌర్ణమి మొదలగు తిథుల సచ్ఛాస్త్రీయుగా నాచరించుట తద్దినాది దినములందు పిండములిడుట కూడా పితృయజ్ఞమనబడును.

4. అథితియజ్ఞము : విద్వాంసులు, సాధుసత్పురుషులు, సన్యాసులు లోకకల్యాణము కొరకు నిరంతరము లోకమున సంచరించుచు, తిది, వార, నక్షత్రములతో నిమిత్తములేక 'ముందుగా తమ రాకనుగూర్చి తెలుపక ఇంటికి వచ్చువారు అతిథులనబడుదురు. అట్టివారు మన గృహమునకు విచ్చేసినపుడు వారిని ఆదరణతో అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించి వారిద్వారా ధర్మోపదేశములను పొంది జీవితమును సాఫల్య మొనర్చుకొని, పురుషార్థ చతుష్టయమైన ధర్మార్థ కామమోక్షములను సాధించుటకు దోహదము చేయునది అతిథియజ్ఞమనబడును.

5. భూతయజ్ఞము : దీనినే బలివైశ్యబలి అందురు. అనగా గృహములో వండిన పదార్థములలో ఉప్పు, పులుపు, కారము కలిపిన వానిని వదలి, ఇతర పదార్థములను నేయి, పాలు, తీపి మొదలగు వానిని అన్నములో కలిపి పొయ్యిలోనుండి కొన్ని నిప్పులను వేరుచేసి అగ్నిలో అయిదు తడవలు ఆహుతులివ్వవలెను తదుపరి మన గృహపరిసరములలో అనేక జంతువులు ఆవు కుక్క పిల్లి మున్నగునవి మనకెంతో ఉపకరించుచుండును. ఆవు మధురమైన పాలనిచ్చును. కుక్క మనకెంతో విశ్వాసముతో మనయింటిన రాత్రి సమయమున దొంగలబారినుండి కాపాడును. పిల్లి ఇంటియందుగల పదార్థములన నష్టపరిహారము ఎలుకలను నిర్మూలించి మన పదార్థములు ఎలుకల బారినుండి కాపాడును. యిట్టి ఉపయోగకర జంతువులకు మనము నిత్యము కొంత అన్ని భాగములనిచ్చు చుండవలయును. ఇట్లే సమాజములో కుంటి, గ్రుడ్డి, మున్నగు వికలాంగులు స్వయముగ వారి ఉదరపోషణము చేసుకొనలేని వారలెందరో వుందురు. అట్టివారికి ప్రీతితో మన శక్తి కొలది సహాయ మొనర్చుట బలివైశ్య యజ్ఞమనబడును.

"ఓం సునాంత పతినాంచ స్వపాచమ్ పాపయోగినామ్ వాయసానామ్ కృమీణాంచ శనకైర్ నిర్వపేత్ భువి - మను శాస్త్రము (3/92) కుక్కలకు పతితులకు, శ్వపచులకు అతి నీచులకు మున్నగు వాటికి వేరు వేరుగ ఆహార భాగమునిచ్చి సర్వ ప్రాణులకు సుఖమును కలిగింపి జేయుటయే భూత యజ్ఞమనబడును.

యీ పంచ యజ్ఞముల వలన కలుగు ఫలము బ్రహ్మయజ్ఞము వలన విద్య, శిక్షణ, ధర్మము, సత్యము, సభ్యత, సంస్కారములు మున్నగు సుగుణములు వృద్ధియగును.

అథితి యజ్ఞము వలన మన అందరియందు ఒకే ధర్మము స్థిరమగును. ఆ అతిథులు లేకున్న సందేహ నివృత్తి, ధర్మబుద్ధి కలుగదు.

భూతయజ్ఞము వలన సమ్త ప్రాణులకు సుఖము చేకూరును. ఇట్లు పంచ యజ్ఞముల వలన సకల మానవుల శ్రేయస్సేగాక, లోక శ్రేయస్సు కల్యాణమునకు దోహదమగును. కావున అర్జునా యుద్ధము నీ నియత కర్మ. కాన సంగములేక సంగవర్జితుడవై నీ ధర్మమును పాలింపుము.

**కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥**

అయ్యా ! అర్జునా ! ముక్త పురుషులైన మహానుభావులగు జనకుడు, యిక్ష్వాకువు, అశ్వపతి, అత్యాది వారెందరో లోకసంగ్రహార్థమై కర్మలొనర్చిరి. గావున నీవు ఆ పెద్దలు నడచిన మార్గముననే నడచి ముక్తపురుషుడవు గమ్ము.

జనకాదులు ముక్త పురుషులు జీవన్ముక్తి పొందిన మహానుభావులు. అట్టివారు కూడా కర్మనాదరించి, వారిగురించి కాకపోయినా లోకముయొక్క శ్రేయస్సుగురించి అనాసక్తులై కర్మను చేశారు. భోజనానంతరం కూడా గృహిణి వంట చేస్తున్నచో అది వారిగురించికాదు. ఇంటికి వచ్చిన అతిథుల గురించి. అలాగే సిద్ధపురుషులు, ముక్తపురుషులు కర్మాతీతులైనను కర్మలాచిస్తున్నారన్న అదివారి గురించిగాదు. లోకశ్రేయస్సు గురించి. కావున కర్మ జ్ఞానం కలుగక పూర్వచేసిన చిత్తశుద్ధికిని, జ్ఞానం కలిగిన తరువాత లోకశ్రేయస్సుకును దోహదం చేయును. కావున కర్మ మామటకంటే చేయుటే సర్వశ్రేయస్సు మూలము.

నిష్కామంగా విధి కర్మలాచించుట సంస్కారమును గల్గించి మానవున్ని పునీతుని చేస్తాయి. కామనలేక చేయబడు కర్మలు కోరలు తీసిన సర్పములు లాగా తనకు లోకానికి కూడా శ్రేయస్సును గల్గిస్తాయి.

సకామముతో చేయబడే కర్మ విషదంతములుగల సర్పమువలె తనకు, తనతోటి సమాజమునకు భయానకము కాగలదు. సకామక్మలో రాగము, ద్వేషము అను రెండు దుష్టగుణాలున్నాయి. అట్టి రాగద్వేషములతో చేయబడే కర్మ తనకు లోకానికి కూడా కంటకమౌతుంది. అట్టి కర్మ మహాపాప హేతువౌతుంది.

సకామ కర్మలో కామక్రోధములు విడదీయరాని గుణాలు. ఇవి మనిషిని బలవంతంగా పాపకర్మలకు లాగి మనిషిని పాపకూపములో పడద్రోస్తాయి.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

ఈ కామక్రోధములు రజోగుణమున ఉద్భవించినవి. తీరని ఆశ కలిగినవి. మహాపాపరాసులు. జ్ఞానికిసైతము ఇవియే మహాశత్రువులు.

జ్ఞానికే ఇవి శత్రువులైనపుడు అజ్ఞాని విషయం చెప్పనక్కరలేదు. జ్ఞానమునకు యత్నించు జిజ్ఞానువులనే సైతము ఇవి విషయాదులకులాగి సంసార కూపమున ముంచుతాయి. అగ్నిహోత్రువలె మహా ఆశగలవి. ఎంత అనుభవించినా తృప్తిని బడనీయవు. ఈ కామాదుల బారినబడిన జీవుడు జన్మజన్మలు ఎత్తి నానా యోనులందు పరిభ్రమించి వలసియుండును.

కం॥ కామోపభోగసుఖములు
వైమారును పురుషడు భవింపు చునున్నన్
కామంబు శాంతి పొందదు
ధూమధ్వ జుదాజ్యవృష్టి దృంగుడువదునే

ఎన్ని కామోప భోగములు అనుభవించినా కామానికి తృప్తి కలుగదు. నెయ్యితో అగ్ని హోత్రుడు వృద్ధిజెందునట్లు పురుషుడు అనుభవించేకొద్దీ కామాగ్ని వృద్ధి పొందుతుంది. ఇది మహాపాప హేతువైనది. దీనిలోతు అపారం. సముద్రములోతుకంటే మహా అఘాదమైనది. దీన్ని తృప్తిపరచుట అంతింతనరాని పని.

క॥ కడలేదా శాలతకున్
కడజూడగానరాదు కడగనిరేనిన్
కడముదమున సంసారము
కడగందురుతత్త్వ విదులు కమలదళాక్షీ

కామముచే ఆశనెంత నిండించినా నిండని మహాసముద్రములాంటిది. దీనినుండి బయటపడినవాడు ధన్యుడు. వాడే తత్త్వజ్ఞాని. జీవునికి ఈ కామక్రోధములు మహాశత్రువులు. ఈ రెండు గుణములున్న చాలు. అన్ని దుర్గుణములు వీటినంటియే యుండును. కొద్దో గొప్పో సుగుణాలున్న వారిలో యిందేది ప్రవేశించినా అమృతభాండంలో విషగరళము పడినట్లు అన్ని సుగుణాలు నాశనమై పోతాయి.

ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥

ఓయీ ! పార్థా ! అగ్నిని పొగ, అద్దాన్ని ధూళి, శిశువును మావి ఆవరించినట్లు ఈ కామము జ్ఞానాన్ని ఆవరించివుంది. పొగతో కప్పబడిన అగ్ని తన ప్రకాశామును మరుగబడినట్లు అద్దాన్ని ఆవరించిన ధూళి మన ప్రతిబింభాన్ని స్పష్టంగా గోచరింప జేయునట్లు మావితో ఆవరించిన శిశువు, కాలు చేతులు కదిలింపజాలనట్లు కామముతో ఆవరింపబడిన జ్ఞానము స్వస్వరూప జ్ఞానాన్ని గోల్పోయి మోక్షమును పొందకున్నది.

అగ్నిని వూదుటచేత, అద్దమును శుభ్రముగా తుడుచుటచేత కాలంతోచేరి శిశువు మావినుండి విడబడుట ఎట్లు జరుగునో ఆ విధముగనే మల విక్షేప అవరణములతో గూడిన ఈ దోషత్రయములు కర్మభక్తి జ్ఞానములను ప్రయత్నములచేత ఆత్మదోషత్రయములు నుండి విడబడుచున్నది.

రామాయణము నందు ఈ కామమును మారీచునిగా వర్ణింపబడినది. మారీచుని తల్లి తాటకి, తాటకివధానంతరమే మారీచునివధ జరిగినది.

**ఆ॥ భ్రాంతికామములని ప్రాజ్ఞులు మారీచు**
**దాటకనుగ శ్రీత్రుతుతత్త్వమరసి**
**భ్రాంతికామములను బట్టి నిర్జించుచు**
**జ్ఞానమును గడింప, గడగవలయు**

**ఆ॥ భ్రాంతియనున దొకదు బలముగా దేహాన**
**బెంచుగామమును, వివేకమడచి**
**కామమెప్పుడేగాని గాంచినవృద్ధిని**
**మాయాజిక్కి జీవి మందుడగును**

అని ఆధ్యాత్మిక రామాయణము కామానికి మూలము భ్రాంతి, భ్రాంతి వల్లనే కామం జనించేది. కావున ముందు భ్రాంతిని విచారము ద్వారా బారద్రోలిన కామము ఏపులేకుండా పోతుంది. భ్రాంతి యున్నంతవరకు కామమును జయించుటకల్ల. కావుననే రామాయణమున తాటకి శ్రీరామునితో అంటుంది.

**ఆ॥ భ్రాంతి రూపిణియౌ నేను బ్రతికియుండ**
**గామరూపుని మారీచుగాంచ గలరె**
**తొలగి చనుడింక మీరలు నిలువదగదు**
**తాటకన్ జూడలోకంబు తల్లడిల్ల**

ఈ భ్రాంతితోనే లోకం అంతా అతలాకుతలం అవుతుంది. భ్రాంతి వున్నవంతవరకు కామం నశించదు. కామమున్నంత వరకు జీవునకు శాంతిలేదు. " భ్రాంతి

వీడిన కామంబు శాంతినొందు" అనే సామెతవుంది. ఆత్మజ్ఞాన విచారంచే సద్గురు దేవుని సన్నిధానంలో శ్రుతియుక్తి అనుభవరూపకం గాగల్గు జ్ఞానం భ్రాంతిని వర్జింప జేయున్.

"భ్రాంతులుడిన బ్రహ్మంబు బట్టబయలు" అని వేమనయోగి చెప్పినది ఇదియె.

కావున అర్జునా ! విషయములకంటే ఇంద్రియములు. ఇంద్రియముల కంటే మనస్సు, మనస్సుకంటే బుద్ధి, బుద్ధికంటే కూడా ఆత్మ శ్రేష్ఠమైనది. అట్టి శ్రేష్ఠమైన పరమాత్మను నీవుగా దెలసికొని అపకార కారణములైన కామక్రోదాధులను జయింపుము.

ఆ॥ ఇతర సంకల్పులు లేక యెపుడు తాను
సచ్చిదాత్ముడనని సుప్రసన్న వృత్తి
దన్నుగనవాని చిత్తంబు తనకుదాన
పొలియుదనయంద నింధనానలము పగిది

మరియు

ఆ॥ ఆత్మతేజంబు వీక్షించునతని మాన
సేంద్రియంబు చేష్టలనెడల విడచి
యొదిగి చెదరక కదలలక యూరకుండు
సింగములగన్న గజముల భంగిననఘ

అని సీతారామాంజనేయ సంవాదం. ఇంద్రియ మనోబుద్ధులకు సాక్షియైన ఆత్మయే తాను, తనచేత తెలియపడే మనోబుద్ధి ఇంద్రియములు తనకంటే వేరైన దృశ్యకోటికి చెందిన విభ్రాంతి వశమున తనుకాని మానసంద్రిముల తనుగా బావించుటచేతనే ఈ జీవస్వభావం గల్గినది. కావున తనకంటే వేరుగాయున్న ఈ దేహమనో బుద్ధింద్రీయముల తనకంటే వేరుగా భావించిన ఇతర సంకల్పములు ఏవియు లేక స్వస్వరూపమున నన్నువాని ఇంద్రియాదులు కట్టెలులేని అగ్నివలె తమకుతామే శాంతించుచున్నవి. ఇట్టి వాడు ఆత్మ సామ్రాజ్యామునీ సులభతరముగా పొందుచున్నాడు. కావును ముక్షువైనవాడు ఆత్మసాక్షాత్కారము పొందుటకు, విషయాభిలాష లేక మానసేంద్రియముల అందుపులో నుంచుకొని, నిష్కామముతో చేయవలసిన విధ్యుక్త కర్మలు ఈశ్వరార్పణబుద్ధితో గావించి, కామవాసనల జయించి, ఆత్మజ్ఞానమును పొందవలయును.

క॥ వాదములు వేయి నేటికి
వేదోక్తవిధింజరించు విబుధుడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబుల గొలచిముక్తి పదమునకేగున్

# నాల్గవ అధ్యాయము

# జ్ఞానయోగము

శ్లో ॥ సర్వోపనిషదోగావో, దోగ్ధాగోపాలనందనః
పార్థోవత్సస్సుధీర్భోక్తా, దుగ్ధంగీతామృతంమహత్ ॥

ఉపనిషత్తులు గోవులు, పితుకువాడు గోపాలుడు, పార్థుడు దూడ సుధీజనులు భోక్తలు, మహత్తరమగు గీతామృతమే పాలు.

గీతాబోధామృతమును గ్రోలు సుజనులారా! వినండి ఈ రోజు గీత నాల్గవ అధ్యాయం జ్ఞానయోగము దేవలోకములోయుండే అమృతం సేవించిన దేవతలకు కూడా రాగద్వేషలోభాలు పాలేదు. దేవతలని పెద్ద పేరేగాని వారికి కూడ ఈ రాగద్వేషలోభాలు విడువలేకున్నారు. దేవతలకు రాజయైన ఇంద్రాడంతటివాడు ఈగుణాలకులోనై పడరానియిడుములు పడుతున్నాడు. కామానికి వశుడై గౌతముని భార్యను పొంది ముని శాపమునకు గురియైపోయాడు. లోభానికి గురియై తనకుకున్న అమృత బాండం మరొకరికి పోకూడదని దాచిదాచి చస్తున్నాడు. కోపానికి వశుడై ఎన్నిమారులో స్వర్గానికి దూరడయ్యాడు. దేవతలందరికి రాజు అయిన ఇంద్రుని గతే ఇలావుంటే మిగిలిన దేవతుల సంగతి చెప్పనక్కరలేదు. "అ బ్రహ్మభువనాలోకాః పునరావర్తినోర్జునా॥ అన్నట్లు బ్రహ్మలోకాలకు పోయినా పుణ్యక్షయం కాగానే మళ్ళీ ఈ లోకాలకు రావలసిందే.

కావున దేవలోకంలోవున్న అమృతంకన్న ఈ గీతామృం గొప్పది. దీన్ని సేవించినవారికి, "నపునరావర్తతే" మళ్లీ జన్మలకు రావలసినపనిలేదు. లోకాలోక గమనం చేయవలసిన అగత్యం అంతకంటే లేదు. గీతామృతం అనుజ్ఞానమును పొందిన మహానుభావునికి నరకానికి ముఖద్వారాలైన కామక్రోధలోభ గుణాలు మటుమాయమైపోతాయి. ఈజ్ఞానామృతపానం చేసిన మహానుభావునికి గల్గు అనందం అఖండమైనది. ఇది యెన్నటికి తరగనిది. నిత్యానందమయం ఇట్టి యానందం భూతలముగాని, స్వర్గమునగాని మరెచ్చటను లేదు.

శ్లో ॥ యచ్చకామసుఖంలోకే, యచ్చదివ్యంమహత్సుఖం,
తృష్ణాక్షయసుఖస్యైతే, కళాంనార్హన్తిషోడశీం॥

ఇహలోకమునకు సంబంధపడినయేయే సుఖములున్నవో పరలోకమున ఏ సుఖములున్నవో అవన్నియు కూడా వైరాగ్యపూర్ణమైన జ్ఞాన సాగరమందు ఒక బొట్టుతో (బిందువుతో) సమముగావు. అనగా! ఆత్మజ్ఞానమునకు సరిపోల్చు సుఖములు ఏ లోకమున లేవు.

"నసుఖంసురేంద్రస్య, నసుఖం చక్రవర్తినః" బ్రహ్మజ్ఞానమునకు సమమునకు ఇంద్రసుఖంగాని చక్రవర్తి సుఖం ఏవియు సమంగావు అని శ్రుతి.

అట్టి మహత్తరజ్ఞానమును గురించి ఈ అధ్యాయమున దెల్పబడుచున్నది. మరియు అట్టి జ్ఞానమునకు నిష్కామకర్మయోగం, యజ్ఞకర్మలు ముందు అవశ్యము ఆచరింపదగినవనియు అట్టి నిష్కామయజ్ఞాచరణమువల్లనే పవిత్రమైన జ్ఞానం సిద్ధించుననియు దెల్పబడియున్నది.

లోకమునందు చాలమటుకు జనులలో కర్మకంటే జ్ఞానము చాలగొప్పదని కర్మయోగమును ఉదాసీనభావముతో జూచుచున్నారు. కాని భగవానుడు ఈ జ్ఞానయోగానికి ముందు కర్మయోగము దెల్పుతు కర్మయొక్క విశిష్టత్వమును దెల్పితరువాతనే జ్ఞాన యోగంచెప్పుట. శరీరార్షులు జ్ఞానసముపార్జనకు కర్మయోగం ముఖ్యాంగముగా జెప్పియున్నారు. "స్వకర్మణాతమభ్యర్చ్య విద్ధింవిందతిమానవః" అనిమునుముందు కూడ జ్ఞానసిద్ధికి స్వకర్మాచరణముఖ్యమని జెప్పియున్నారు. లోకమాన్య బాల గంగాధరతిలక్ మహాశయులు. గీతారహస్యమనుకర్మ యోగమును గురించి బృహద్ గ్రంథమును రచించి యున్నారు. నేడు ఆ గ్రంథము అనేక భాషలందు ప్రచురించబడి లోకమన్నలనుందుకొన్నది. తిరుపతి దేవస్థానం వారు కూడా ఈ గ్రంథమును ముద్రించి ఆంధ్ర జనులకు మహోపకారమొనర్చిరి.

పండుకు, కాయకు, పుష్పము ఆధారమైనట్లు జ్ఞానమనే ఫలమునకు భక్తి కర్మయోగములు ఆధారములైయున్నవి.

"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథాబౌపక్షిణాంగతిః, తథైవజ్ఞానకర్మాభ్యాం జాయతే పరమం పదమ" ఆకాశమున విహరించు పక్షికి రెండు రెక్కలెట్లు అసరమో మోక్షమార్గమున విహరించుటకు కర్మజ్ఞానములు అవసరములైయున్నవి.

భగవదాయతచిత్తంతో నిష్కామంగాచేయబడు కర్మలు చిత్తశుద్ధిని కల్గించును. అట్టి చిత్తశుద్ధి ద్వారా జ్ఞానం పొందుటకు నముపార్జింప వీలుపడుచున్నది. అనియోగవాశిష్టమున వశిష్టమహర్షుల వారు దెల్పియున్నారు.

మరియు

"యస్మాత్రజస్తమో, మలోప సంస్పృష్టమేవ చిత్తం కాదా బడిశేనాకృష్య" విషయదురంతసూనస్థానేషుని క్షిప్యతే, తన్మాన్నిత్య నిత్య కర్మానుష్ఠాన పరిమార్జనేన అపవిద్ధర జస్తమోమలం ప్రసన్న మనాకులం, సమార్జిత, స్ఫటిక శిలాకల్పం బాహ్యా విషయ హేతుకేనచ, రాగద్వేషాత్మకేన అతిగ్రహబడిశేనా కృష్యమానం, విధూతా శేషకల్మషం త్ర్యబ్మాత్రప్రణవం చిత్తదర్పణమపతిష్ఠతే.

అనినైష్కర్మ్య సిద్ధి గ్రంథమున ఇట్లు దెల్పబడినది. చిత్తమునురజోగుణము, తమోగుణము ఆవరించి యుండునేని విషయములందాసక్తి గలుగును. ఆయాసక్తియే కామమనంబడును. అట్టి కామము, గాలము చేపల లాగినట్లు చిత్తమును బలత్కారముగా నీడ్చిశబ్దాదివిషయములందు జేర్చును, శబ్దాదివిషయములు స్థూనస్థానములాంటివి. సూనస్థాన మనగా పశువులను మృగముల పక్షులను హింసించు స్థలము అట్టి స్థూన స్థానమునందు జేర్చబడిన జీవులు ఏ ప్రకారము నానా విధముల హింసింపబడునో ప్రకారమేశబ్దాది విషయములందు, గామముచేత చేర్చబడిన చిత్తమును నానా విధ దుఃఖముల నొందుచుండును, కావున చిత్తమందుగల రజస్తమోమాలిన్యమునునివర్తింపజేయుట అవశ్యకమై యున్నది. అందుకుగాను నిత్య నైమిత్తిక కర్మములననుష్టించిన ఆయనుష్ఠానము ఇటుకపొడితో చేసిన నొరిపడి అద్దము యొక్క మాలిన్యమునునివర్తింపజేయునటుల చిత్తము యొక్క రజస్తమోమాలిన్యమును వర్తింప జేయును అందుజేత ఆ చిత్తము అద్దమువలె శుద్ధమై నిస్త రంగసముద్రము వలె నిశ్చలమై, కడిగి, పెట్టిన స్ఫటిక శిలాకలశము వలె అత్యంత శీతలమై యుండును. అవుడుశబ్దాది విషయములచే నేర్పడి, వాటిని బట్టి ప్రవర్తింపుచున్న రాగద్వేషములందీ గాలమువలె చిత్తమును నాకర్షింపజాలవు. ఈ రాగద్వేషములు శబ్దాది విషయములకంటే నెక్కువగా చిత&ితమును బంధించి బాధించుచున్నందున అతి గ్రహములనబడును. చిత్తము సకల కల్మషములను పరిత్యజించియున్నందున ఈ అతిగ్రహములనే రాగద్వేషములు చిత్తమును బాధింపజాలవు అందుచే చిత్తము చిదాత్మ స్వరూపమునందే ఆసక్తమై ఆత్మస్వరూపమును ప్రకాశింపజేయును.

కావునతత్త్వ జ్ఞానమును పొందుము క్షువులకు కర్మ సాధనముగా నగును. ఇదే విషయములను భగవానుడు ఆరవ అధ్యాయమున, ఆరురు క్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే అని చెప్పి యున్నాడు.

కావున అర్జునా నీవు యుద్ధము మాని సన్యసింపనెంచినను అందుకు తగిన నిత్యనైమిత్తిక కర్మలాచరించవలసి వున్నది. కావున నీస్వధర్మమైన యుద్ధకర్మము మాని పరధర్మము ఆచరించభూనుట అవివేకమేయగును. కావున ఏ విధముగా విచారించి చూచినను మానవమాత్రలకు కర్మను సన్యసించుట కంటే విహిత కర్మలనాచరించుటే శ్రేయము.

గీతయందు భగవంతుడు నిష్కామకర్మను నెంత ప్రశంసించెనో సకామకర్మను అంతనిరసించి చెప్పాడు. ముల్లును ముల్లుతోనే తీసివేయునట్లు నిష్కామ కర్మతో సకామకర్మలవల్ల గల్గిన పాపదోషాన్ని పోగొట్టికొనవలెను.

పాపంగల హృదయంలో పరమాత్మ జ్ఞానంగలుగదు. ఆత్మసాక్షాత్కారమునకు రజోగుణ, తమోగుణ రూపమైన రాగద్వేషములను మలం వైదొలగవలెను. అందుకు ఈశ్వరార్పణ బుద్ధితో గావించు నిష్కామకర్మ అవసరమని భగవంతుడు చెప్తూవచ్చాడు.

అట్టి యోగ విద్యను లోకములో కల్గింపజేయుటకే పరమాత్మ అవతరిస్తూవుంటాడు. అయితే ఆయన నామనమాదిరే లోకములో దేహధారియై జన్మించిన మనకు ఆయనకు ఉన్న తేడా ఏమి? అని సామాన్యులు దలంతురు. అది కేవలం వారి అజ్ఞానం, ఎందుకనగా? జీవులందరు కర్మకు బద్ధులై జన్మిస్తారు భగవంతుడు కర్మను వశమొనర్చుకొని అవతరిస్తాడు. జన్మవేరు, అవతారములు వేరు. ఒకడు బావిలోపడి మునిగి పోతున్నాడు. మరొకడు అమాంతం బావిలోనికి దుమికి వాడిని బయటికి తీస్తున్నాడు. బైటినుండి చూచేవారికి ఇద్దరు బావిలోయున్నట్లు కన్పించినా! యిద్దరికి ఎంతో తేడా వుంది. ఒకడు మునిగిపోయేవాడు, మరొకడు మునిగిపోయేవాన్ని బైటికి తీసిరక్షించేవాడు.

అలాగే, భగవానుడు దేహధారియై ఈ లోకమున అవతరించడమనగా అజ్ఞానాంధకారంలో మునిగి దరిగానక పరితపిస్తున్న జీవకోటిని, ఉద్ధరించాకే అని తెలుసుకోవాలి.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥

లోకంలో ధర్మంనశించి అధర్మము పెచ్చుపెరిగినవుడు ఆయన అవతరణ జరుగుతూవుంటుంది.

లోకంలో ధర్మం లోపించునపుడు సమాజంలో సంచనలం బయల దేరుతుంది. చిన్న చేపలను పెద్ద చేప మ్రింగినట్లు బలవంతులు దుర్భలుల హింసింపబూనుతారు. తద్వారా ప్రాణికోటికి నెంతయు దుఃఖము వాటిల్లును. అపుడే భగవంతుడు అవతరించి, ధర్మసంస్థాపన గావించి, లోకమున యధావిధిగా శాంతిని ధర్మమును స్థాపించును.

ఒకమారు భగవానునికి సత్యము గొప్పదా! ధర్మము గొప్పదా యని అనుమానము రాగా, సత్యమును ఒక ప్రక్కను ధర్మమును మరొక ప్రక్కనుంచి త్రాసునందు తూచగా సత్యము కన్న ధర్మమే మొగ్గు, తూగెనట. అది మొదలు లోకశ్రేయస్సును గురించి ధర్మమును కాపాడుటకు, అధర్మమును రపుమాపుటకు దశావతారములెత్తెనని పెద్దలందురు. ధర్మం వల్లనే లోకం నిల్చివుంది. ధర్మం వల్లనే సముద్రుడు చెలియకట్టుదాటకున్నాడు. ధర్మంవల్లనే సూర్యచంద్రాదులు గగనమున నిల్చి లోకమునకు శ్రేయస్సును బన గూర్చాచున్నారు. కావున ధర్మమే సర్వమునకు ఆధారము.

అసలు భగవంతుడే ధర్మస్వరూపుడు సృష్టియంతయు ధర్మబద్ధమయ్యే జరుగుచున్నది. కావున ధర్మాచరణలేని జీవితం, ధర్మశూన్యమైన వర్ణాశ్రమ వ్యవస్థ పతనమగును. సృష్టికి మూలాధారమైనట్టి ధర్మము దేశములో, జాతిలో, మనిషిలో, లోపించినపుడు అట్టి ధర్మసంరక్షణార్థమై భగవంతుడు అవతరించును.

ధర్మార్థకామ మోక్షములు చతుర్విధ పురుషార్థములుగా సుప్రసిద్ధములు ఇవి అఖిల మానవులకు అవశ్యాపేక్షితములు ఇందు అర్థకామమోక్షములకు "ధర్మమే మూలము. ధర్మబద్ధం కాని కామముగాని, అర్థముకాని అనర్థ హేతవులు, ధర్మములేని అర్థ కామములు మానవుని దానవునిగా జేసి నాశనము చేయును.

శ్లో॥ ధర్మేణ రాజ్యం లభతేమనుష్యః,
స్వర్గంచధర్మేణ నరః ప్రయాతి
ఆయుశ్చకీర్తించ తపశ్చధర్మం
ధర్మేణమోక్షం లభతేమనుష్యః (బ్రహ్మాపురాణం)

ధర్మాచరణము వలన మానవునికి రాజ్యము స్వర్గము ఆయుస్సు కీర్తి మోక్షము లభింపగలవని బ్రహ్మాపురాణము వక్కాణించుచున్నది. ధర్మము, ఆయా యుగముల బట్టియు, దేశములబట్టియు, జాతిని బట్టియు మారుచుండును. ఒక దేశమునకు ఒక ధర్మము, మరియొకదేశమునకు మరియొక ధర్మము, ఎట్లు సహజమో, అట్లే ఒక జాతికి ఒక ధర్మము, మరియొక జాతికి మరియొక ధర్మము, సహజసిద్ధముగా నుండును. పాశ్చాత్యదేశములలోని ధర్మము, మనభారతదేశమునకు హితకరము కాదు. మనదేశధర్మములన్ని ఇతరదేశములకు ఫలప్రదముగావు.

ఇట్లు దేశమును బట్టియు, జాతిని బట్టియువర్ణమును బట్టియు ఆశ్రమమును బట్టియు (చతుర్విధ ఆశ్రమము) ధర్మ స్వరూపము మారుచుండును. ఇది ధర్మరహస్యము.

మన భరతదేశము, ధర్మభూమి కర్మభూమియని జగదివిఖ్యాత నొందియున్నది. ఇతర దేశముల భోగములుగా సుప్రసిద్ధములు, నియమబద్ధమైన జీవిత నిర్వహణము, సత్కర్మాచరణము, సదాచారము, భగవధ్యానము, మోక్షశక్తి ఇత్యాదులు భారతీయులకు విధివిహితములు.

ఇదియే మానవతా ధర్మములగా శాస్త్రములువే నోళ్లచాటుచున్నవి. ఇట్టి ధర్మము నియమ నిష్టలూ భక్తి ప్రపత్తులు ఏ మానవుని యందు లోపించునో అట్టివారు నరులుగారు వానరులే యగుదురు.

శ్లో ॥ మతయోయత్రగచ్ఛంతి
తత్రగచ్ఛంతివానరాః
శాస్త్రాణియత్రగచ్ఛంతి.
తత్రగచ్ఛంతి తేనరాః

బుద్ధికితోచినట్లు, మనసులాగినట్లు ప్రవర్తించునని వరములనియు, శాస్త్ర సమ్మతముగా నడుచుకొనువారు నడులనియు, మన ధర్మశాస్త్రము దెల్పుచున్నది.

మానవుల హితముగోరి మన మహర్షులు కర్తవ్యాకర్తవ్యములను ద్యోంచియున్నారు అదియే, ఆర్షధర్మముగా ప్రశస్తిగావించినది. ఇట్టి మన ఆర్షధర్మము భారతీయులమైన మనందరికి అవశ్య ఆచరణీయమ ఈ ధర్మమే ఐహికాముష్మిక ఫలములను ప్రసాదింపగలదు. ఇది భారతీయులకు స్వధర్మము.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితం ధర్మం
యేనుతిష్ఠన్ హిమానవః
ఇహకీర్తి మహాప్నోతి
ప్రేత్యేచానుత్తమం సుఖమ్ ॥

మానవుడు వేదములందును, ధర్మశాస్త్రములందును, స్వధర్మమును పాలించుటవలన ఈ లోకములో సుఖమును, కీర్తిని పొంది అంతమున మోక్షానందమును బడయును. అని గీతానందేశమునే మను ధర్మము గూడ దెల్పుచున్నది. చతుర్విధపురుషార్థములవలెను, చతుర్విధవర్ణములును భారతీయులమైన మనకు భగవంతునిచే నిర్ణయింపబడినవి. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశఃత స్యకర్తారమపిమాం। విద్ధ్యకర్తారమవ్యయం॥

గుణభేదమును బట్టికర్మ భేదముల బట్టి నాలుగు వర్ణములను నేనే సృష్టించితిని, వాటికి కర్తను అయ్యిగూడ నేను అకర్తను అధికారినియని భగవానుడు దెల్పియున్నాడు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములను గుణకర్మలవలన ఏర్పడినవే కాని జన్మతో పుట్టుకతో ఈ జాతులు వచ్చినవిగావు. ఒకేమానవుని యందు బ్రహ్మచర్య గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను ఆశ్రమములు ఎట్లు ఆ యావయుసును కాలమును బట్టి ఏర్పడినవో మానవులంతా ఒకేజాతి అయినప్పటికి వారివారి గుణకర్మలబట్టి సృష్టి సంచాలనమునకు అనువుగా బ్రాహ్మణులని, క్షత్రియులని వైశ్యులని, శూద్రులని, వర్ణభేదములు గలిగినవని భగవానుడే దెల్పియున్నాడు. అంతమాత్రమున బ్రాహ్మణులు ఎక్కువని శూద్రులు తక్కువ జాతి అనిభావించుట అజ్ఞానము అగును.

గుణహీనులైన బ్రాహ్మణులు శూద్రులకంటే మహా హీనముగా దుర్వ్యసనముల పాలైనంత మందినేడు లోకమునగలరు. అలాగే గుణశ్రేష్ఠులైన వారు శూద్రులందు నేడు ఎంత మందినో మనం చూచుచున్నాము. గాన మానవునికి కులంకాదు శ్రేష్ఠము, గుణంశ్రేష్టం, గుణశ్రేష్ఠుడు ఏ జాతివాడైనా బ్రాహ్మణునితో సమానుడు, గుణహీనుడు చండాలునికంటే నీచుడు.

శ్లో॥ చండాలోప్యపిద్వి జశ్రేష్ఠో హరిభక్తి పరాయణః
హరిభక్తి విహీనస్తు బ్రాహ్మణోఽపి శ్వపాధమః॥

సంతత హరిభక్తి పరాయణుడైన చండాలుడైయినను బ్రాహ్మణ శ్రేష్ఠుడనబడును. హరిభక్తి లేనిదే బ్రాహ్మణుడైనను చండాలునికన్న అధముడు, కులం గొప్పదైనంత మాత్రాన హృదయం గొప్పదిగా వుండునని నమ్మజాలము.

సీ॥ వ్యాసుడేకులమందు వాసిగా జన్మించె
విదురడేకుల మందు వృద్ధిపొందె
కర్ణుడే కులమందు ఘనముగా వర్ధిల్లె
నావశిష్ఠుండెందునందునవతరించె
నింపుగావాల్మీకి యేకులంబునబుట్టె
గుహుడను పుణ్యుడే కులమువాడు
శ్రీశుకుడెచ్చటజెలగి జన్మించెను
శబరియేకులమందు జన్మమొందె

తే॥ నేకులంబున వీరిందరెచ్చినారు
నీకృపాపాత్రులకు జాతినీతి యేల ॥ భూషణ ॥

అన్ని నృషింహశతకము, అనలు మానవ జన్మవచ్చినదే పరమాత్మ సాక్షాత్కారమునకు, అందుకు భక్తి సత్కరజ్ఞానములు సాధనములని, అవిలేని మానవుడు ఎంతపెద్ద జాతి అయితేనేమి భగవంతుని సాక్షాత్కారమునకు నోచుకొనలేదు.

కావున జాతికన్న కులముకన్న గుణకోవిదుడే శ్రేష్ఠుడు. గుణకోవిదులుగా మానవులందురు మనవలయునని, ధర్మనిరతులుగా జీవనం సాగించమనే భగవంతుని అవతారమునకు అర్థము.

లోకములో ధర్మములోపించి అధర్మము పెచ్చుపెరిగిన భగవంతుడు సహించడు అట్టితరి నిర్గుణ నిరాకారస్వరూపుడైన భగవానుడు దేహధారియై లోకమునకే తెంచి ధర్మసముద్ధరణ అధర్మనాశనముగావించుచున్నాడు.

కావున మానవ జన్మవుద్ధారకమునకు ధర్మము మూలాధారమైనది. అట్టిధర్మమును విడనాడిన మానవుడు సర్వనాశనము నొందును. "ధర్మో రక్షితి రక్షితః, అని గదా శాస్త్రము. ఎవడు ధరాన్ని కాపాడుకొనునో వానిని ధర్మం రక్షిస్తుంది.

సీ॥ ధర్మకామార్థకామ సంతతి సేవయుండె నె
ప్పుడును ప్రమాదంబునొందరాదు.
ధర్మంబులేని యర్థంబుగాని కామంబు
గానికాదు విముక్తి కారణంబు

ధర్మసాధనమైన తనవును రక్షించు
కొననగునే విధంబుగనైన
దేహంబులేకున్న దేవదేవుండైన
వాసుదేవుని జెందవశము గాదు.

తే॥ ధర్మమన్నను హరియున్న తత్త్వమొక్కటే
ధర్మశూన్యుండు హరిని జెందంగలేదు
గాన ధర్మంబుసేవించు మానవుండే
శ్రీపతి పదాంబుజాత సంసేవకుండు

కావున ధర్మనిరతియందునెన్నడు ప్రమాదం జెందరాదు. ధర్మసాధన నిమిత్తమయ్యే ఈతనువు ధరింపబడినది. ధర్మమన్నాదైవమన్నో రెండు ఒకటే. ధర్మాన్ని రక్షించుకొన్నవాడు దైవకృపకు పాత్రుడై ధన్యుడగుచున్నాడు.

క॥ ధర్మంబె ప్రాణ బంధువు
ధర్మమె ఐశ్వర్యకరము ధర్మమెసుఖమున్
ధర్మమె ముక్తికి మార్గము
ధర్మమునకు సాటిలేదు ధరనొక్కటియున్.

లోకములో గల బంధుగులు బంధుగులుగాదు. నిజమైన బంధువు తనచే నాచరించబడిన ధర్మమే ఇహ పరలోకములందు సహకరించు ప్రాణబంధువు. కీర్తికిగాని ఐశ్వార్యానికి గాని ధర్మమేమూలము. ఇట్టి పవిత్రమైన ధర్మమునకు సమానమైనది. భూలోకములోనేదియు సాటిరాదు. ఇట్టి ధర్మాచరణ ప్రభవమునగదా ధర్మరాజు స్థూలదేహంతోనే స్వర్గమును జేరగలిగాడు. శిభిచక్రవర్తి కీర్తికామకుడయ్యాడు.

క॥ ధర్మము సత్యము కీర్తియు
నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమఘన, స
త్కర్మ మహింసా వ్రతమును
నర్మిలిగలవారెపుణ్యులవనీ నాథా

సత్యము, కీర్తియు, దయ, సత్కర్మ, గ్రహింప, భగవద్భక్తి యివన్నియు ధర్మమునకు పర్యాయపదములే. ఇవన్ని గల్గినవాడు ఈ లోకమున నిజముగా ఋణాత్ముడేయగును. ఇట్టి పుణ్యాత్ముల రక్షించుటకు దుష్టులను పరిమార్చుటకు భగవంతుడు అవతరిస్తానంటున్నాడు.

"పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగే యుగే"

సాధుసత్పురుషుల రక్షణ కొరకు, దుష్టుల శిక్షించుటకు, ధర్మసంస్థాపకునై అపుడుపుడు భగవంతుడవతరిస్తాడు.

సాధువులంటే వేషధారులుగాదు, లోకంలో నేడు చాలమటుకు వస్త్రాలు కాషాయం, హృదయము మాత్రము కషాయం. ఇట్టివారు సాధవులుగారు. సర్వము హరిమతాంగా భావించి ప్రతి ప్రాణిలో భగవంతుని జూచెవారు సాధవులు. అపకారికి సైతము అంబరీషునిలాగా వుపకారం చేసేవారే సాధువులు. ప్రాణాలు అయినాత్యజించి ధర్మం కాపాడుకొనువారు. సాధువులు. అదిగో అట్టివారిని గురించి భగవానుడు అవతరిస్తాడు. కౌరవాది అధర్మపరులు, రావణ కుంభకర్ణ, హిరణ్యాక్ష, హిరణ్యకసిపుణిలాంటి రాక్షసులు ప్రబలినపుడు అట్టి దుష్టశిక్షణ సాధు రక్షణ గురించి భగవంతుడు అవతరిస్తాడు.

వేదం "అహింసావరమోధర్మః, అనిచెప్పుతూ వుంటే కృష్ణుడు అర్జునుని బలవంతంగా హింసకు ప్రేరేపించుటవలన ఆయన హింసావాదని కొందరి అభిప్రాయము. కాని ఆయన పతితపావనుడే గాని పతిత ఘాతకుడుగాదు. హింసా అహింసల తత్త్వము భావముపై ఆధారపడియుండును గాని, కర్మపై ఆధారపడిలేదు. ఒక డాక్టరు తన వద్దకు వచ్చిన పేషెంటును చెయ్యిగాని కాలుగాని సెప్టిక్ అయిందనిన రోగికి నచ్చ చెప్పి ఆయంగమును ఆపరేషన్ చేసి తీసివేస్థాడు. అదే పని ఒక దొంగా చేస్తాడు అయితే చూడటానికి రెండు సమానమైన కర్మే అయినా! భావంలో చాల తేడా వుంది. డాక్టరు చేసింది అహింస అయింది దొంగ చేసింది హింస అయింది.

అలాగే ! భగవానుడు రామకృష్ణ అవతారములలో కొందరిని సంహరించాడు ఈ సంహారము వారి వుద్ధారకము గురించే వారు చేసిన పాపాలకుని నిష్కృతి కోటి కోటిజన్మలకైనా గలుగదు భగవంతుని సంహారంతో సర్వపాపాలు స్వర్వ ప్రభావంతో వైదొలగి ముక్తి గల్గుతుంది. ఒక పిల్లవాడు కత్తిని చేతనుంచుకొన్నపుడు తండ్రి పిల్లవానికడ ప్రమాదం అనిపించి పిల్లవానికి ప్రమాదమైతుంది. అలాగే భగవానుడు పాపసాధనమైన దుష్టల శరీరముల దొలగించి వారిని ఉద్ధరిస్తాడు.

భగవంతుని ఈ పవిత్రప్రేమ హృదయము అపవిత్ర హృదయులకు అర్థముగాదు, భగవంతుని లీలాజన్మలను, సామాన్య మానవుల జన్మలవలె భావించి భగవదనుగ్రహమునకు దూరలై సంసారకూపమున మునిగిపోతారు.

అర్జునా! దివ్యములగు నాజన్మకర్మలను వాస్తవముగానెరింగినవాడు. ఈ దేహమును వదలిన మీదట తిరిగి జన్మకురాడు. అతడునన్నే పొందును.

ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామంగా కర్మలు చేయుటవలన సాధనకు చిత్తము శుద్ధమవుతుంది. శుద్ధమైన చిత్తములో ఆత్మానుభూతిగలుగుతుంది. తద్వారా సర్వము భగవన్మయంగా చూడగల్గేజ్ఞానం గల్గుతుంది. "సమంర్వేషుభూతేషుతిష్ఠం తం పరమేశ్వరం"

అన్న అపరోక్షానుభూతిగల్గుతుంది. అట్టివాని దృష్టి సమస్థితి నొందినదిగాన సర్వము భగవంతుని విభూతిగానే దర్శిస్తాడు. అట్టి సమదృష్టి గల్గిన మహాత్ముని యందు రాగముగాని ద్వేషముగాని, భయంగాని వుండవు. జ్ఞానమనే తపస్సుతో వారి హృదయం పునీతమవుతుంది. వారిది బంగారు దృష్టిగాని అభరదృష్టిగాదు. ఇట్టి మహాత్మునికి తనకంటే అన్యం ఏది కనుపించదు. "హరిమయము విశ్వమంతయు హరి విశ్వముయుండు" సర్వంభగవంతుడే, ఈనామరూప జగత్తుగా, కన్పిస్తున్నాడని ఆ మహాత్ముని అకుంఠితమైన విశ్వాసం, చీమ మొదలు బ్రహ్మపర్యంతం అంతా బ్రహ్మమే.

"మమాత్మా సర్వభూతాత్మా" అన్నట్లు తన ఆత్మే అన్ని భూతములందు ఉన్నట్లు భావిస్తాడు. ఏ ప్రాణిని తనకంటే అన్యముగాచూడడు. "సర్వజీవ తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినా మూలవిరాట్ పరమాత్మను తిరస్కరించినట్లే అన్న విశ్వాసం ఆ మహాత్ములది. ఇట్టి వారికి జననమరణాదులు లేవు.

ప్రయాణం చేస్తున్న బాటసారికి గమ్యం చేరేవరకు ప్రయాణం తప్పదు. గమ్యం చేరగానే ప్రయాణం ముగిసిపోతుంది. అలాగే అజ్ఞాన నివృత్తిగల్గె వరకు ఆత్మసాక్షాత్కారంగల్గు వరకు జీవునికి కర్మపరంపరలు జనన మరణాలు తప్పవు. భగవాత్ సాక్షాత్కారంతో "జ్ఞానాగ్ని ధగ్ధకర్మాణి, అన్నట్లు కర్మలు కర్మలవలన గల్గె జనన మరణాదులు మొత్తం తుడుచుకొని పోతాయి.

వేయించిన బీజములు (గింజలు) మళ్ళీ మొలకెత్తనట్లు ఆత్మ సాక్షాత్కారము గల్గిన మహాత్ములు లోకహితంగా కర్మలు ఆచరించిన అవి వారికి బంధహేతువులు కానేరవు. కామ సంకల్పములేని కర్మలు కర్మలుగానేరవు. కామ ప్రవృత్తి కర్మలే లోకమున బంధహేతువులయితాయి "యస్యసర్వేసమారంభాః కామసంకల్పవర్జితాః" ఎవని కార్యారంభములందు కామ సంకల్పములుండవో అట్టివానిచే చేయబడు కర్మలు చేసిననూ చేయనిదానితోనే సమానము.

కర్మబంధంగాదు భావమే బంధానికి కారణం. ఇందుకు రామకృష్ణ గురుదేవుడు తనబోధామృతమను గ్రంథమున చక్కటి వుపమానమొనర్చిరి. అది ఇచట వుదహరించుట ఎంతయో సమంజసముకాగలదు.

మిట్టమధ్యహ్నం ఒక బాటసారి ప్రయాణమైపోతున్నాడు అదే వేసవికాలం, గాన బాటసారికి పైన తలక్రింద కాళ్ళు మండిపోతున్నాయి. కడుపోలో ఆకలి బాధబాధిస్తూ వుంది. ఈలోపుగా అల్లంత దూరాన ఒకమంచి చెట్టు కాన్పించినది. బాటసారి వడివడిగా వెళ్ళి ఆ చెట్టుక్రిందకు చేరాడు, ఎండాకాలం ఆ చెట్టుక్రింద నీడచల్లగా వుంది. వెండి వేడిమికి గల్గిన బాటసారి శరీర తాపమంతా చల్లారింది. కాని ఆకలి దప్పులు లోపల పీడిస్తున్నాయి.

బాటసారి అనుకొన్నాడు. అబ్బా భగవంతుడా ఎంతబాగుంది చల్లగా! కాని దాహం అవుతూవుంది. కాస్త దాహశాంతికి నీరున్న ఎంత బాగుండు అనుకొన్నాడు. వాడువున్నచెట్టు సామాన్యమైన చెట్టుగాదు అది కల్పవృక్షం. గానవాడు సంకల్పించినదే తడవు వెంటనే మంచి బంగారు కూజాలో చల్లటి పానీయం తయార్. బాటసారి ఆనందమునకు మేరలేదు. ఆ నీరు కడుపునిండా త్రాగాడు. కాసేపు అటుయిటు చూసుకుంటూ వుండగానే లోపల ఆకలి బాధబాధింప సాగినది. ఆకలికి కాస్త అన్నంవుంటే ఎంత బాగుండునో అనుకున్నాడు. వెంటనే పంచభక్ష పరమాన్నం సిద్ధమైంది. బాటసారికి ఈసారి ఆశ్చర్యమేసినది. ఆకలిలోవున్న వ్యక్తిగాన ముందు ఆకలిదీర్చుకోవాలనుకొన్నాడు. హాయిగా ముందున్న అన్నంత తృప్తిగా భోంచేశాడు.

సామాన్యంగా తృప్తిగా భోజనం చేసిన వ్యక్తి కంటినిండా నిద్దుర వస్తుంది. బాటసారి నిద్రబోవాలనుకొన్నాడు. పడుకోవటానికి ఏదైనా మెత్త (పక్క) వున్న బాగుండు అనుకొన్నాడు వెంటనే హంసతూలికా తల్పం స్ప్రింగ్ మంచం తయార్, బాటసారి ఆనందంతో వెళ్ళిన ఆ మంచంపై కూచున్నాడు కూచున్నవాడు పడుకొన్నవాడు పడుకొన్నవాడు. పడుకొన్నవాడు పడుకోకుండ ఇంటి దగ్గర గల తన భార్య ఇక్కడికి వచ్చిన ఎంతబాగుండు అనుకొన్నాడు. అనుకొన్నదే తడవుగా ఆ కల్పవృక్ష ప్రభావంతో ఇంటి దగ్గర వున్న భార్య తన ప్రక్కన కబడినది. ఇది గాంచిన బాటసారి అయోమయంలో పడ్డాడు. ఇంటి దగ్గర వున్న నా భార్య ఇక్కడికెలా వచ్చినది. ఇది భూతమేమో అనుకొన్నాడు. తథాస్తు అదిభూతమే అయినది. అబ్బో నన్నుమ్రింగునేమో అనుకొన్నాడు అది మ్రింగనే మ్రింగినది.

చూచారా బాటసారి కల్పవృక్షము క్రిందవుండి కూడా తన సంకల్ప ప్రభావంతో మృత్యుముఖమున బడిపోయాడు. ఇది కల్ప వృక్షయొక్క దోషముగాదు. బాటసారి భావదోషమే మృత్యువును తెచ్చిపెట్టినది.

కాన కర్మకూడ కల్పవృక్షంలాంటిదే. నీవే భావంతో కర్మచేస్తావో అ భావమే సంస్కారరూపముతో మానవునికి ఫలభుక్తమైతుంది. కావున కర్మ సకామంగా గాక నిష్కామంగా భగవదర్పిత బుద్ధితో చేసిన దగ్ధ బీజంవలె కర్తను ముట్టజాలదు. ఈ యుక్తి గుర్తెరెంగే ముందు మహాత్ములు ఎందరో కర్మబంధం నుండి విడిబడి భగవదను గ్రహమునకు పాత్రులైతరించిరి.

అర్జునా! అదిగో ఆ పూర్వులవలె నీవు నిష్కామివై కర్మమాచరించు. అట్లు చేసితివేని కర్మ చేసినను చేయని వానివేయగుదువు.

నిరాశాపరుడై మనసుని ఇంద్రియములు స్వాధీనము నందుంచుకొని కేవలం జీవయాత్రగురించి తగిన కర్మలు చేసియు కర్మబంధమున బడనేరదు.

పలురకాలగా ఉన్నయి యజ్ఞకర్మకంటే జ్ఞానయజ్ఞయే శ్రేయస్సును గల్గించును. అట్టిజ్ఞానము తత్త్వవిధులు అయిన మహాత్ముల నుండే పొందవలసి యుండును. గాని పాండిత్యంతో పొందబడేదిగాదు, "అచార్యవాన్ పురుషో వేదః" ఆవేద స్వరూపమైన జ్ఞానమును ఆచార్యునినుండే పొందవలెను. మిగిలిన యజ్ఞములన్నియు ఎంతో వ్యయప్రయాసలకోర్చి నిర్వహించ వలసియుండును. అట్టి యజ్ఞములు చాల ప్రయాసకరమైనవి. అయితే ఈ జ్ఞానయజ్ఞము అట్టిది గాదు ఇది సులభమైనట్టిది.

**"తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా,**
**ఉపదేక్ష్యంతి తేజ్ఞానం, జ్ఞానినోతత్త్వదర్శినః"**

ఉత్తమోత్తములులైన మహానుభావులనాశ్రయించి వారికి వినయ విధేయతలతో సేవసల్పి సమయ సందర్భముల గమనించి వారిని వినయముతో ప్రశ్నించిన వారు నీకు ఈ జ్ఞానమును బోధింతురు.

"తత్త్వదర్శినః" అనుటచేతత్త్వవచనులుగాదనియు తత్త్వమును చక్కగా దర్శించిన అపరోక్షానుభూతి గల్గిన మహాత్ములని తెలియవలెను. ఈనాటి కాలంలో తత్త్వవచనులు (వాచావేదాంతులు) కోకొల్లరుగలరు. అట్టివారీ జ్ఞానమునుపదేశించజాలరు. జ్ఞానం రెండురకములు. ఒకటి పరోక్ష జ్ఞానం, రెండవది అపరోక్షజ్ఞానం, పరోక్షజ్ఞానమనగా గ్రంథపఠనద్వారా పొందబడినది. అపరోక్షజ్ఞానమగా, శాస్త్రములద్వారా పెద్దలద్వారా తెలుసుకొన్న దానిని, మనన నిధి, ధ్యానములద్వారా, స్వరూపసాక్షాత్కారం బొందినవారు. ఇట్టివారే తత్త్వ దర్శికాలు అయిన మహాభాగ్యులు. అట్టివారిసన్నిధికి వెళ్ళి "ప్రణిపాతేన" బాగా భూమికి సాగిలపడి అష్టాంగముల మోపినమస్కరించవలెను. అందువలన దేహభిమానమునశించును. ఈ దేహాభిమానమే ఆత్మజ్ఞానమునకు పెద్ద అడ్డుగోడ, మహాత్ములుగాని గురువులుగాని, మనయందున్న నిరహకృతిని, నిర్మలమనో నిశ్చలత, వినయ వినమ్రతగల గమనించేయే ఉపదేశింతురు.

లోకమున గురువులు రెండురకములుగా నుందురు. మొదటివారు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠగల్గి తన్నాశ్రయించిన ముముక్షువులకు సంశయనివృత్తిని జేసి శ్రుతియుక్తి అనుభవముగానుపదేశించి, అజ్ఞానమును పారద్రోలి జ్ఞానమును గల్గింతురు.

రెండువతరగతికి జెందినవారు కేవలము శాస్త్ర పాండిత్యముగల్గి శిష్యుల విత్తాపహరులై లోకమున సంచరించుచుందురు గావున మముక్షువులు జాగ్రత్తగా యోచించి, గురువుల నెన్నుకొనవలయును. గుడ్డెరిగి గురువును చేరువడపోసి, నీరుద్రావు, అని పెద్దలనానుడి ముందు వెనుకనాలోచింపక ఆత్రపడి శుష్కవేదాంతులైన గురువుల జేరి తరువాత విచారించి లాభములేదు.

ఇం సంబంధమైన స్త్రీకాంక్ష వదలి రామకృష్ణ గురుదేవునివలె కామినీ వాంచనలగాలదన్ని, ముక్తి కాంత సమాగమము పొందిన మహనీయులు చాల అరుదు. లక్షమందికొకరైన ఉందురోలేదు. అట్టి మహనీయుడే సద్గురువు అట్టివారిని వెతకి అడిగి తెలుసుకొనవలెను. అటుగాక

కైవారం యోగనారాయణ యతీంద్రులు చెప్పినట్లు వంకాయ తోటలో టెంకాయలు అడిగినట్లు, అనుభవజ్ఞానంలేని వారినడగిన బ్రహ్మాజ్ఞానం గల్గునా కలుగనేరదు, అందుకు తగిన ఆచార్యులు వెతికి వారికి సేవలోనర్చి బ్రహ్మవిద్య నార్జించవలయును.

క॥ తనలో సర్వంబుండగ
తనలోపల వెతకలేక వెలిలో వెతికే
తనువుల మోసెడి యెద్దుల
మనమే మనగవలయు మహిలో వేమా

అని వేమనగారి మాట. ఆత్మానాత్మలతరచి ఆత్మస్వరూపమును గుర్తెరిగి, అంతర్ముఖవృత్తితో గల్గిన మహాత్ములెక్కడ, కేవలం కుంక్షిరులై ఘటశోధన పరిజ్ఞానము లేక కొన్ని వేదాంత యుక్తులు గల్గి, చిలుక పలుకులు పల్కు, వాచావేదాంతు లెక్కడ, అట్టి వారికి బహిర్వృత్తి తప్ప అంతర్ముఖవృత్తి ఎక్కడిది, ఇట్టి వారిదే హమనే బరువును మోసే యెద్దులాంటివారు అని వేమన గారి అభిప్రాయము.

గీ॥ గురువులంచును, బెక్కండ్రు, తిరిగి ధాత్రి
శిష్య విత్తాపహారులై చరించుచుండ్రు
శిష్యులకు జన్మసంప్రాప్త చేష్టలుడిపి
ముక్తి బొందించు గురువులు ముదితయరుదు.

శిష్యుల జన్మ సంప్రాప్తమగు సంసారమును, పారద్రోలు బ్రహ్మ విద్యనునొసంగు మహాత్ములు లోకమున చాలా అరుదుగానుందురు. జిహ్వాగుహ్యేంద్రియల పంటలు గురువులనిలోకమున చరించి శిష్యుల అపమార్గమున నడిపించు వారె యెక్కువగునున్నారు.

తే॥ అంతరంగమెరుగ హరుడౌను గురుడౌను
అంతరంగమెరుగనార్యుడగను.
అంతరంగమెరుగనతడెపోశివయోగి
విశ్వదాభిరామవినురవేమ.

అంతరాత్మను గుర్తెరిగినవారే గురువనుటకు అర్హులు, అట్టివారే సంసార సముద్రమున పరిభ్రమించుమానవకోటికి తగిన తరుణోపాయం గావించు ఆచార్యులు,

అట్టి మహాత్ములు, దర్శనస్పర్శ సంభాషణములు మానవులకు పాపపరిహారముగావించి పుణ్యమునొనగూర్చును.

కైవారం యోగి నారాయణగారి మాట, గ్రుడ్డిగానెవరినంటే, వారిని గురువని దరిచేరరాదు అందుకు తగిన యోగ్యతా యోగ్యతులు గలవా? లేవా? అని భాగా గమనించి రామకృష్ణ గురుదేవుని స్వామి వివేకానంద పరీక్షించి దగ్గరకు చేరి విశ్వసించినట్లు గురువులను చేరవలెను కేవలం వేష భాషలు చూసి మోసపోరాదు. నేడు లోకములో మేమే పీఠాధిపతులమని చెప్పుకొనే బడా బడా స్వాములె ధర్మదూరలై స్వార్థపూరితులై గృహస్థులకంటే ఎక్కువ తాపత్రయముల జిక్కిన వారెందరో గలరు.

శా॥ ధర్మమధర్మమంచు బహు
ధా ప్రవచింతురుకొందరుర్విపై. ఆ
ధర్మము సుంతయేని తమ
దాపున నుండదు చిత్రమేయో ఈ
మర్మమెరుంగ జాలనియా
మాయక మానవలోకమెల్ల. దు
ష్కర్మముచేనగాధమగు
గర్తమునన్ బడిపోదురక్కటా.

గురువులను పేరుతో బోధలు చేస్తూ ధర్మమనునది ఏ కొద్దిపాటు గూడా లేక ఆత్మ అచలం అమనుష్కమని అట్టి ఆత్మకు జీవుడు చేయు పాపములంటవని కుత్రిమ బోధగావించి భ్రష్టాచారాన్ని ప్రబలజేసే వారు చాలామంది గలరు. తినుట, త్రాగుట ఆలాంటి నింధ్యమైనపనులు చేస్తూ, చేయిస్తూ ధర్మదూరలై ప్రవర్తించే వారిని దరిచేరరాదు. నిజమైన ధర్మపరులు "అహింసా పరమోధర్మః" అన్న శ్రుతి వాక్యమును హృదయమున నిల్పుకొని సర్వప్రాణి కోటికి శాంతి కలిగింప ప్రయత్నిస్తూ వాదప్రతి వాదాలకు కాలాన్ని వ్యర్థం చేయక కేవలం అధికారులైన శిష్యులకు నిశ్చయాత్మకమైన జ్ఞానమును బోధించి ధన్యులను చేయుచుందురు.

సీ॥ ఆచార క్రియ విడచి అవధూత అనవచ్చు
ఆత్మపూజాన్వయము తెలుయుటరుదు
సర్వంబు రోసిన సన్యాసిననవచ్చు
సకలదుర్వ్యసనముల్ చంపుటరుదు
ఎల్ల ప్రజల చూడయోగి తాననవచ్చు
ఏ కాంతపురి బాట ఎరుగుటరదు

గురుతైన శిష్యునకు గురుడునేవచ్చు
పెట్టుకు తిట్లకు ఓర్చుటరుదు

గీ॥ వేషధారికి గల్గు వెతలు నిండ
పుట్టి గిట్టేది తప్పదు పుడమిలోన
భక్తమందార బ్రహ్మాండపుర నివాస
జయతుజగదీశ అమరనారేయణే

అవధూతలమనియమ ధాతలాగా తిరిగేవారు, సర్వంసన్యసించిన సన్యాసులని, లోపల దుర్వ్యసనములు గల్గియుండేవారు యోగులమని తిరుగుతూ భవరోగులై యుండేవారు వేషధారులే. అంత యెుక్కువగా అమాయక ప్రజల మోసగించి వారి వ్యసనములదీర్చుకొను వారె ఎక్కువ కలికాలంలోనున్నారు. కడతేర్చు గురుడు కనబడటం చాల అరుదు. అట్టి మహాత్ముల వెతికి సేవించవలెను. శ్రీ వివేకానందుకు శ్రీరామకృష్ణ గురుదేవునిలాగా, శిద్ధయ్యకు బ్రహ్మములాగా అర్జుననికి శ్రీ కృష్ణునిలాగా, పరీక్షిత్తుకు శ్రీశుకయోగిలాగా వుత్తమ గురువులు దొరకటం శిష్యుల మహద్భాగ్యము.

"దుర్లభంత్రయమే వైతద్దైవాను గ్రహహేతుకం,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః"

మనుష్యత్వము కల్గుట, ముముక్షత్వము గల్గుట, మహాత్ముల చెంత చేరుట ఈ మూడు మానవులకు భగవదనుగ్రహముతో సిద్ధిస్తాయి. అట్టి భగవదను గ్రహము కల్గినవారు తప్పక ధన్యజీవులు అట్టివారు మహాత్ముల అనుగ్రహముతో ఈ జన్మయందే కడతేరగలరు.

"గురువనగా" "గు" శబ్దస్యంధకారస్యాత్ "రు" శబ్దస్తన్నిరోధకః అంధకార నిరోధిత్వత గురారిత్రభిధీయతే "గు" అనగా అంధకారము అజ్ఞానచిహ్నము "రు" అనగా నిరోధించుట కావున గురువు అనగా శిష్యుని యొక్క అజ్ఞానమును నివర్ధింపజేసి జ్ఞానక్రాంతిని ప్రసరింపజేయువాడు అని అర్థము.

కావున గురువనగా శిష్యునియొక్క అజ్ఞానాంధకారమును సమూలముగా నశింపచేసి ఆత్మజ్ఞానమును అయమాత్మాబ్రహ్మ అహం బ్రహ్మాస్మి, అన్న మహా వాక్యముల భావమును స్వానుభవపూర్వకముగా గల్గించువారె గురువలన జెల్లుదురు. ఇట్టి మహాత్ముల నాశ్రయించే, ఆ పవిత్రమైన జ్ఞానమును పొందవలసియుండును.

"జ్ఞానదేవతుకైవల్యం" అట్టి పవిత్రజ్ఞానము గల్గిన మళ్ళీ ఈ త్రిగుణాత్మికమైన మాయయందు తగుల్గొనక నిత్యనిరతిశయపరబ్రహ్మామును పొంది సుఖించుచున్నాడు. ఇట్టి జ్ఞానమునకు శ్రద్ధ అత్యావశ్యకమైయున్నది.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరసమ్యతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతి అచిరేణాధి గచ్ఛతి.

శ్రద్ధావంతుడును తత్పరుడును జితేంద్రియుడును నగువానికి జ్ఞానము లభించును. జ్ఞానం కల్గినవెంటనేముక్తిని పొందుచున్నాడు.

శ్రద్ధ అన్ని గుణాలకు కుదురు శ్రద్ధలేకుంటే ఏది సాధించలేదు. శ్రద్ధవల్లనే జ్ఞానం లభ్యమైతుంది. ఆ శ్రద్ధ అన్ని సుగుణాలకు యేరువురుగులాంటిది. అశ్రద్ధాపరుడు ఏది సాధించజాలడు. శ్రద్ధాపరుడు దేవతలను సైతం తన సన్నిధికి రప్పించుకొంటాడు. అశ్రద్ధా పరుడు సంసారసాగరములో మునిగిపోతాడు. శ్రద్ధ పాత్రవంటిది. మిగిలిన సుగుణాలు పదార్థములవంటివి. శ్రద్ధ అనే పాత్రలేకపోతే పదార్థలనే సుగుణాలు ఏ ఒక్కటి నిలువవు. ముముక్షువులు అయినవారికి పరమార్థంగమున చాలా ప్రధానమైనది శ్రద్ధ. ఇది ఎంతెంతవుండునో సిద్ధి అంతంత దగ్గరగా ఉంటుంది.

శ్రద్ధ అనగా శాస్త్ర వాక్యమునందు, గురువాక్యమునందు, తన ఆత్మయందు గల విశ్వాసమే శ్రద్ధయనబడును. శ్రద్ధతోచేసిన ఏ కార్యమైన పవిత్రంగాను శుద్ధంగాను వుంటుంది. అశ్రద్ధతోచేసినది అన్నింటికి చెడికూర్చుంటుంది. కాన శ్రద్ధజ్ఞానార్జనకు చాలముఖ్యమైనది.

"సంశయాత్మావినశ్యతి" సంశయంగలవాడు వినాశనం పొందితీరుతాడు. నీ హృదయంలో ఆటంబాంబునైనా వుంచుకోగాని అవిశ్వాసాన్ని వుంచుకోవద్దని రామతీర్థులమాట. అవిశ్వాసపరుడుదేన్ని నమ్మడు. రైల్వే బుకింగ్ దగ్గరకుపోయినా ముందు టికెట్టు తరువాత డబ్బు అనేరకం ఇట్టి వానికి ఇహంలేదు పరంలేదు.

అశ్రద్ధ సోమరితనానికి బీజం, సోమరి హృదయం దయ్యాలకు నిలయము. సోమరికి ఇచ్చుటగాని మరెచ్చుటగాని చోటులేదని శ్రీ మళయాల స్వాములవారు చెప్పేవారు.

ఒకచోట్ల ఇద్దరు మిత్రులు నేరడుచెట్టు క్రిందపండుకొని ఉన్నారు. అటుగా ఒక బాటసారి పోతూవున్నాడు. ఆయన్ను వీళ్ళు ఇద్దరు కేకలు వేస్తూ పిలిచారు. బాటసారి వీరి కేకలు విని ఏదో పాపం ఆపదలో ఉన్నారు కదా అని తలంచి దగ్గరకు వచ్చి విచారించారు. ఏమిలేదు బాబూ ఇదిగో నాపొట్టపైన నేరేడు పండు పడివుంది కాస్తదాన్ని తీసినా నోట్లో వేసిపోతావా అన్నాడు. బాటసారికి అరికాలి మంట నెత్తికెక్కింది. ప్రక్కనే ఉన్న ఒకచెట్టుకు మంచి బుర్రను ఒకటి విరుచుకొన్నాడు. ఫెళీమని రెండు వాయించాడు. నా అరచేతిలో పడిన నేరేడు పండు నోట్లో వేయమంటే వేయలేదు. సోమరిపోతు అన్నాడు. బాటసారి వెనుతిరిగి వీరి ఇద్దరు మహాసోమరిపోతులేనని వానికి రెండు వడ్డించాడు. ఇద్దరు వీపు దులువుకుంటూ కాలికి బుద్ధిచెప్పినారు.

అలాగే సోమరికి అన్నీ అనర్థాలే శ్రద్ధావంతుల్ని చూస్తే అందరికి అనందమే సంతోషం వారడక్కపోయినా వారి కృషికి సహకరించాలనే సద్బుద్ధిపుడుతుంది.

శ్రద్ధావంతుడు భూలోకాన్ని స్వర్గంగా మార్చుకొంటాడు. శ్రద్ధావంతుని సంకల్పం వజ్రసంకల్పం. వాని సంకల్పానికి తిరుగులేదు. అనుకొన్నది సాధించేవరకు నిద్రపోడు. శ్రద్ధాలక్ష్మి ఎక్కడ వుంటుందో విజయలక్ష్మి అక్కడే వుంటుంది.

**"ఉత్సాహం సాహసం ధైర్యం, బుద్ధిః శక్తి పరాక్రమః"**

**షడేతేయత్రతిష్ఠన్తి, తత్రదేవో పితిష్ఠతి.**

ఎక్కడ ఉత్సాహం, అనుకొన్న పని నెరవేర్చవలెనను వుబలాట. సాహసము, అనుకొన్న వనిపూర్తి అయ్యేవరకు ఎన్ని అవాంతరాలు వచ్చిన విడువక ధైర్యముతో పవిత్రబుద్ధిగల్గి కార్యసాధనా శక్తి ధైర్యం ఎచటవుండునో అక్కడ భగవంతుడువుంటాడని శ్రుతి కావున శ్రద్ధావంతునికి ఈ ఆరు గుణాలువుంటాయి. అందుచే పరమాత్మకూడ తోడైవుంటాడు.

శ్రద్ధావంతుడు దుర్గుణాలను కూడ సుగుణాలుగా వాని మతి ప్రభావంతో మార్చుకుంటాడు.

సీ॥ కామంబు శ్రీ మోక్షకాంతపైనగుగాక
క్రోధంబు పాతక గుణమునందు
ధరలో భగుణముత్వచ్చరణ యుగ్మమునందు
మూర్తి ధ్యానమున సమ్మోహగుణము
మదము సంప్రజ్ఞచే మైమరుపునగల్గు
గాక నిశ్చితముగా గ్రోలుచుంద్రి
మాత్సర్య గుణముపై మచ్చరమగు గాక
ఉష్ణముష్ణమ్మునసుడిగినట్లు

గీ॥ శత్రుషట్కకృతంబులు మిత్రమగుచు
సంభవించెను నీయందు సత్వరముగ
విడవగాలేము కామాది విసరములను
రమణ గుణ సాంద్ర రఘుకుల రామచంద్ర.

అంటూ ఒక మహాభక్తుడు కామాది వైరషట్కాన్ని కూడా పరమ పదమార్గములో మిత్రవర్గములాగా మార్చుకున్నారు. మానవునికి శ్రద్ధ ఒకటి ఉండాలికాని సాధించవలసినదేదియు లేదు. విశ్వామిత్రుడు శ్రద్ధావంతుడుగాననే సృష్టికి

ప్రతిసృష్టిచేయగలిగాడు. ధృవబాలుడు శ్రద్ధవల్లనే ఆరుమాసాలలో ధృవపదాన్ని పొందగలిగాడు. బాల ప్రహ్లోదుడు శ్రద్ధా ప్రభావము వల్లనే సర్వవ్యాపి అయిన పరమాత్మను స్థంభము నుండి వెలికి రప్పించాడు. శ్రద్ధావతి అయిన సావిత్రి మృతుండైన తనపతిని సజీవునికి చేసుకొన్నది.

కావున అర్జునా ! శ్రద్ధావంతుడవై సంయమనే దాన్నిజ్ఞాన ఖడ్గంచే ఛేధించి కర్మయోగమునకు గడుగుము. కర్మవదలి యూరక కూర్చుంటే ఏమివస్తుంది. నిద్రవస్తుంది. ప్రయత్నశీలుడవు కమ్ము సంశయమును పోనాడి శ్రద్ధావంతుడవై, సంగరహితుడవై, కర్మను యోగంగా మార్చుకొని, కర్మయోగివై యుద్ధరంగమున విహరింపుము.



# కర్మ సన్యాసయోగము

# ఐదవ అధ్యాయము

శుద్ధబుద్ధి గల్గిన సుజనులారా! వినండి గీత ఐదవ అధ్యాయం కర్మ సన్యాసయోగము ఎవరినొసటిగీత చక్కగా ఉండునో వారికే ఈ గీతపై సద్బుద్ధి కలుగుతుంది. గీతపరమాత్మ సన్నిధికి చక్కటి బాట. గీతాభక్తుడు సంసారమున ఉండిన తామర అకు నీటిని అంటనట్లు సంసారమున అంటక చరిస్తాడు.

**"యత్రగీతా విచారశ్చ పఠనం పాఠనం స్మృతం**
**తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామిసదైవహి"**

ఎచట గీతా శ్రవణంగాని, పఠనం గాని, గీతా విచారంగాని జరుగు చుండునో అచట శ్రీకృష్ణపరమాత్మ ఉండును. అట్టి ఇల్లు ఇల్లు కాదు శ్రీ కృష్ణమందిరముతో సమానము అనిగీత యొక్క గొప్పతనమును గురించి గీతా మహత్యమునందు తెల్పబడియున్నది. ఇట్టి పవిత్ర గీతాగ్రంధము నందు విశ్వాసం గల్గుట ఎంతయోపురార్జిత పుణ్యఫలము కారణమై ఉండవలెను.

ఈ రోజు ఐదవ అధ్యాయము గురించి విచారించుకోవలసియున్నది. ఈ అధ్యాయము పేరు కర్మసన్యాసయోగము. కర్మసన్యాసమనగా చాలామంది వ్యాఖ్యాన కర్తలు కర్మల సుతరాం విసర్జించుటయని వ్యాఖ్యానించిరి. కాన శ్రీకృష్ణ పరమాత్మదృష్టిలో కర్మల విసర్జించుట కర్మ సన్యాసం కాదనియు కర్మయందలి ఫలాభిలాషను వదలుటయే కర్మసన్యాసమని కచ్చితముగా తెల్పి అకర్మణ్యత్వమును దునుమాని నిష్కామియై, కర్మలనాచరించులాగును అర్జునుని నెపముగానెంచి లోకము నంతటికినుద్భోదించిరి

లేకున్నయుద్ధరంగమున కర్తవ్యవిమూఢుడై అస్త్రసన్యాసం చేసిన అర్జునుని యుద్ధము మానుటయే శ్రేష్ఠము అని దెల్పియుండెడి వాడు, కాని అట్లు తెల్పలేదు "స్వధర్మేనిధనం శ్రేయః అని స్వధర్మానుష్ఠానము జీవులకు శ్రేయోదాయకమని దెల్పి కర్మయొక్క కౌశలమును గురించి గీతయందు బాగుగా దెల్పియున్నారు. మోక్షమునకు జ్ఞానము కారణమైనప్పటికి అట్టి మోక్షకారణమైన జ్ఞాన కర్మయోగాచరణం కానిదే కలుగనేరదు.

"తమేవం విదిత్వాతి మృత్యుమేతి" అనియు "నాన్యం పంథా అయనాయవిద్యతే" పరమాత్మను తెలుసుకొనిన నేముక్తి లభించును మోక్షసాధనమున ఇంకొక మార్గము లేదనియే విశదీకరింపబడుచున్నది. "జ్ఞానా దేవతు కైవల్యం." జ్ఞానం వలననే మోక్షం లభించుననియు "ఈశంజ్ఞాత్వ అమృతాభవంతి" ఈశ్వరుని తెలుసుకొనినా ముక్తిలగుదురనియు "శివం జ్ఞాత్వ శాంతిరుత్యం తమేతి". శివుని తెలుసుకొనినయెడల దుఃఖనివృత్తిగల్గును అనియు "దేవంజ్ఞాత్వాముచ్యతే సర్వపాశైః" పరమేశ్వరుని తెలుసుకొనిన యెడల బంధ విముక్తి నొందును ఇత్యాదిశృతి వాక్యములను బట్టి చూసినా జ్ఞానము వలననే మోక్షము గలుగుచున్నదనియు వేరొక్క మార్గమున అనగా కర్మమార్గమున ముక్తి గలుగనేరదని అర్థమగుచున్నది.

ఇచట జ్ఞానియననెవడు? జ్ఞానసముపార్జనకు మార్గమేది? అట్టిజ్ఞానముచే కర్మనునసింపజేయును పాయమెద్ది అను సంశయముగల్గును, ఇట్టి సంశయనివృత్తికి గీతాసందేశము చక్కటి సమాధానమునిచ్చును.

కామసంకల్పవర్జితములైనటువంటి కార్యములనాచరించి, అనుచిత కర్మలన్నిటిని, తన జ్ఞానాగ్నిచే దగ్ధముచేయువాడే జ్ఞాని. సత్కర్మలనాచరించుచు కర్మ ఫలాసక్తిని వదలి, నిరంతరము భగవంతునియందే మనసునుంచి, నాత్మస్థితి నాశ్రయించువానికి జ్ఞానసముపార్జనము సులభతరమగుచున్నది.

జ్ఞానమే మోక్షప్రదమునుటయందెట్టి సందియమునులేదు కాని జ్ఞానమనగాని, నిష్కామకర్మ సహితజ్ఞానము వలననే బంధ విముకి&త మోక్షము చేకూరుటకు సరియైన మార్గం అని గుర్తించవలెను. భగవానుడు "నియంతకురుకర్మత్వం" శాస్త్ర సమ్మతమైనట్టి కర్మాచరణముచేయమనియే ఆదేశించెను. శాస్త్రనిషిద్ధమైనకర్మ బంధహేతువని సహేతుకంగా చెప్పియున్నాడు. అకర్మునికి చిత్తశుద్ధి గలుగుజాలదు. విహిత కర్మాచరణచేచిత్తం అద్దమువలె శుద్ధిజెందును. శుద్ధమైన చిత్తమే జ్ఞానార్జనకు మూలము. జ్ఞానము మోక్షమునకు కారణము నిష్కామకర్మలతో దుష్కకర్మల త్యణీకరించిననే జ్ఞానము గల్గును. అట్టి జ్ఞానముచేతనే మోక్షము చేకూరగలదు. జ్ఞానాగ్నియందు కర్మలను కాల్చుటయే మోక్షమని, గమనించవలెను. కాబట్టి మోక్షమనగా నిష్కామంగా జేయబడుకర్మసహిత జ్ఞానమేనని తెలియవలెను. కావున దూరదృష్టిచే బాగా విచారించి చూచిన జ్ఞానకర్మలు రెండును మోక్షమునకు అవసరములే యగును. ఇందు ఏ ఒకటి లోపించినను అది పూర్ణమైన ఫలమును అందియ్యజాలదు.

"అపశ్యన్నంధకోదగ్ధః పశ్యన్దహతిపంగులః

అంధపంగువథాన్యోన్య, సాపేక్షే జ్ఞానకర్మణి।

ఒక గ్రుడ్డివాడు ఒక కుంటివాడు ఒక గృహమునందు గలరు. విధి వశమున ఆ గృహమునకు అగ్ని ప్రమాదము వాటిల్లినది. అందున్న గ్రుడ్డివాడు దృష్టి లోపం వల్లను, కుంటివాడు గమనక్రియ లోపించుటవల్లను ఇద్దరు ఆ ఇంటియందు బడినశించిరి. వారిద్దరికి పరస్పర సహకారములుండి నయెడ ఆ ఇద్దరును అందుండి బైటబడి బ్రతికియుండెడివారు.

ఒకవూరిలో కుంటి గ్రుడ్డి ఇద్దరు స్నేహభావం గల్గియుండెడివారు. వారు ఇద్దరు ఏకమనస్కులై పోయెడివారు. గ్రుడ్డి వాని భుజములపై కుంటివాడు కూర్చుని పైనవాడు దారిచూపుచు కుడి ఎడమంగా అడ్డు వచ్చు రాళ్ళరప్పల మిట్టపల్లముల దెల్పుటచే గ్రుడివాడు వాటిని తప్పించుకొనుచు ముందుకుసాగి పోతూ దేశయాత్రచేయుచు పొట్టపోసికొనుచు జీవించుచుండిరి. ఈ యింటియందు గల గ్రుడివానికి, కుంటివానికి పరస్పర సహకార, సానుభూతులు లేక ఇద్దరు అయింటియందు అగ్నికి అహుతియై పోయిరి. అదేవిధముగా, మోక్షమార్గమున పయనించు సాధకునికి జ్ఞానకర్మలు రెండును ఒకదానికొకటి సహకార సానుభవసమరసము లేకున్న పతితుడగును.

కావున కొందరు కర్మ సన్యాసమే మోక్షమని భ్రమించుచున్నారు. కాని ఇది సరియైన అభిప్రాయముగాదని శ్రీకృష్ణపరమాత్మవక్కానించుచున్నాడు. కర్మయోగోవిష్యతే॥ కర్మ సన్యాసంకంటే కర్మయోగము యొక్కువ మేలని భగవంతుని అభిప్రాయము అనగా! భగవద్ భావముతో నిష్కామంగా నాచరించుకర్మ కర్మగాక కర్మయోగంగా మారి పూర్ణఫలంనొసంగగలదు అని భావము.

ఈశ్వరార్పణంగా చేయబడుకర్మ భగవదనుగ్రహ పాత్రునిగా జేయును. అట్టివాని జ్ఞానం అంకురించిముక్తి నొందుచున్నాడు (అందువలన "కర్మాచితోలోకఃక్షీయతే॥ అని శ్రోతులందు కర్మ ఫలములస్థిరములని చెప్పినదంతయు భగవద్భావన లేక సకామంగా చేయబడు కర్మలనుద్దేశించి చెప్పబడినదనియే గ్రహించవలయును. ఇందు మూలకముగా కర్మ మావశ్యకతయే అయిననూ పరవేశ్వర సహితమగు చిత్తముచే నాచరింపబడు కర్మవలననే పరమార్థ సిద్ధికలుగును. సత్యము విశదమగుచున్నది "నకర్మణా" అనియు "కర్మణాబధ్యతే జంతుః" అనుశ్రుతి వాక్యములు, కర్మము జన్మహేతువనియు కర్మలచే మోక్షంగలుగదనియు చెప్పుచున్నవిగదా? అనితలంచరాదు. అవి ఎట్టికర్మలనిన ఈశ్వరార్పణంగానివి, అజ్ఞానముచే చేయబడునవి, ఫలాపేక్షతో చేయబడిన కర్మలు మాత్రమే జన్మహేతువులనియు, మోక్షం గల్గించవలనియు భావించవలయును. మరి ముక్తి హేతువగు కర్మ లెట్టివనిన యచ్చజ్ఞాన సమన్వితం, పలాభిసంధిరహితం, యత్తన్ముక్తికరంమతమ్" ఎట్టి ఫలాపేక్షలేకుండా ఈశర్పార్పితజ్ఞానంతో చేయబడు కర్మముక్తి ప్రదాయకమగుచున్నది.

కాబట్టి కర్మలుమానినంత మాత్రంతో ముక్తి గలుగనేరదు. నరిగదా బుద్ధిపూర్వకంగా కర్మమానుటవలన దోషప్రదమగుచున్నది. గ్రంధపఠనంచేస్తు నిద్రలోకి వెళ్లిన వ్యక్తికి గ్రంధం చేతినుండి దాని వెంటనది జారిపోవునట్లు భగవద్ భావన నిష్ఠాపారవశ్యమున జగమును మరచిన సాధకుని నుండి, కర్మదాని పాటికదే తొలగి పోవుచున్నది. ఇదియే నిజమైన కర్మత్యాగము కర్మసన్యాసమగును. అందువలన మననప్పు భగవద్భావనాధ్యానాభ్యాసవశమున పరమాత్మయందులయించు వరకు కర్మాచరణ విడుచుటనుచితముగాదు.

త్యాగము, జ్ఞాననిష్ఠా, పరిపూర్ణ భక్తి భావములు కుదరనిదే వర్ణాశ్రమా చారధర్మములను కర్మలను వదిలిపెట్టు వాని దుస్థితి ఎట్టిదనిన, పట్టుకొమ్మ చిక్కక మునుపే కాలిక్రింద కొమ్మను వదలినయడల క్రింది కేవిధముగాబడి పోవుచున్నాడో అధే విధముగా అధోగతినిబడి పతితుడగుటతథ్యము.

**"సన్యాసస్తుమహాబాహో, దుఃఖమాప్తుమయోగతః**
**యోగయుక్తోమునిర్బ్రహ్మ, నచిరేణాధిగచ్ఛతి॥ ( గీత 5.6 శ్లో )**

శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని మహాబాహోఅని సంబోధించుటలో ఒక విశేషార్థమున్నది. బాహువులనగా చేతులు. కర్మాచరణకు ఈ బహువులే ప్రధానం, మహాబాహోఅనుట చేత కర్మయందు ఆరితేరిన మహాశూరుడని అర్థము మరియు కర్మాధికారం కల్గిన ఈ జన్మయే మోక్షము నొందుటకు అనువైనదని సూచించడమైనది. ఓయి అర్జునా! కర్మయోగము నాచరించక సన్యాసమునొందుట కష్టము. నిష్కామకర్మయోగముచే చిత్తశుద్ధి బడసి సన్యాసి అయినవాడు ప్రమాదము నొందక ముక్తినిగాంచును.

అన్నిటికంటే అనుభవంచాలా గొప్పది. అనుభవంకల్గినిదే దేనియందైనను పరిపూర్ణమైన వైరాగ్యము జనించుట కష్టము. ఒకవేళ గల్గిన అదిపూర్ణస్థితి వరకు నిలుచునను నమ్మకము కూడా లేదు. మహామహులెందరో విషయాదులందు అనుభవ పూర్వకమైన వైరాగ్యము లేని కారణముచే పతితులైనట్టు విశ్వామిత్రాది మహాఋషుల జీవితములు మనకు హెచ్చరించుచున్నవి. గాన సన్యాసం అనుకొన్నంత సులభంగా ఉండజాలదు. దానికి యెంతో కష్టములనుభవించవలసి యుండును. తిరుపతి శ్రీ వెంకటేశ్వరుని సప్తగిరులు కాలినడుకచే నడచి ఎక్కినవానికి ఆ కొండల మధ్యగల కష్టనష్టములు బాధలు తెలియును కాని అన్యులకు ఎట్లు తెలియును. అగ్నిని ముట్టి అగ్నిచే బాధనొందినవానికి అగ్ని యొక్క వేడిమి ఎంతటిదో బాగా అర్థమగును. ఒకమారు కరెంటు షాకు తిన్నవాడు అజాగ్రత్తగా ఉండదు. జాగ్రత్తగా మెలిగి కరెంటు పనిచేయును. అలాగే కర్మలాచరించి వాటినుండి సుఖదుఃఖములనుభవించిన వానికి కర్మయోగము సంగతిబాగా తెలిసియుండుటచే మళ్ళీ ఆ చతుర్విధ ఆశ్రమము వైపు

మనసు పోజాలదు. కావున శృతి, చతిర్విధా శ్రమాల నేర్పరచి, వాటికి పురుషార్థ చతిష్టయాయమును కూర్చినది. ఈ పురుషార్థములు ధర్మముతో మొదలయి మోక్షముతో పూర్ణత నొందుచున్నవి. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను, నాల్గువిధముల ఆశ్రమములలో మొదటిదగు బ్రహ్మచర్యమునందు విద్యనార్జించి విద్యద్వారా సుద్ధబుద్ధి కలవారై గృహస్థమున ప్రవేశించి గృహస్థమున ధర్మమునాశ్రయించి తద్వారా అర్థకామములబొంది కాలపరిపక్వత గల్గినతర్వాత అరువది సంవత్సరములపైన వానవప్రస్థము స్వీకరించి తరువాత సర్వేంద్రియముల నియమించి సంవ్యామియై సన్యాసమును స్వీకరించవలెనని శాస్త్రము ఆదేశించుచున్నది. ఇట్టి సన్యాసస్వీకారమునొందిన వ్యక్తి ప్రమాదరహితుడై ప్రపంచ విషయాదుల బారినపడక మోక్షమునొందుననుటలో సంసయములేదు సన్యాసమనగా పేరు ప్రఖ్యాతులకు ఆశించి తీసుకొను ఒకానొక పదవికాదు. ప్యాషను అంతకంటే కాదు ఇది కేవలం జన్మ పునీతంగావించుకొని ఈ జనన మరణసంసారసాగరము నుండి తరించుటకునై పొదు ఒకానొక వైరాగ్య, త్యాగమయ, జీవనము, విషయ విరాగములేని సన్యాసము నేతి బీరకాయవలె నామమమాత్రమై జీవితమును నష్ట భ్రష్టముమును గావించి నరకమున బడవేయును.

సన్యాసికి ధ్యేయం పరబ్రహ్మస్థితి నొందుటయే అట్టిస్థితి గాంచుటకు లౌకికమైన సంఘ జీవితమునకు దూరుడైకదు జాగరూపత గల్గి నిత్యనిరంతర, తన ఆత్మస్థితిని ఏమరు పాటులేక చింతించు చుండవలెను అదియే సన్యాసము.

**శ్లో॥ సన్యాసో నిర్మలం జ్ఞానం / నకాషాయోనముండనం**
**ప్రతిబంధక బాహుళ్య / వారణాయాశ్రయోమతః ॥**

పరిశుద్ధమైన జ్ఞానమేగాని కాది వస్త్రములు ధరించుట, ముండనము చేయించుకొనుట సన్యాసముగాదు. కొన్ని ప్రతిబంధకములు నివారించుకొను నిమిత్తము కాషాయాంబరధారణముండనములతో గూడిన ఆశ్రమమమేర్పడినది. కావున వేషముతో సన్యాసికాలేదు. తత్వజ్ఞానమును పొంది ఆత్మారాములై లోకోపకారార్థం తీర్థస్వరూపులై చరించుట నిజమైన సన్యాసం.

కాని వస్త్రములు గట్టి హృదయమున కషాయ వృత్తులు విడిపకున్న సన్యాసికాలేడు. "తలలు బోడులైన తలుపులుబోడులా" అని యోగివేమనగారి మాట. హృదయమున ప్రాపంచక విషయవాసనలు నశింపజేసి నిత్యనిరంతర ఆత్మధ్యాన తత్పరుడై ఉండడమే సన్యాసము.

చతుర్విధ ఆశ్రమములలో సన్యాసము మకుటాయమానమైనది. సన్యాసి అనగా సర్వసంగ పరిత్యాగియై, ఏకాకియై, నిరంతర ఆత్మానుసంధానపరుడు సర్వస్వమును బుద్ధి

పూర్వకముగా త్యాగము చేసిన మహాత్ముడు విరాగియైచరించు భూలోక సురుడు. దేహపోషణకై భిక్షాటనము జేయుచు తనకులభించిన దానితో తృప్తిచెంది సంతోషముతో జీవితయాత్ర సాగించు మహారాజు.

ఇట్టివారే సన్యాసులనబడుదురునిస్సంగుడై, నిష్కామకర్మ తత్పరుడై తన సేవలను విశ్వకళ్యాణమున కందించు కర్మయోగియై సన్యాసి, సర్వమును సమదృష్టితో సమాలోకించుచు సర్వత్ర సర్వేశ్వరుని సంసేవించు విజ్ఞాన వేత్తయే సన్యాసి.

అనన్యయెగముతో అనవరతము అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన అదినారాయణునిదివ్యనామాను సంధానము చేయుభక్తి శిరోమణియే సన్యాసి.

త్యాగమూర్తియై ఈ ప్రపంచమంతయుతన కుటంబముగా భావించి, సర్వమునుభగవన్మయముగా సంభవించు మహనీయుడే సన్యాసి.

సన్యాసులలో కాషాయదండమాత్రధరులైన స్వార్థపరులు కూడ లేకపోలేదు. ఇట్టివారు కేవలము సన్యాసి నామధారులేగాని నిజమగు సన్యాసులు మాత్రముకాదు. ప్రచ్ఛన్నవేషధారులైనటు ఇట్టిసన్యాసులను సమాధరణచేయుడని ఏ శాస్త్రముగాని, ఏ మతముగాని వక్కాణింపదు. ఇట్టి కపట సన్యాసులే నేడు లోకమున ప్రబలమై సన్యాసశబ్దమునే అపహాస్యము గావించుచున్నారు ఇట్టి వారిని గమనించి వారి వంచనకుగురి గాక జాగ్రత్తపడవలెను.

సన్యాసులు లౌకికులవలె సంఘములను స్థాపించుకొనుట సరియైన పద్ధతి కానేరదు. అది వారి నియమములకుకే గొడ్డలిపెట్టు. సన్యాసికి సంఘ జీవితము ఆ సంఘమున గల సభ్యులతో పరిచయము గల్గించును. ఆ పరిచయము కాలక్రమమున ముదిరి పతన హేతువగును. సర్వమును సమభావముగా సమాలోకింపవలసిన సన్యాసిసంఘ సభ్యుడైనచో అతనికి సంకుచిత స్వభావమేర్పడు యవకాశముగల్పవచ్చును. కొందరిపై అభిమానము మరికొందరిపై దురభిమానం ఏర్పడవచ్చును. ఇది సన్యాసాశ్రమమునకు అనర్థములను వాటిల్లజేయును. సన్యాసులు సకల జీవులను సమదృష్టితో జూడవలెను. గనుక వీరికి ఇతరులతో విశేష పరిచయము తగనిపని ఏకాకియై నిత్యసంచారియై, గ్రామైకరాత్రముగ సన్యాసి జీవించవలయును. కౌపీనధారియై దండకమండలధారియై నిరాడంబరుడై ప్రేమమూర్తియై త్యాగపురుషుడై విలసిల్లు సన్యాసి సంఘమునకు అపకారియనుటయూ అపచారమేయగును. మరియు సన్యాసులు సోమరులు పరాన్న భుక్కులు, అభివృద్ధి నిరోధకులు అని ఏవేవో విమర్శలచేయుట అవివేకము, వినయము, వివేకము విశ్వకళ్యాణకాంక్ష, భగవదనారక్తి ఇత్యాదులు సన్యాసులలో సర్వకాల సర్వావస్థలయందును శోభించు సులక్షణములు, దేశమున ఇట్టి సన్యాసుల సంఖ్య నేడు అల్పముగనే వుండవచ్చును.

వీర ఉన్మత్తుల వలె ఏకాకులై అక్కడక్కడ సంచరించుచునేయుందురు.

భిక్షావృత్తినిగొని జీవించు దరిద్రులవలెను కన్పట్టవచ్చును. కానీ ఇట్టి మహానీయులు తమ అంతఃకరణములను పరిశుద్ధమొనర్చుకొని జీవితములను పునీతమొనర్చుకొనియుందురు. పరులకు మేలు చేయుచు పరమార్థమును సైతమును ప్రసాదింపగల సమర్థులైయున్న మహాత్ములు.

ఉత్తమకీర్తులైన మనుజోత్తములాత్మహితంబు నెన్నడున్ చిత్తము నందు గోరురు. హసించియు లోకులకెల్ల నర్థసం పత్తియు భూతియున్ సుఖము భద్రము గోరుదురు.

అని భాగవతము దెల్పినట్లు ఇట్టి మనుజోత్తములే సన్యాసులు. వీరు ఉత్తమ కీర్తిని పొంది విరాజల్లగలరు. ఇట్టి సాధపుంగవులను కూడుగుడ్డలకై కృషిగావించి బ్రతకుడని పల్కుట మహాపచారం. ఇట్టి పలుకులు దేశమునకే అనర్థములు. భారతవంశవృక్షమున కేసన్యాసిమూలపురుషుడను సత్యమును మనమెన్నడును మరువకుందముగాక.

నేటి సంఘసంస్కర్తలవలె, సంఘములను స్థాపించి స్వార్థమునకై ప్రాకులాడుచున్నట్లే, నిస్వార్థులైన సన్యాసులను సైతము సంఘముల నేర్పరచుకొని జీవించుకొనుట. భారతీయ సంప్రదాయమునకే వ్యతిరేకము. సన్యాసాశ్రమమునకు గొడ్డలిపెట్టు. అట్టి సంకుచిత తత్త్వములకు అతీతుడే సన్యాసి అనిచెప్పబడును.

బ్రహ్మచారి, సన్యాసియు భిక్షాటనముగావింపకుండుట దోషము. సంఘమున జీవించు సామాన్య గృహస్థులు భిక్షాటనము చేయుటయు దోషము. ఇది భారతీయ సాంప్రదాయము. కావున ఇట్టి కష్టములతో కూడియుండుట చేతనే సన్యాసము అనుకొన్నంత సులువుగా నుండజాలదు. కావున ఇట్టి కష్టములతో కూడియుండుట చేతనే సన్యాసము అనుకొన్నంత సులువుగా నుండజాలదు.

నిష్కామకర్మ యోగమునవలంభించి చతుర్విధ ఆశ్రమములలో ఉత్తమమైన సన్యాసమును పొందవలసియుండును. ఒక్కొక్కమెట్టు ఎక్కినవానికి అలసట లేనట్లు క్రమక్రమముగా బ్రహ్మచర్యమునుండి గృహస్థం గృహస్థమునుండి, వానప్రస్థతము వానప్రస్థతము నుండి సన్యాసము స్వీకరించువారికి ప్రమాదమునందవలసిన అవకాశం లేదుగాన, ప్రమాదరహితమగు కర్మయోగమునకు ఆశ్రయించి జీవితతమును ధన్యమొనర్చుకొనవలసియుండును.

**శ్లో॥ యోగయుక్తోవిశుద్ధాత్మా విజతాత్మాజితేంద్రియః,**
**సర్వభూతాత్మ భూతాత్మా, కుర్వన్నపినలిప్యతే (శ్లో 7) (గీత–5)**

కర్మయోగ యుక్తుడు పరిశుద్ధాంతః కరణడు స్వాధీన చిత్తుడు. జితేంద్రియుడు తనవలె సమస్త భూతములను చూచువాడునగు పురుషుడు కర్మములను చేయుచున్నను బద్ధుడుకాడు.

అర్జునా! ఇంతవరకు కర్మయోగవృత్తాంతాన్ని సాంతముగావింటివిగదా! పరిపక్వ హృదయములేనివాడు కర్మలవదలుటకంటే, నిష్కామముగా ఈశ్వరార్పణ బుద్ధితో శాస్త్రసమ్మతమైన నిత్యనైమిత్తి కర్మనా చరించినచో హృదయము శుద్ధిని పొందుతుంది. తద్వారా క్రమక్రమంగా జ్ఞాన నిష్ఠాతత్పరమైన కర్మాతీతస్థితిని పొందుమార్గంలో ప్రవేశించి సిద్ధుడౌటనుగురించి ఇక విను.

ఇది ఐదవ అధ్యాయంలో 7వ శ్లోకము ఈశ్వరార్పణబుద్ధితో చేయబడిన నిష్కామకర్మ జ్ఞానానికి (సన్యాసమునకు) పరంపర సాధన కాగలదు. ఆప్రక్రియను గురించు ఈశ్లోకమున చెప్పబడినది.

యోగముక్తుడనగా! కర్మకౌశలమునుగలిగిన వాడు చేసిన శాస్త్ర సమ్మేతమైన నిత్యనైమిత్తిక కర్మలు జీవుని పాప సంస్కారమునుండి ఉద్ధరిస్తాయి. తద్వారా, వివేక జ్ఞానం ఉదయించి, సత్యాసత్యములను గర్తించగలుగుతాడు. వాస్తవికంగా జీవునికి, కర్మ ప్రభావము వలననే పాపపుణ్య సంస్కారములు, కష్టసుఖాలు, ఊర్ధ్వఅధోలోకాల గమనం జరుగుతూ ఉంటుంది. నిషిద్ధకర్మాచరణచేత అధోలోక ప్రాప్తి, శుద్ధమైన పవిత్రమకర్మలచేత ఊర్ధ్వలోక ప్రాప్తిగల్గుచుండును. జీవుని సుఖదుఃఖాలకు అతడాచరించినిన కర్మలే కారణము.

దేహాభిమానం వీడని మానవులకు ఈశ్వరార్పణంగా వారిచే జేయబడు జపధ్యాన, దాన, ధర్మ, యజ్ఞ, యాగాదులు, పూర్వదుష్టసంస్కారమును దూరవొనర్చి, సత్సాస్కారవంతులుగా జేయును, సత్సంస్కారవంతులకు మాత్రమే మహాత్ముల బోధమంచిగా బుద్ధిగతమై జ్ఞానాపేక్షను, గల్గించి బ్రహ్మానుభవానికి అధికారులుగా జేయును. ఈ విషయమునైష్కర్మ్య సిద్ధియందు జెప్పబడినది చూడుడు.

“నిత్యకర్మానుష్టానా ధర్మోత్పత్తిః ధర్మోత్పత్తేః పాపహానిః / తతశ్చిత్త శుద్ధిః/ తతసంసారయథాత్మ్యా బోధః / తతోవైరాగ్యం / తతోముముక్షుత్వం / తతస్తదుపాయ పరవేణం / తతస్సర్వకర్మ తత్సాధన సంన్యాసః / తతోయోగాభ్యసః / తతశ్చిత్తస్య ప్రత్యక్ష వణతా తతస్త్వమస్యాధి వాఖ్యార్థ పరిజ్ఞానం / తతఃస్మాత్యన్యేవా వస్థానం ॥

నిత్యనైమిత్తిక కర్మలు ఈశ్వరార్పణ బుద్ధితో చేయుటచేత ధర్మబుద్ధి గల్గును, తద్వారా పాపహానిగలుగును. పాపహానివలన చిత్తము దర్పణమువలె శుద్ధమగును. శుద్ధమైన మనసునందు సంసారము యొక్క వాస్తవస్థితి గుర్తెరుంగును. వివేకం గల్గును. అందువలన వైరాగ్యము గల్గును. వైరాగ్యప్రభావము వలన మోక్షాపేక్ష కలుగును. అందువలన తత్సంబంధమైన సాధనల విచారించును. ఆ సాధన ప్రభావం చేత సన్యసించును. తదనంతరం ఆత్మయోగమునభ్యసించును. ఆ యోగ ప్రభావమువలన మహావాక్యవిచారణచేయును. మహా వాక్య విచారణము వలన అజ్ఞానజన్యమైన మోహంనశించి స్వరూప స్థితిని బడిసి తానె బ్రహ్మమనుజ్ఞానం గల్గును.

కావున అయ్యా! పార్థా ప్రారబ్ధానుసారకంగా నీ పాలిటికివచ్చిన విధ్యుక్త కర్మలను ఈశ్వరార్పణంగా జేయుటచేత త్రికరణశుద్ధిగల్గును. త్రికరుణశుద్ధి అనగా! మనో వాక్కాయములందు పవిత్రతగల్గును. మనశ్శుద్ధి ప్రభావము చేతా విశుద్ధాత్ముడైనన్. శరీరశుద్ధిచేత విజిత్మాతుడైనాడు. వాక్శుద్ధి ప్రభావముతో జితేంద్రియుడై సర్వభూతముల కధిష్ఠానమైన ఆత్మానుభవముగల్గి, సర్వభూతములయందు సమానత్వముగల్గి సర్వముతానే అనే బ్రహ్మభావం గల్గును.

అట్టి బ్రహ్మభావం గల్గిన మహాభావుని వర్తన వింటున్న, కంటున్న, తింటున్న, చూస్తున్నా, సర్వకాలసర్వావస్థల యందును ఆయా ఇంద్రియాదుల చేష్టలైన కర్మభావాన్ని వదలి బ్రహ్మధ్యాన పరాయణుడైయుండును. ఆ మహాభావుడు ప్రారబ్ధాదీనమై, కర్మలు ఆచరిస్తున్నప్పటికి వానికి కర్మలు అంటవు. ఇతరులదృష్టిలో మహాత్ముల కార్మాచరణులై కన్పడినప్పటికి, ఆ మహాత్ముడు కర్తృత్వ దృష్టిలేక సదా బ్రహ్మమునందేరమించుచుండును. గాన ఆయన కర్మలు కర్మలుగాదు. కర్మభాసములు, వేపిన గింజవలె, కాలినవస్త్రమువలె ప్రయోజనకారం కావు. అనగా! కర్మసంస్కారమును కల్గించలేవు. పునర్జన్మకు కారణములు కాజాలవు.

లోకులదృష్టిలో సూర్యునికి ఉదయాస్తమయములు గల్గినట్లుండును గాని, సూర్యునికి వాస్తవికంగా ఉదయాస్తమయములు లేవు. అటువలెనే జ్ఞాని యొక్కకర్మలు ఇతరులకు కన్పడినప్పటికి ఆ మహాత్మునిదృష్టిలో లేని వేయగును.

సీ॥ వినుచుముట్టుచుగనుగొనుచు మూరు
కొనుచు బల్కుచు బనుల్గొనుచు జనుచు
వర్ణాశ్రమోచితవ్యాపారములనిచ్చ
సలుపుచుదలచుచు మెలగునెడల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబుల
బూనివర్తించునే వీనికెల్ల
సాక్షినిగేవల సచ్చిదానంద స్వ
రూపుడగుణజాతి రూపనామ

తే॥ రహితుడనటంచుదెలసి నిరంతరంబు
దన్నుదా జూచుకొనుచు సత్యముగనీయ
ఖండనియమంబు వదలకయుండుటరయ
నియమయోగంబనందుగునిర్మలాత్మ

అని శ్రీసీతారామాంజనేయసంవాదంలో ఆ మహాత్ముని బ్రహ్మీస్థితిని వర్ణింపబడినది.

ఈ ఐదవ అధ్యాయము 8.9 శ్లోకాల భావాలే పద్యమునందు వర్ణింపబడింది.

కావున అట్టికర్మాతీతస్థితిని బొందవలెనంటే మునుమందు నిష్కామకర్మాచరణ జరిగియే తీరవలయును. నిష్కామకర్మాచరణ లేనిదే కర్మాతీత స్థితినొందుట కష్టము, కాన సాధకుడు కర్మలనాచరించు విధానాన్ని గురించి ఈ క్రింది శ్లోకం దెల్పుచున్నాడు. భగవానుడు.

**శ్లో॥ బ్రహ్మణ్యాధాయకర్మాణి / సంగంత్యక్త్వాకరోతియః,**
**లిప్యతేనసపాపేనపద్మపత్రమివాంభసా॥**

బ్రహ్మార్పణ బుద్ధితో సాధకుడు కర్మలాచరిస్తున్నప్పటికి, తామరాకు నీటిని అంటనట్లు సాధకుడు ఆకర్మ, లేపనానికి అంటుకొనదు, ఎందుకనగా కర్మకు ముఖ్యమైన కారణం కర్తృత్వము, ఈ కర్తృత్వముతో చేయబడు కర్మలే, ఫలములనిచ్చును, గాని కర్తృత్వములేని కర్మలు నీటిమీద వ్రాతలవలె మటుమాయమైపోతాయి. సాధకుని కర్మలు ఈశ్వరార్పణం కావటంతో కర్తృత్వము లేదు, గాన ఆకర్మ సాధకునికి బంధానికల్గించలేదు.

మనోవాక్కయములతో కర్మయోగిమైనవాడు అభిమానమును, పలాసక్తిని విదలి ఆత్మశుద్ధి నిమిత్తమై కర్మలనాచరించుచున్నాడు.

కర్మమనే సర్పానికి రాగద్వేషాదులు విషదంతములు, కర్మయోగి ఆత్మసాక్షాత్కార నిమిత్తమై మనోవాక్యాయములచేత శాస్త్రోచితమైన కర్మలు, రాగద్వేష రహితుడై ఆచరించును. రాగద్వేషరహితమైన కర్మలు కోరలు తీసిన కర్మలు కోరలు తీసిన సర్పములాగా ఆత్మోన్నతికి కారణమగుచున్నవి. అనగా! కోరలు దీసిన సర్పము ప్రమాదమును కల్గించకపోగా పాములవానికి భుక్తిని సైతం కల్గించినట్లు రాగద్వేషరహితమైన కర్మసాధనకు బంధ విముక్తికి ఆత్మశుద్ధికి కారణమగుచున్నది.

కావున అర్జునా! ఫలాసక్తి లేక నిష్కామంగా సాధకుడు చేయు కర్మలు శాంతిని కల్గించి, ఆత్మశుద్ధికి కారణాలగుచున్నాయి. కావున నీవు కూడ ఈ సంగ్రామమున ఫలాఫలములయందు. జయాపజయములందు ఆసక్తిని వదలి, నిష్కామివైయుద్ధమొనర్చుము. అదినీకు శాంతిని మోక్షమును సైతము గల్గించును.

భగవానుడు ఈ అధ్యాయమున 12వ శ్లోకం వరకు నిష్కామకర్మ యోగాన్ని అట్టి నిష్కామకర్మయోగం ద్వారా గల్గె చిత్తశుద్ధిని, చిత్తశుద్ధిద్వారా కల్గెడి శాంతిని ప్రవచించి, యిపుడు, పదమూడవ శ్లోకములో సర్వకర్మ సన్యాసియైన మహాత్ముని అంతరంగిక జ్ఞానసంపదను గురించి వివరిస్తూన్నాడు.

**శ్లో॥ సర్వకర్మాణి మనసా, సంన్యస్యాస్తే సుఖంవశీ**
**నవద్వారే పురేదేహీ, నైవకుర్వన్నకారయన్.**

అయ్యా పరంతపా! కర్మయోగ పరిపక్వముతో నర్వసంగ పరిత్యాగియైన

మహనీయుని వర్ణన గురించి విను, ఆ మహాత్ముడు తన మనోవాక్కాయములను మూడింటిని తన స్వాధీనంలో వుంచుకొని ॥వశీ॥ అయినాడు. అనగా సిద్ధిపురుషుడయ్యాడు.

సన్యాసం అంటే కర్మలు వదలితే, కావిధిరిస్తే, తలముండనజేసుకుంటే, సన్యాసిగాదయ్యా! సర్వకర్మాణి మనసా సర్వే సమస్తమైన కర్మలు వాటికి కారణమైన సంకల్పాలను, మనసులో ఏతన్మాత్రం కూడ లేనివాడు, అనగా! సంకల్పత్యాగం గలవాడు సర్వకర్మలకు సంకల్పాలే కారణము. సంకల్పాలులేక నిస్సంకల్పస్థితి లోనుండుటే నిజమైన సన్యాసము "సర్వకార్మాణి" అనగా! మనసుతోగాని, వాక్కుతోగాని కాయంతోగాని ఏకర్మతో సంగంలేని వాడువాడే నిజమైన సన్యాసి, అట్టిమహాత్ముడు, నవద్వారపురమైన శరీరమును సుఖముగానుంటున్నాడు. స్థూల, సూక్ష్మ కారణ శరీరములనే మాత్రమునంటక ఆకాశము వలె నిర్లిప్తుడుగా నుండును. అట్టి మహాత్మునియందుదేహధర్మాదులుగాని, మనోధర్మాలుగాని లేకనిత్యానంద స్వరూపుడై యుంటాడు.

గృహమునందున్నవానికి ఆ గృహానికి గల్గు శీతోష్ణాదులు ఎలా అంటవో ఆవిధముగానవద్వార పురమైన ఈదేహమందు సన్యాసి శరీర హానివృద్ధుల లెక్కించిక తానుతానై ఆత్మానందపరుడై యుండును.

నిజానికి సుఖముగాని, దుఃఖముగాని దేహాత్మభావము గలిగినవానికే గాని దేహాభిమానం లేని ఆత్మారామునికి, సుఖదుఃఖాదులు పిల్లగాద్పులకు మేరు పర్వతం చలించనట్లు ఆ మహాత్ముని చలింపజేయజాలవు. ప్రారబ్ధాధీనమైయట్టి మహాత్ముని దేహమునడపబడునే గాని, తన యిచ్చట కించిత్ కూడ దేహముపై నుండదు.

మ॥ మదిరాపానమదాంధుదాత్మపటమున్మైనుండినన్ జారినన్
వదులైవ్రేలిన జూడదప్పగిది జీవన్ముక్తుదుద్యత్సమా
ధిదశాప్రాప్తసుఖామృతానుభవతృప్తిన్మత్తుడై మేను నె
మ్మది గూర్చిండినలేచినన్నడచినన్ మన్నింపదేనంచుదాన్

అని సీతారామాంజనేయ సంవాదము. మదిరాపానము చేసినవాడు బాగామత్తెక్కి తన్నుదాను మరచి, తన దేహమున వస్త్రమున్నది లేనది కూడ ఎలా తెలియదో ఆ విధంగానే జీవన్ముక్తుడైన మహాత్ముడు నిత్యనిరంతర నిర్వికల్ప సమాధిలో అనగా జ్ఞానసమాధి అని తెలియవలెను. యోగసమాధిగాదు, యోగ సమాధి ఒక పుడుండి మరొకపుడు తొలగును) బ్రహ్మానందామృతము గ్రోలుతు, మైమరచియుండును.

ప్రారబ్ధాదీనమై ఆ దేహము తిరుగుచున్నా, కూర్చుండిన పరుండినా, తానుమాత్రము శరీరమును, లక్షింపక ఆత్మానందరతుడైయుండును.

పాముచే విడువబడిన కుబుసము గాలికి అల్లాడినా, ఎండకు ఎండినా, వానకు నానినా, అగ్నికి ఆహుతియైనా, ఆపాముకెట్లు వికారం లేదో, ఆ విధముగా, జీవన్ముక్తుడై తనుదాదెలిసిన మహాత్మునికి, దేహమందే మాత్రమును, మమతాహంకారములుండవు. సదా బ్రహ్మానంద నిమగ్నుడై యుండును.

కావున ఇట్టిమహాత్మునికి, కర్తృత్వ, భోక్తృత్వములు లేవు. గాన కర్మలు చేయువాడు గాగాక, చేయించువాడును గాక, నవద్వారములు గలిగిన ఈ దేహమునందు సుఖముగ నున్నాడు. నవద్వారములనగా! రెండుచెవులు, జిహ్వ, రెండు నేత్రములు, రెండు నాసికా పుటములు, అధోముఖమున గలగుదేంద్రియము, మర్మేంద్రియములు గల ఈ పాంచ భౌతిక దేహమునంటక, ఘటమునందలి ఆకాశమువలె నిర్లిప్తుడైయున్నాడని భావము.

అజ్ఞానియైన మానవుడు దేహమేనేనని భ్రమించును. అట్టి దేహాత్మ భావముగలవాడు, నేను ఇంటిలోవున్నాను. నేను ఇంటిబైట వున్నానని భ్రమించి, బ్రహ్మముతానై కూడ బ్రహ్మమును దెలియలేకున్నాడు.

ఏది తనచేత తెలియబడుచూ, చూడబడుచు గ్రహింపబడుచూ ఉన్నదో అదెల్ల తనకంటే వేరయ్యేవున్నది. ఇది నాయిల్లు అన్నపుడు, ఇల్లువేరునీవు వేరు, ఇది నాభార్య అన్నపుడు, నీవు వేరు భార్య వేరు. అలాగే తన స్వశరీరమునందున గల సర్వావయవములు తనచేతన చేత గ్రహింపబడుటచేత అవియన్నియు, తనకంటె వేరైయున్నవి. ఇది నా తల అన్నపుడు తలవేరు నీవు వేరు. నా మనస్సు అన్నపుడు మనస్సు వేరు నీవువేరు. ఇలా విచారించి చూచిన, సర్వ ప్రపంచము, తన దేహము, దేహము లోపల గల మనోబుద్ధి చిత్త అహంకారములన్నియు, తనకు దృశ్యములే యగును. తాను సర్వమును చూచుసాక్షి ద్రష్టయగును. దృశ్యము యొక్క హాని వృద్ధులుగాని, కష్ట సుఖములగాని ద్రష్టయగుతనకు అంటనేరవు. ఈ విషయమును చక్కగా విచారించి గుర్తెరిగిన ఆత్మవిదుడు సదా ఆనందరూపుడై త్రివిధావస్థలయందును ఉంటున్నాడు.

పరమాత్మకు కర్తృత్వముగాని, కారయిత్వముగాని లేవు. ఇవన్ని ప్రకృతి యొక్క స్వభావధర్మములు.

**శ్లో॥ నకర్తృత్వం నకర్మాణి, లోకస్య సృజతి ప్రభుః ।**
**నకర్మ ఫలసంయోగం, స్వభావస్తు ప్రవర్తతే ॥**

ప్రభువగు ఆత్మకర్మములనుగాని, కర్తృత్వము గాని కర్మఫల సంబంధము గాని, లోకమునకు తాను అంటక్టలేదు. అది అంతయు త్రిగుణాత్మకమైన ప్రకృతి యొక్క స్వభావమైయున్నది.

ప్రభుః అనగా ఆత్మ. ఆత్మ స్వయం ప్రకాశం, సర్వమును ప్రకాశింపజేయునదిగాన ప్రభుః అని జెప్పబడినది. దేహమునకు లోపలగల అంతరింద్రియములను, బాహ్యమునగల జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను, దశవిధప్రాణములను (దశవాయువులను)

ప్రకాశింపజేయువాడు అయినను, ఆత్మకర్త గాదు. కారయితాగాదు. భోక్తయుగాదు. మరి శరీరములో జరుగుబడు సర్వకర్మలకు కారణ మెవ్వడు అని అడుగుతావా! అర్జునా వినుత్రిగుణాత్మక స్వరూపమైన ప్రకృతియె కర్త కారయిత భోక్త అంతయు అదియె ఆత్మనిర్వికారము అచలము, చలాచలత్వములన్నియు త్రిగుణాత్మికమైన ప్రకృతి సంబంధములే కాని, పరమాత్మకు లేవు. తెలియని అజ్ఞానులు ప్రకృతియొక్క ధర్మములను ఆత్మపైనారోపించుకొని, మోహావృతులై జననమరణాదిసంసారమున బడిపోవుచున్నారు.

సూర్యుడు సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయును. అయిననూ ప్రపంచ కార్యముల యొక్క వికారం, సూర్యునిదిగాదు. అయస్కాంత సన్నిధినిగల ఇనుప ముక్కలు చలించునట్లు సూర్యప్రకాశమువలన సర్వజీవుల కార్యములు జరుగు తున్నట్లు ఆత్మయొక్క స్వయం ప్రకాశ ప్రభావమున ప్రకృతి సృష్టి, స్థితి, సంహారక కార్యములు జరిగిపోవుచున్నవి.

**క॥ త్రిగుణాత్మికయై యనిశము**
**జగముల బుట్టింప పెంపసమయింపంగా**
**దగుమూల ప్రకృతియన నే**
**నపుడు జుమీ. సత్యముగ మహాగుణశాలీ॥**

అని సీతారామాంజనేయ సంవాదములో, సీతామాత శ్రీహనుమానునికి బోధిస్తుంది. ఓయీ హనుమా! సత్వరజస్తమోగుణములను నీత్రిగుణములే స్వరూపముగా గలదై, యెల్లప్పుడును ప్రపంచసృష్టి, స్థితిసంహారక సామర్థ్యము గల మాయాశక్తి నేను అయివున్నాను. కావున అయ్యా అర్జునా! ఈ విశాల జగజ్జాల సృష్టి వైపరీత్యమంతయు ప్రకృతి యొక్క విలాసమేగాని పరమాత్మదే మాత్రము గాదు.

అయితే శ్రుతిస్మృతులలో సర్వసృష్టికర్త భగవంతుడే అనిజెప్పే మాటలకు గతియేమి అని అనెదవేమో! విను.

**శ్లో॥ నాదత్తేకస్యచిత్పాపం, నచైవసుకృతం విభుః,**
**అజ్ఞానేనావృతం జ్ఞానం, తేనముహ్యన్తి జన్తవః॥**

వాస్తవంగా విచారించి చూచినట్లైతే పరమాత్మ ఎవరిపాపమునకుగాని, పుణ్యమునకుగాని కర్తగాడు. ఆయా జీవుల ప్రకృతి స్వభావసిద్ధమైన మాయచే ఆవరింపబడినవారై, పాపపుణ్యకర్మలనాచరించి వారి వారి ఫలాపలముల ననుభవించుచున్నారు. పూర్వము ఎన్నో ఇతర జన్మలందుచేసుకొన్న పాపము పుణ్యప్రదమైన ఈ మానవదేహము నందు పోగొట్టుకొన వచ్చును కారణమేమన అన్యక్షేత్రములలో (ఇతర జన్మలందు) స్వస్వరూపజ్ఞానమునకు వలసిన సాధనములు లేవుకాన, మానవ దేహమునందు జ్ఞానార్జనకు కావలసిన శక్తి స్వత సిద్ధముగా నున్ననది. కాబట్టి ఈ దేహమును పుణ్యక్షేత్రముగా భావించవలెను.

సృష్టిని గురించి విచారించి నట్లైతే ఇది భ్రాంతి కల్పితమేగాని, సత్యముగాదు. రజ్జువునందు సర్పభ్రాంతి గల్గినట్లు, శుద్ధనిర్గుణ, నిరాకార, పరమాత్మయందు ఈ మాయామయమైన సృష్టి కల్పితముగాతోచినది. ఇది యంతయు అజ్ఞానకల్పితం, మాయానగరమువలె మాయా కల్పితమైన ప్రపంచ ప్రతీయమానమగుచున్నదేగాని, నిజమునకు లేనిదేయగును.

ఆవరణము, విక్షేపము, అని రెండు గుణములు అజ్ఞానమునకుగలవు. సూర్యుణ్ణి మేఘము ఆవరించినట్లు ఆవరణమనే పొరజ్ఞానాన్ని ఆవరించి, జీవ భ్రాంతిని గల్గించినది. విక్షేపమనేశక్తి మాయావిరచితమైన జగత్తును సత్యమని భ్రమింపజేసినది. తద్వారా జీవుడు తనుతాను మరచి మనోచాంచల్యముచే సంసారమున బడి జననమరణముల పాలైతపిస్తున్నాడు.

అట్టి సంసారోపగతుడైన జీవుని ఉద్ధారకమునకు జ్ఞానమొక్కటి యేతరుణోపాయముగాని, మరియే ఇతర సాధనలచేత అజ్ఞానం నివారిపంబడేదిగాదు. అంధకారము వైదొలిగి పోవలయునన్న సూర్యోదయం కావలయును. లేదా జ్యోతి ప్రకాశమైనను కావలయునేగాని, అవిధముగానే అజ్ఞాననివృత్తికి జ్ఞానమొక్కటియే సాధనము.

అయితే పైశ్లోకంలో "అజ్ఞానే నావృతంజ్ఞానం" అని అజ్ఞానంచేత జ్ఞానం గప్పబడియున్నదే? అని అన్నచో ఆత్మను నేను అని యెరిగేవృత్తి జ్ఞానాన్ని ఆవరిస్తుందని తెలిసుకొనవలెను. కాని జ్ఞానస్వరూపమైన ఆత్మనుగాదు. ఆత్మ అఖండస్వరూపం. దాన్ని ఆవరించే శక్తి అజ్ఞానానికి లేదు. మేఘము సూర్యుణ్ణి ఆవరించిందంటే అర్థమేమిటి సూర్యున్ని చూచెకంటి దృష్టిని ఆవరించినదని గ్రహించవలె. అలాగే ఇక్కడ అజ్ఞానముతో జ్ఞానము ఆవరింటబడినదంటే జ్ఞానమును తెలుసుకొను బుద్ధివృత్తిని ఆవరించినది తెలుసుకొనవలెను. బుద్ధి యొక్క అజ్ఞానం వైదొలగితే ఆత్మ స్వయం ప్రకాశం, నిత్య సిద్ధమై వుంది. ఆత్మస్వరూపం పాప్తియేగాని, అప్రాప్య ప్రాప్తికాదు.

నిష్కామ కర్మ ద్వారా హృదయశుద్ధిగల్గి సద్గురు దేవుని సన్నిధానమున, మహావాక్య విచారణ చక్కగా శ్రవణం చేసి సంశయ విపర్యయములు లేక సమ్యక్‌జ్ఞానం గల్గిన మహాత్ములెట్లుందురనగా?

**శ్లో॥ తద్బుద్ధయస్తదాత్మానః, తన్నిష్ఠాస్తత్పరాయణాః**
**గచ్ఛంత్యపునరావృత్తిం, జ్ఞాన నిర్ధూతకల్మషాః ॥**

అయ్యా! అర్జునా ! జ్ఞాన ప్రభావమున సర్వే సమస్తమైన పాపపంకిలమును పోనడచిన మహాత్ములు పరమాత్మయందే బుద్ధియు, మనస్సును, నిష్ఠతో నిల్పినవారై తిరిగిరాని పరబ్రహ్మ పదవిని బొందుచున్నారు.

ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడిన కర్మలద్వారా అంతఃకరణ శుద్ధిని బొంది, ఆత్మజ్ఞాన సిద్ధిని బడసిన మహాత్ముల గురించి యెంత వర్ణించినా తనవి తీరదు. ఆ మహాత్ముల బుద్ధి బ్రహ్మాకారమై అనే విషయములనుండి విముక్తిని బొందినది. పరుసవేదిని సోకిన ఇనుము బంగారమైనట్లు ఆ మహాత్ములబుద్ధి శ్రవణ మనన, నిధి ధ్యాసల ప్రభావము వలన స్వరూపస్థితియైన బ్రహ్మనుపొంది బ్రహ్మమవుతుంది. గాన వారు తదాత్ములైపోతారు. ఆత్మ సర్వుల యొక్క స్వరూపమై యున్నప్పటికి బహిర్ బుద్ధి గలిగిన అజ్ఞానులకు అది పరోక్షంగా వుంది. వారు దేహాత్మబుద్ధిగలవారైనందున ఆత్మతనస్వరూపమై యున్నా తదాత్ములు కాలేకపోయారు.

జననమరణాలకు కారణం అజ్ఞానం. అనగా దేహాత్మ భావమే పెద్ద అజ్ఞానం. ఇదియే మహాపాపం, దేహాత్మభావనకు మించిన పాపం మరొకటిలేదు. సర్వపాపములు ఈ దేహాత్మ భావన వలననే జరుగుచున్నవి. అట్టి సర్వపాపములకు కారణమైనట్టి దేహభావన. అహంబ్రహ్మాస్మి, అయమాత్మ బ్రహ్మ, ఆనోందోబ్రహ్మ, తత్త్వమసి అను వేదాంతర్గత మహావాక్యములను సద్గురు దేవుని సన్నిధానమున చక్కగా శ్రవణంచేసి, సంశయ విపర్యములు నశించి నిశ్చయ జ్ఞానమును పొందినవారుగాన "జ్ఞాననిర్ధూతకల్మషాః" అన్నట్లు జీవేశ్వరభిన్న భావలనే కల్మషం నుండి విముక్తిని బొందియున్నారు.

"జీవేశ్వరౌభిన్నరూపావతి ప్రాథమికోభ్రమః జీవాత్మవేరు, పరమాత్మవేరు అనుకొనడమే ఒకపెద్ద భ్రమ, ఇది మొదటి భ్రమ, ఈ భ్రమ ఉన్నంతవరకు జీవునికి జనన మరణాలు అనేవి తప్పవు.

జ్ఞాన ప్రభావంతో సద్గురుదేవుని కృపావిశేషముతో జీవేశ్వరుల అభేదదర్శనం పొందియున్నందున, తన్నిష్టులైనారు. అనగా! బ్రహ్మమే తామైపోయారు. బ్రహ్మవిత్ భ్రహ్మైభవతి బ్రహ్మమును తెలిసినవారు బ్రహ్మమయ్యే వున్నారు. అనుశ్రుతి వాక్యము, గాన బ్రహ్మజ్ఞాన ప్రభావం వలన అజ్ఞానకార్యములైన పాప పుణ్యములు భస్మీభూతములై పోవును. "దృష్టి జ్ఞానాకారమైనపుడు, సృష్టి బ్రహ్మాకారమైపోయింది. కాన వారిబుద్ధి సమస్థితిని పొందినది. వారి దృష్టిలో నామరూపాలు తుడుచుకొని పోయినవి. కావుననే ప్రపంచమున గల సర్వజీవులయందును బ్రహ్మభావనాస్థితిని సాధించారు.

**"విద్యావినయసంపన్నే, బ్రాహ్మణేగవి హిస్తిని।**

**శునిచైవశ్వపాకేచపండి తాస్సమదర్శినః ॥**

విద్యావినయం గల బ్రాహ్మణునియందును, గోవునందును ఏనుగునందును, కుక్కయందును, చండాలుని యందును, కూడ పండితులగువారు సమదృష్టి గల్గియుందురు.

భగవద్గీతలో భావగర్భితమైన ముఖ్య శ్లోకములలో ఈ శ్లోకము ఒకటిగా పరిగణింపబడినది. ఒరిపిడి రాయితో బంగారును పరీక్షించి చూచినట్లు ఈ శ్లోకార్థం యొక్క భావనతో మహాత్ములెవరైనది గమనించవచ్చును.

"పండితాసమదర్శినః" పండితుడైన జ్ఞానిస్రమభావన బ్రహ్మభావన గల్గియుండును ఇక్కడ పండితుడనగా సర్వశాస్త్రములను ఆ మూలాగ్రముగా చదివినవాడు అనిగాదు. "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రి" అన్న ప్రహ్లాదునిమాట, సర్వశాస్త్రముల సారము పరమాత్మను దెలుసుకొనడమే, పరమాత్మను తెలియని శాస్త్రముల యొక్క చదువులు "భుక్తయేనత ముక్తయే" అన్నట్లు అట్టి చదువులు పొట్టకూటిచదువులేగాని ముక్తిని గల్గించలేవు. "చదివి చదివి చావంగనేటికి చావులేని విద్యచదువవలయు" అన్న వేమన్నగారి మాట. జనన మరణాది సంసార క్లేశముల నుండి తరిపంజేయు విద్యయే నిజమైన విద్య. లౌకిక విద్యతో మానవుడు అహంకారపూరితుడైతాడు గాని వినయ సంపన్నుడు కావటం చాల అరుదు. అట్టి వినియసంపద గలిగినదే బ్రహ్మ విద్య, అనగా, బ్రహ్మమును తెలియజేయు విద్య.

బ్రహ్మమును తెలిసిన బ్రహ్మవేత్త సమదర్శి అవుతాడు. అలాంటి మహాత్ముని దృష్టి కారణదృష్టియేగాని, కార్యదృష్టిగాదు. అభరణానికి బంగారం కారణం, కార్యం ఆభరణాలు, కార్యరూపమైన ఆభరణం కారణరూపరమైన బంగారమే వేరుగా లేదు. కార్యరూపమైన ఆభరణముల నామరూపాలు మిధ్య, కారణమైన బంగారం సత్యం, అలాగే ఈ సర్వజగత్తుకు కారణం బ్రహ్మకార్యము జగత్తు. ఈ జగత్తులోకనపడే సర్వనామరూపము. దృశ్యమంతయు బ్రహ్మమే. "బ్రహ్మ సత్యం ని జగన్మిమిథ్య" రజ్జువు నందు సర్పభ్రాంతి గల్గినట్లు, అజ్ఞానదృష్టి ప్రభావంతో సత్య స్వరూపమైన బ్రహ్మయందు జగత్భ్రాంతి గల్గినది. విచారదృష్టిచే పరికించి చూచిన భ్రాంతి జన్యమైన నామరూప ప్రపంచం తదిధిష్ఠాన బ్రహ్మముగా దర్శనమౌతుంది. "భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు".

బ్రహ్మవిద్యావిచారపరులైన బ్రహ్మవేత్తలే పండితులు అట్టి మహాత్ముని దృష్టిలో ఈనామరూపములతో గోచరించు సర్వప్రహచము బ్రహ్మముగానే భాసించును. అట్టి బ్రహ్మదృష్టిగల్గిన మహాత్ముడు విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందు గోవుయందు, ఏనుగునందు, కుక్కయందు, చండాలునియందు కూడ సమదృష్టి గలిగి వర్తించును. వారిదృష్టి బంగారు దృష్టియేగాని ఆభరణాల దృష్టిగాదు. కావుననే ఉచ్చనీచములను భావము లేక సర్వము సర్వమంగల ప్రదమగు బ్రహ్మముగానే దర్శించుదురని భావము.

మరికొందరు వ్యాఖనకర్తలు ఈ శ్లోకమునకు మరో విధంగా అంతరార్థమును ఈ క్రింద విధముగా దెల్పయున్నాడు. భావకులు ఈ విషయమును గూడ గ్రహింపవచ్చును.

విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణుడంటే బుద్ధియనియు, గోవు అనగా చిత్తమనియు, కుక్క అనగా మనస్సు అనియు, ఏనుగు అనగా అహంకారమనియు శ్వపాకుడనగా మనస్సుతో తాదాత్మ్యం పొందిన జీవుడనియు, వీటి అన్నిట ఒకే చైతన్యము పరివ్యాప్తంగా ఉందని, యెరిగి వృత్యధిష్ఠాన బ్రహ్మమును పండితులు దర్శిస్తారు అని చెప్పారు. ఈ విషయం విస్తారముగా తెలియగోరువారు శ్రీస్వారాజ్య భగవద్గీతను చూడవచ్చును.

నీటితో కలిసిన పాలను విభజించి పాలను స్వీకరించు హంసలాగా, పరమహంస పరివ్రాజకాచార్యులైన బ్రహ్మవేత్తలు ప్రకృతిపురుషుల సమ్మిళితమైన నామరూప ప్రపంచంలో నామరూపముల కదిష్ఠానమైన పరబ్రహ్మను మాత్రమే దర్శిస్తారు. "చంపగావచ్చినవారియందు కాళియందు కరవాలము నందు దానచ్యుత భావముంచి అన్నట్లు జడభరతునిలాగా, శత్రుమిత్రులయందు, ఉచ్చనీచములందు సర్వత్రా సమదర్శనం గల్గిన వారే పండితులు.

ఈ శ్లోకమునందు జెప్పబడిన సమదర్శనమనే పదాన్ని సమవర్తనగా భావనజేసుకొని అనాచారాలకు దురాచాలకు దిగిపోరాదు. భావాద్వతమేగాని క్రియాద్వైతముండరాదు. అంతా బ్రహ్మమేగదా అని భార్యలగా పరస్త్రీనిదెచ్చి ఇంట వుంచుకోవడం గాని, కుక్క బ్రహ్మమే ఏనుగు బ్రహ్మమేయని రెండు కుక్కలదీసుకువెళ్ళి రాజుగారి గజశాలలో వదలి రెండు ఏనుగల తీసుకొని రావటంగాని పనికిరాదు. ఇట్టి భావార్థములతో బుద్ధినిపాడుచేసుకొని బుద్ధి భ్రష్టులుగారాదు. కాన భావము అద్వొతంగాను, క్రియద్వ్వయితంగాను గల్గివర్తించవలెనుగాని క్రియా అద్వైతము ఎప్పటికి పనికిరాదు. దానిపట్ల అనర్థం కూడ గల్గుతుంది.

శరీరరములోగల యింద్రియములన్ని నావేగదా అని అస్తవస్తంగా వాడుకోము గదా! కుడిచేయిచేసే పని కుడిచేయే చేయాలె, ఎడమ చేయి చేసే పని ఎడమ చేయిచేయాలె. అలాకాక వుల్టా సీదా చేస్తే వాడిని మతి భ్రష్టునిగా భావించాలె. కాబట్టి ఈ శ్లోకంనందు చెప్పబడిన సమదర్శనం అనే వదాన్ని జాగ్రత్తగా వివేకంతో అర్థం చేసుకొని భావపవిత్రులుగావలయును.

ఉపాధి దృష్టితో రాగద్వేషాలు ఉచ్చనీచ భావాలుగలుగుతాయి. ఉప హితచైతన్య దృష్టితో (బ్రహ్మభావనతో) శాంతిపరమానంద ప్రాప్తి గల్గుతుంది.

**శ్లో॥ ఇహైవతైర్జితసర్గో, యేషాంసామ్యేస్థితం మనః ।**
**నిర్దోషంహిసమం బ్రహ్మ, తస్మాద్బ్రహ్మణితేస్థితాః ॥**

అయ్యా ! అట్టివారి ముక్తి ఎట్టిదంటావా, విను నిర్దోషమగు బ్రహ్మము సమముగునున్నది. వారాబ్రహ్మమునందె నిష్ఠాత్ములైయున్నారు. అందువలన సామ్యబుద్ధిగలపెద్దలు బ్రతికియుండగనే ముక్తులగుచున్నారు.

సమదర్శనులైన మహాత్ములు శరీరముండగనే ముక్తులగుచున్నారు. అందులకే వారు జీవన్ముక్తులు అయినారు. వారు విదేహముక్తులు గాదు. వారిముక్తి అప్పుసొప్పుల బేరం గాదు. నగదు వ్యాపారం లాంటిది. ఇప్పుడు ఈలోకంలోనే ఈ శరీరముతోనే ముక్తిని సాధించిన ముక్తేశ్వరులు.

"నిర్దోషం హిసమం బ్రహ్మ" దోషరహితమైనది బ్రహ్మము. అట్టి బ్రహ్మమును పొందియున్న మహనీయులు కూడ దోషరహితులై బ్రహ్మసమానులైనారు గాన వారికి ముక్తి నిత్యసిద్ధము. బంధమోక్షములు మనో వికారములే గాని, ఆత్మ ఏ వికారం లేనిది నిర్వికారం, కాన గుణదోషాలు ఆత్మకు లేవు. గుణదోషాలు గుణవికారాలు ప్రకృతి రాజ్యములోని వేయగును.

జీవాత్మ పరమాత్మల భేదములు ఉపాధుల దృష్ట్యాగలిగినవేగాని, నిజమునకు జీవాత్మ పరమాత్మ స్వరూపమే. ఘటాకాశం మహాకాశమని ఉపాధిని బట్టేగాని, ఉపాధిని తొలగించిన అంతామహాకాశమే. అధ్యారోపణవలన రజ్జువుపాముగా కన్పించినది గాని, అధ్యారోపము బాధితము కాగా రజ్జువుగా వున్నది వున్నట్లుగనుపించును. ఆవిధముగనే అజ్ఞానము వలన బ్రహ్మమునందు జీవభ్రాంతి గల్గినదిగాని, సమ్యక్ జ్ఞానముచే అజ్ఞానం వైదొలుగగా బ్రహ్మము బ్రహ్మముగానే మిగులును. ఇట్టి విచార జ్ఞాన ప్రభావము వలన దేహభ్రాంతిని విడనాడిన మహాత్ములు అప్పటికపుడే ముక్తులగుచున్నారు.

ముక్తి అనినా మోక్షమనినా! విడుదల దేహము దేహేంద్రియ సంఘాతము, తత్సంబంధమైన భార్య బిడ్డలనే సంసారమునుండి వేరై తన స్వరూప స్థితిని గుర్తెరుగడమే, ముక్తి, దేహాత్మ భావమే బంధము, దేహాతీత నిర్మోహమే మోక్షము. అయ్యా! పార్థా! అట్టి దేహాతీత స్థితి పొందిన మహాత్మునిస్థితిని గురించి ఇంకా విను.

బ్రహ్మమునందు స్థిరత్వబుద్ధి గలిగి, దేహమునందు మోహరహితుడైన బ్రహ్మజ్ఞాని బ్రహ్మమునందె నెలకొనియుండుట బట్టి ప్రియవస్తువుల యందు పొంగి పోవడంగాని, అ ప్రియవస్తువులు సంప్రాప్తించినపుడు కృంగిపోవడంగాని లేదు. ప్రియా ప్రియములు అజ్ఞానికేగాని జ్ఞానికిలేవు. కారణమేమంటావా సర్వప్రపంచమునందు సమభావస్థితిబొందియున్నాడు. అట్టి మహాత్మునికి తనకంటే అన్య సదృశంము మరొకటి లేదనే నిశ్చయ జ్ఞానం పొందినవాడు గాన, ఆ మహాత్ముని దృష్టిలో ప్రియా ప్రియములు అదృశ్యములై పోయినాయి,

స్వప్న ప్రపంచమున గల్గిన హర్షశోకములు మేల్కొన్నవానికి లేనట్లు, అజ్ఞాన ప్రపంచజనులకు గలుగు హర్షశోకములుగాని, ప్రియాప్రియములుగాని, బ్రహ్మజ్ఞానంగల మహాత్ములకు దగ్ధమైపోయినవి. ఈద్వంద్వములన్నియు దేహాత్మబుద్ధి గలిగిన వారికే గాని, దేహాత్మ భావనలేని మహాత్ములకు లేవు అట్టి మహాత్ములు బ్రహ్మస్థితిలో పట్టభద్రులైయున్నారు.

అట్టి మహాత్ములు బహిర్ముఖ విషయములందు విముఖతనొందిన మహాత్ములు అంతర్ముఖ ఆత్మదృష్టితో బ్రహ్మాను సంధాన తత్పరులై అక్షయ సుఖమును పొందగలుగుచున్నారు.

బహిర్ముఖము గల అజ్ఞానులకుగల్గు విషయ సుఖాలు క్షయ సుఖాలు మాత్రం, యింద్రియసుఖాలు ఎప్పటికి అక్షయ సుఖాన్ని యివ్వజాలవు. కమలము క్రిందనే కప్పవుంటుంది కాని అందలి మకరందము యొక్క రుచిని ఆస్వాదించలేదు. తుమ్మెద ఎటునుండియో వచ్చి ఆకమలము నందలి మకరందమును, తనివిదీరగ్రోలును. అలాగే సర్వులు బ్రహ్మస్వరూపులైయున్నప్పటికి, విషయాదులయందుగల విషయవాసనాప్రాబల్యముచే బ్రహ్మముయొక్క అక్షయసుఖాన్ని వారు పొందజాలరు. విషయవిరక్తిగలిగిన మహాయోగులట్టి బ్రహ్మానందరసర్వరూపమైన అమృతమును, గ్రోలి వారు అక్షయ సుఖాన్ని పొందుచున్నారు. విషయములవలన గల్గె సుఖము అల్పమైనది. అనర్థదాయకమైనవి. విషయసుఖాలు అద్యంతములందు కూడ దుఃఖమునే గల్గించును, గాని సుఖమును మాత్రము ఇవ్వజాలవు. కండూతి సుఖమువలె అనుభవించునంతవరకే, తురువాత దుఃఖమునే గల్గించును. కండూతి సుఖమనగా! గజ్జితామర లాంటి వ్యాధిగలవానికి వాడియైన గోళ్ళుతో గోకుచున్నంతవరకు సుఖంగా వున్నట్లు అనిపిస్తుంది. గోకడం మానగానే రక్తసిక్తమైన ఆ బాధ దేవుడే విచారిస్తాడు. అదిగో అట్టిదే ఆ విషయ సుఖాల సుఖము.

"యేహి సంస్పర్శ జాభోగాః, దుఃఖయోనయ ఏవతే " కనకనే వాటిని దుఃఖయోనయ ఏ వతే" అని చెప్పటం జరిగినది. విషయాదుల ద్వారా గల్గే సుఖము (భోగం) భోగం భోగం గాదు భవరోగం. "నతేషు రమతే బుధః" పరతత్త్వజ్ఞానమార్జించిన యోగి వాటియందు మరలు గొనుడు వాటియొక్క ఆద్యంతముల సుఖదుఃఖములగురించి బాగా విచారించి గుర్తెరింగి విరాగమనే అమృతమును సేవించి బ్రహ్మానుభవమనే పరతత్త్వ నిష్ఠలో లీనమైనాడు. సర్వసుఖాలకంటే ఆత్మసుఖము నందు నిమగ్నమైనందున ఆ విషయ సుఖాలు ఆ మహాత్మునియందు నిర్వీర్యములైపోతాయి.

సాధక స్థితిలో గల సాధకుడు ఈ విషయ సుఖవాంఛలను తుదముట్టి నిర్మూలించేంత వరకు వాటి మాయోపాయమును వివేక జ్ఞానముతో నైనను గమనిస్తువుండాలి..

**శ్లో॥ శక్నోతీహైవయస్సోడుం, ప్రాక్శరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం, సంయుక్త సఖీనరః ॥**

అయ్యా! నరోత్తమా! ఈ విషయాలు కాలకూట విషయముకంటే మహాప్రమాదకరమైనవి. విషము తిన్నవాడిని మాత్రమే ప్రాణాలు తీస్తాయి. విషయాలున్నాయే చూచినంత మాత్రముననే వాడిని అమాంతం ఆకర్షించి వలలో వేసుకుంటాయి. వీటి

ధాటికి ఇంద్రుడంతటివాడు చంద్రుడంతటివాడు కూడ ఆహుతై పోయారు. ఇంక సామాన్యుల విషయం చెప్పనక్కరలేదు. కాబట్టి పరమాత్మ పదమార్గము నందు బ్రతికి దేహముండగనే ఈ విషయాదులతో గల్గె కామక్రోధాదుల యొక్క వేగాన్ని అరికట్టాలి అట్టివాడు మాత్రమే పారము ముట్టగలుగుతాడు.

జీవుని బంధానికి ప్రబల కారణం ఈ కామక్రోధాదులే. కామమనగా తనకుయిష్టమైన వస్తువును చూచినపుడు స్మరించినపుడుగలుగు ప్రబలమైన కోరిక. ఈ కోరిక మనసులోవున్నంతవరకు మనిషి మనిషిగా నుండలేడు. వాని మనస్సేమారిపోతుంది. ముఖములో, నేత్రాలలో, ముందున్న ప్రసన్నతే చెడిపోతుంది.

క్రోధమనగా! అట్టికోర్కె గల్గినపుడు దాన్ని పొందవలెనని అనుభవించవలెనని తీవ్రమైన ప్రతిబంధకాలు, కామముతో సత్కర్మనాశనం, చరిత్ర కళంకం, క్రోధంతో జ్ఞాననాశనం, తానార్జించిన శాస్త్రజ్ఞానమంతపలాయనమై పోతుంది. క్రోధావేశంలో చెవులు వినరావు. బుద్ధిపనిచేయదు. కండ్లు గనపడవు. తానేమి చేయుచున్నాడో తనకే తెలియని దుర్గతి పాలైపోతాడు. కావున వీటి విషయములో సాధకుడు చాల జాగ్రత్తగల్గి మెలగవలసి వుంటుంది. ఈ గుణాలు గలిగే పరిస్థితి వరకు సాధకుడు దిగజారక శాంతి శమదయాదులు గల్గి, జీవిత పర్యంతము మెలుకువగల్గి మెలగాలి.

ఈ గుణవేగాన్ని శరీరముండగనే సాధకుడు నిగ్రహించకోగలగాలి. నిగ్రహం గలవానికి భగవదనుగ్రహం కూడతోడై ఈగుణాలపై విజయం సాధిస్తాడు. అట్టివాడే బ్రహ్మానుభవానికి అధికారి కాగల్గుతాడు.

అర్జునా! కామక్రోధాదులనిగ్రహించి నంతమాత్రమే చాలు నా బ్రహ్మానుభవానికి అంటావేమో, ఇదంతా బహిరంగ సాధన దీనికి తోడు అంతరంగిక సాధన కావలయును. అది ఏదంటావా అదే ఆత్మనిష్ట, ఈ నిష్ట కుదరనిదే మోక్షప్రాప్తి సిద్ధించదు. "అ విషయం గురించివిను, ఆత్మయందే సుఖించువాడును, ఆత్మయందె రమించువాడును. ఆత్మయందె వెల్గొందువాడుననగు యోగి బ్రహ్మస్వరూపుడై మోక్షమును పొందుచున్నాడు".

బ్రహ్మము ప్రతివారి స్వరూపమయ్యే వుంది. అదిక్రొత్తగా పొందబడేదిగాదు. అయితే బహిర్ముఖవృత్తిగల్గిన అజ్ఞానులకు అదితెలియబడేదిగాదు. ప్రాపంచిక విషయ సుఖములనుండి విముఖత గల్గి సద్గురు దేవుల కృపావిశేషము చేత అంతర్ముఖము గల్గిన వారికి అది తెలియబడి, అదేతమస్వరూపముగాగల్గి ఆత్మారాములై అంతరంగిక జ్యోతిస్వరూపమైన ఆత్యంతికదుఃఖనివృత్తి, ఆనంద ప్రాప్తిరూరమైన స్వరూపస్థితి బొందియున్నారు. వారి ఆనందానికి అంతములేదు. వారు పొందే ఆనందము శబ్దాది విషయాలతో పొందేది గాదు. లోపలి ఆత్మస్వరూపంతో పొందబడింది. శబ్దాది విషయాదులతో గలిగే ఆనందం ఆనందంగాదు. ఆనాందాభాస, సుఖంవలె భాసించేదుఃఖము.

యెవని చిత్తము బాహ్యవిషయముల గురించి విముఖతపొంది అంతర్ముఖమై ఆత్మస్వరూపమైవుందో అట్టివారే నిజమైన యోగి పుంగవులు.

ముక్తిని అభిలషించేవారికి వుండవలసిన మరికొన్ని లక్షణాలు, సాధన సామగ్రి ఏదో ఆ విషయాన్ని కూడ విను, ఈశ్వరార్పణబుద్ధితో, చేసిన నిష్కామకర్మల వలన క్షీణకల్మషులు అయినవారు. స్వరూపమైన బ్రహ్మనిష్టతో అంతః కరణములోగల వాసనాజాలమునంతటిని నిర్మూలించినవారు. ప్రమాణగత ప్రేమయయగతమైన సంశయనివృత్తి గలిగినవారై, నిశ్చయాజ్ఞాన ప్రభావంతో బ్రహ్మనిష్ట కుదిరినవారు, మరియు పరమాత్మ యందుగల ధ్యానముద్వారా మానసేంద్రియాలను జయించినవారు, సర్వభూతముల యొక్క ఆత్మ తనదిగానెంచి సర్వభూత కోటియందు అపారదయగలవారు. గాననే అట్టివారు ఋషులు అయినారు. ఋషులనగా అంతర్ముఖవృత్తి గలిగిన మహానుభావులు, వారికి బాహ్య ప్రపంచభావం లేదు. రజ్జుజ్ఞానం గలిగిన వారికి సర్పభ్రాంతి లేనట్లు అధిష్టానమైన బ్రహ్మజ్ఞానంతో వారికి ప్రపంచభావన మిథ్యారూపమైపోయినది. ఆ స్థితినే మోక్షమన్న బ్రహ్మనిర్వణమన్న ఆ స్థితిని బొందియున్నారు.

ఆ బ్రహ్మస్థితిని అభిలషించే ముముక్షువులకు ముఖ్యంగా కామక్రోధాదులు ఉండరాదు. వాటివల్ల ముముక్షువుయొక్కమాన సేంద్రియాలను బహిర్ముఖం చేసి నరకంలో బడవేస్తాయి. కావున అర్జునా!

**"కామక్రోధ విముక్తానాం, యతీనాంయత చేతసాం**
**అభితో బ్రహ్మనిర్వాణం, వర్తతే విదితాత్మనామ్ ॥**

కామ క్రోధములను వదలిచిత్తమును జయించిన ఆత్మ జ్ఞానులగు పెద్దలకు బ్రహ్మనిర్వాణము యెల్లడం వెల్లివిరిసివుంది.

అర్జునా! మోక్షాపేక్షగల ముముక్షువులకు రజోగుణ సంబంధమైన ఈకామక్రోధాలు ప్రబశత్రువులు 23వ శ్లోకంలో వీటి వేగాన్ని అరికట్టమని చెప్పియున్నాను. కాని మరొక్కమారు వాటిని గురించి హెచ్చరించుచున్నాను. ఎందుకనగా, మోక్షానికి ప్రతిబంధకాలు ఈ రెండు గుణాలేగాన వీటికి అసలు ఉద్భవించే అకాశముమె లేకుండా చేయదమే శ్రేష్ఠమైన పని.

ఈ గుణములుగల వారికి శమదమాదులు గలుగనేరవు. శమదమాదులు లేనివారికి శ్రవణమననాదులు జరుగవు. ఈ శ్రవణమననాదులే జ్ఞానోత్పత్తికి కారణం అట్టి జ్ఞానమే గలుగనప్పుడు మోక్షం కల్గుటకల్ల. కావున ఇన్ని విధాల ఈ గుణాలు జీవుని నిరోధిస్తాయి. గాన వీటికి హృదయంలో స్థానమే కల్పించరాదు

ఎంతో తపస్సంపన్నుడైన విశ్వామిత్రాది మునులనే ముప్పు తిప్పలు బెట్టి మూడు

చెరువుల నీళ్ళు త్రాగించిన సంగతి చెప్పనక్కరలేదు. "యతీనాం యతచేసాం" యతియనగా అంతః కరణమునందలి సర్వే సమస్తమైన విషయవాసనలు పోనడంచినసన్యాలు మరియు వారు విదితాత్ములు అంతర్ముఖనిష్టయందు నిష్ఠ కుదిరిన మహాత్ములు గాన వారికి బ్రహ్మనిర్వాణం స్వతస్సిద్ధమైనది.

తే॥ పరమతృష్ణను భయదవైతరణిగ
గామమును ఘోరతర నరకంబుగ
దారుణ క్రోధమును దండ ధరునిగాగ
జూచు నాతండు నిర్వాణ సుఖము నొందు.

అని సీతారామాంజనేయ సంవాదము, ఆశగల సన్యాసి పారం ముట్ట లేడు. అది వైతరణీవంటి నరకయాతన కామాభిలాషలు సన్యాసి మనుగడ నరకానికి పోవుటతథ్యము, క్రోధముగల సన్యాసి పరమచండాలునితో సమానం, అదే వాని పాలిటి కాలుడు. ఈమూడు గుణాలు లేని సన్యాసి మాత్రమే బ్రహ్మ నిర్వాణమును పొందుటకు సమర్థుడు. మరియు అట్టి యతీశ్వరుని గుణాల గొప్పదనాన్ని విను.

క॥ శాంతివరకామధేనువు
సంతోషమెకల్పలత విషయ విరతియగున్
జింతామణియని నెమ్మది
జింతించునతండు సుఖము జెందు బుధేంద్రా

కామధేనువు, కల్పవృక్షము, చింతామణి ఈమూడు చేకూరిన వారికి సమస్త సుఖముల నొసంగునట్లు, యతియైన మహాత్మునికి విషయ వైరాగ్యము. బ్రహ్మజ్ఞానము, చిత్తశాంతియను మూడుగుణములు ముక్తునిగా జేయును.

ముక్తి స్వరూపమైన మోక్షస్థితికి కావలసిన ధ్యాన యోగమును, ముందు జెప్పుచు ఆధ్యాన ప్రధానమైన అంతరంగిక సాధనలగురించి రెండు శ్లోకాలద్వారా భగవానుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ స్పర్శాన్ కృత్వాబహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరేభ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతర చారిణౌ (27)

శ్లో॥ యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్ష పరాయణః
విగతేచ్ఛాభయక్రోధః యస్సదాముక్త ఏవసః ॥ (28)

అయ్యా! అర్జునా మోక్షాపేక్షగల సాధకుడు బాహ్యావిషయచింతనవదలి, భ్రూ మధ్యమున దృష్టిని నిలిపినాసికాపుటములందు వర్తించు ప్రాణాప్రాణములను గమనించుచు.

ఇంద్రియమనోబుద్ధులను నిగ్రహించి, ఇచ్ఛ భయము క్రోధములను విడనాడి మోక్షాపేక్షచేత మౌనము గల్గిన మునికి ముక్తి నిత్యసిద్ధమై యున్నది.

మోక్షసాధకుడు బాహ్య సంబంధమైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైన విషయములందు యత్కించిక కూడ మనసునుంచరాదు. బాహ్య విషయములను హృదయములో ప్రవేశింపక భ్రూ మధ్యమున దృష్టిని నిలిపి నాసికా పుటముల గుండా వచ్చిపోయెడి ప్రాణాప్రాణములందు మనస్సును కేంద్రీకరించి పరతత్త్వ స్వరూపమైన పరమాత్మను ధ్యానించవలయును.

ఈధ్యాన సమయమున మనోబుద్ధి చిత్తములను హృదయమునుండి చెదరనీయక నిగ్రహించవలెను. పూర్వవాసనా బలముచే, విషయములపైకి పోవనున్న ఇంద్రియ మనంబులను అభ్యాస ప్రాబల్యమున వాటిని నిగ్రహించిననే గాని ధ్యానము కుదురదు.

సాధకుడైనవాడు తాను సాధన చేయుస్థలము ఏ విధమైన భయమునకు ఆస్కారముగానుండరాదు. కొండ గుహలయందుగాని, అరణ్యమునగాని, వనాంతరములగాని పాత దేవాలయములందు గాని, నదీతటములుగాని, ధ్యాన సాధనకు మంచివి. అయినా! అట్టిచోట్ల తేళ్లు పాములు క్రూర జంతువుల భయములగనట్టి దిగయుండవలెను. ఎందుకనగా అట్టిచోట ధ్యానము కుదురక సదామనసు బహిర్ముఖమై పోవుచుండునుగాన అట్టి భయమున కాస్కారములేని నిర్భయస్థలమును సాధకుడు ఎన్నుకొనవలయును. తనకు కావలసిన భిక్షకు కూడ అనుకూలమై ఉండవలయును.

ధ్యానమునకు ప్రక్రమించు స్థలము కూడ పరిశుద్ధముగా నుండవలెను. తేమ, దోమలు, చీమలు లేనిదై ఎత్తుపల్లములు లేక సమముగా నుండు స్థలముగా నుండవలెను. లేకున్న ధ్యానసమయమున దోమలు, చీమలవలన చిరాకు చంచలత కోపముగల్గు అవకాశములు ఏర్పడి, సమాధి నిష్ఠకు భంగకరము గల్గించును. లేక అవకాశముగల ఇంటియందైనను లేదా చక్కటి మందిరము నందైననుపై చెప్పిన చీమలు దోమలు లేక, చక్కటిగాలి గల్గిన స్థలము నైనను కావచ్చును. మరియు ధ్యాన స్థలము శబ్దములకు ఇతరుల మాటల వలన గల్గెడు అలజడిలేనిదై ప్రశాంతమునకు భంగములేనిదిగానుండవలెను. ధ్యాన సమయమున మనస్సు ఏకాగ్రత జెందుకొలది అతి స్వల్పమైన శబ్దము కూడ మనస్సుకు చికాకు గల్గించును. కాన శబ్దములు లేని ఏకాంత నిర్జన ప్రదేశమైనవే ధ్యానమునకు అనుకూలమై యుండును. సాధకుడు సిద్ధి పర్యంతము మౌనము గల్గి సర్వదా ఆత్మచింతనయందే ఉండవలెను. ఇతరులచే మాటలు గల్గియున్న విక్షేపాదులు గల్గును. మాటలవలననే సంకల్పములు గల్గునుగాన సాధ్యమైనంత వరకు సాధకుడు ధ్యానమునకు భంగకరమగు వాచాలత్వమును, విడచి మౌనముగా నుండుట బహుళ శ్రేయోదాయకము.

చెరువుల నీళ్ళు త్రాగించిన సంగతి చెప్పనక్కరలేదు. "యతీనాం యతచేసాం" యతియనగా అంతః కరణమునందలి సర్వే సమస్తమైన విషయవాసనలు పోనడంచినసన్యాలు మరియు వారు విదితాత్ములు అంతర్ముఖనిష్టయందు నిష్ఠ కుదిరిన మహాత్ములు గాన వారికి బ్రహ్మనిర్వాణం స్వతస్సిద్ధమైనది.

తే॥ పరమతృష్ణను భయదవైతరణిగ
గ్రామమును ఘోరతర నరకంబుగ
దారుణ క్రోధమును దండ ధరునిగాగ
జూచు నాతండు నిర్వాణ సుఖము నొందు.

అని సీతారామాంజనేయ సంవాదము, ఆశగల సన్యాసి పారం ముట్ట లేడు. అది వైతరణీవంటి నరకయాతన కామాభిలాషలు సన్యాసి మనుగడ నరకానికి పోవుటతథ్యము, క్రోధముగల సన్యాసి పరమచండాలునితో సమానం, అదే వాని పాలిటి కాలుడు. ఈమూడు గుణాలు లేని సన్యాసి మాత్రమే బ్రహ్మ నిర్వాణమును పొందుటకు సమర్థుడు. మరియు అట్టి యతీశ్వరుని గుణాల గొప్పదనాన్ని విను.

క॥ శాంతివరకామధేనువు
సంతోషమెకల్పలత విషయ విరతియగున్
జింతామణియని నెమ్మది
జింతించునతండు సుఖము జెందు బుధేంద్రా

కామధేనువు, కల్పవృక్షము, చింతామణి ఈమూడు చేకూరిన వారికి సమస్త సుఖముల నొసంగునట్లు, యతియైన మహాత్మునికి విషయ వైరాగ్యము. బ్రహ్మజ్ఞానము, చిత్తశాంతియను మూడుగుణములు ముక్తునిగా జేయును.

ముక్తి స్వరూపమైన మోక్షస్థితికి కావలసిన ధ్యాన యోగమును, ముందు జెప్పుచు ఆధ్యాన ప్రధానమైన అంతరంగిక సాధనలగురించి రెండు శ్లోకాలద్వారా భగవానుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ స్పర్శాన్ కృత్వాబహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరేభ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతర చారిణౌ (27)

శ్లో॥ యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్ష పరాయణః
విగతేచ్ఛాభయక్రోధః యస్సదాముక్త ఏవసః ॥ (28)

అయ్యా! అర్జునా మోక్షాపేక్షగల సాధకుడు బాహ్యవిషయచింతనవదలి, భ్రూ మధ్యమున దృష్టిని నిలిపినాసికాపుటములందు వర్తించు ప్రాణాప్రాణములను గమనించుచు.

చేస్తున్నప్పటికి ఈ కర్మలు నేను చేయుచున్నాను. ఆ కర్మల వలన లాభము కలుగును. లేక పేరు ప్రతిష్ఠలు నాకుగల్గును అను సంకల్పములు లేక భగవద్భావనా పరుడై కర్మలనాచరించుటచేత అట్టి కర్మలు బంధము కల్గించజాలవు. సరికదా బంధవిముక్తికి దోహదము గావించును.

పనసపండును కోయువాడు చేతులకు నూనె రాసుకొని పండు కోయుట చేత ఆ పండుయొక్క బంక చేతలకంటనట్లు సంగత్వబుద్ధిలేక నిస్సంగత్వముతో ఆచరించు కర్మలు కూడా కర్తకు ఆ కర్మలేపనము కలిగించవు. ఇదియే గీతలో భగవానుడు జెప్పు కర్మకౌశలము.

ఈ శ్లోకమునందు "కార్యంకర్మ" అని జెప్పుటచేత చేయవలసిన శాస్త్రీయమైన కర్మలనేగాని అశాస్త్రీయమైన పాపహేతువైన సిగ్గుచేటు గల్గించే పనులుగాదని గ్రహించవలెను. ఫలాసక్తి లేక ఏ కర్మనైనా చేయవచ్చుగదా అని అశాస్త్రీయమైన పాపభూయిష్టమైనవి, పరులకపారమైన సంఘవిధ్వంస కర్మలలో పడిపోకూడదు. అట్టి అస్త్రీయ కర్మలు తనకేగాక దేశానికి, సంఘమునకు కూడా సర్వానర్థములను గల్గించును. కావున చేయవలసిన కర్మలను మాత్రమే ఇక్కడ " కార్యంకర్మ" అని భగవానుడు సూచించెను.

అట్టి " కార్యంకర్మ " లైనప్పటికి అనగా చేయవలసిన శాస్త్రసమ్మతమైన కర్మలు అయినప్పటికి ఫలాసక్తి, కర్తృత్వబుద్ధి లేక చేయుటే నిజమైన సన్యాసం అని తెలియవలెను.

కర్మలలో ఫలాసక్తి కర్తృత్వబుద్ధి లేదుగాన అట్టివాడు యోగి అయ్యాడు. హృదయములో సంకల్పవృత్తి లేనివాడు సన్యాసి అయ్యాడు. కర్మయోగికి ఫలాసక్తి వదలిన దానివలన విక్షేపమైన మనస్సంకల్పలేదు. ఈ విధంగా చూచినట్లైన సన్యాసం, యోగం రెండు సమానమే నని భగవానుడు రెండింటిని సమన్వయం చేసిచూపాడు.

నిజమునకు విచారించినచో కర్మలోకంటే మనం వుంచుకొన్న భావనే బంధానికి. బంధవిముక్తికి కారణమైనవుంది. ఫలాసక్తితో చేసిన కర్మ బంధానికి ఫలత్యాగంతో చేసిన కర్మబంధ విముక్తికి దోహదం కాగలదు.

ఒకే తాళంచెవి ఒకవైపు త్రిప్పిన తాళం బంధింపబడుతుంది. మరోవైపు త్రిప్పిన విడిపోతుంది. బంధానికి తాళం విడిపోవుటకు ఒకేతాళం చెవి కారణం. బంధమోక్షాలకు కారణం మనస్సే. మనస్సుయొక్క భావనా ప్రభావంబట్టే బంధమోక్షాలు ఆధారపడి యున్నవి. ఫలాసక్తిగల మనస్సు బంధానికి హేతువైతే ఫలాసక్తిలేని మనస్సు మోక్షానికి కారణం కాగలదు. కావున ఫలాసక్తి లేక చేయు కర్మ సన్యాసానికి సమమౌతుంది.

అయ్యా ! పాండునందనా ! సన్యాసమనినా యోగమనినను అర్థమొకటియే. ఎందుకంటవా ! ఈ రెండింటియందు సంకల్ప త్యాగమే ప్రధాన కారణం. సంకల్ప త్యాగంలేనివాడు యోగికాడు, సన్యాసియుగాడు.

యోగం అంటే చేయుట. సన్యాసం అంటే త్యాగము. ఈ రెండింటికి నిప్పుకు నీరుకు పొత్తు కదరదే అని సందేహిస్తావేమో యోగి తాజేయు కర్మలలో ఫలత్యాగంవుంది. ఫలత్యాగ ప్రభావంతో విక్షేపమైన సంకల్పవృత్తిని జయించాడు గాన యోగికూడా సన్యాసత్యాగ ఫలాన్నే పొందుచున్నాడు. ఇద్దరు వేషములలో వేరుగా కనిపించిన లోపల ఇద్దరు ఒకే ఫలితాన్ని పొందుచున్నారు.

పారమార్థికరంగములో పయనించు ప్రతివారికి త్యాగం అవసరము. ఈ త్యాగం లేనిదే పరమార్థ స్థితిలో ముక్తిని పొందుట దుస్తరము. యోగికైనా, జ్ఞానికైనా, భక్తునికైనా ఎవరికైనా సరే ఏదోఒక రూపేనా ఈ త్యాగం వుండి తీరవలసిందే. యోగియైన వాడు తాజేయు కర్మలయందు కర్తృత్వమును ఫలాసక్తిని త్యాగంచేసి యోగి అయ్యాడు. జ్ఞాని అయినవాడు తనకన్నా విలక్షణముగా వున్న దృశ్యమునందు, తన దేహాదిసంఘాతమునందు, త్యాజ్యబుద్ధిగల్గి వాటన్నిటికి తాసు సాక్షి మాత్రుడననే త్యాగంతో జ్ఞాని అయ్యాడు. ధ్యానయోగి బహిర్ముఖవృత్తులన్నిటి త్యాగం చేయవలసివుంది. అలాగే భక్తుడైన వాడు కూడాను. ఇళ్ళు వాకిళ్ళపైన, ఆలుపిల్లలపైనా, కీర్తిప్రతిష్ఠలపైన ప్రీతిని త్యాగం చేసి భక్తుడయ్యాడు. ఇలాగ వారువారు అనుసరించిన మార్గమేదైనా త్యాగమనేది సర్వత్రా ఉండితీరవలసిందే. "త్యాగానశాంతిః" ఆ త్యాగమున్నపుడే శాంతి.

మరియు రాగద్వేషములు అను రెండు గుణాలు సర్పానికి విషదంతములలాగా కర్మకు ప్రధానమైన గుణాలు. విషదంతములను తీసిన పాము ప్రమాదరహితమైనట్లుగా రాగద్వేషరహితిమైన కర్మ కర్మకాదు. యజ్ఞముగా మారుసు. అట్టి యజ్ఞరూపమైన కర్మపాపపమును ప్రక్షాళను చేసి చిత్తశుద్ధిని కల్గించి మోక్షమార్గమున ముందుకు నడిపించును.

అయితే ఈ కర్మలు ఎంతవరకు అనుష్ఠించడం. బ్రతికినంత కాలం చేయవలసినదేనా? లేక వీటికేమైన ఒక అవధి అనేదిలేదా అని అందువా ప్రతిదానికి ఒక అవధి అనేది వుండనేవుంటుంది. బాటనడుస్తున్న బాటసారికి గ్రామము చేరగానే బాట అదృశ్యమైనట్లు, గ్రంథపఠను చేస్తున్నవానికి నిద్రరాగానే చేతిలో గ్రంథము దానిపాటికది జారిపోయినట్లు, పరమార్థ రంగములో గూడా ఆరూఢ స్థితి పొందగనే కర్మపాటికి కర్మ జారిపోతుంది. గమ్యం చేరు వరకు బాటననుసరించడం ధర్మం. వంట అయ్యేవరకు మంట అవసరము. అలాగే ధ్యాన యోగపరుడైన యోగికి సిద్ధి పొందువరకు సాధన ప్రక్రియ రూపమైన కర్మ అవసరమయ్యేయున్నది. సిద్ధిని పొందకనే సాధన వదలి వాడు భ్రష్టుడగును. అట్టివారు ఇహపరములయందు శాంతిని పొందలేరు. పూర్ణశాంతి కాముకుడు పూర్ణస్థితి వరకు సాధన చేయవలసియుండును. ఒకమారు రమణ మహర్షి దగ్గరకు ఒక విదేశీ భక్తుడు వచ్చి స్వామీ నేను బహుకాలము నుండి జపము చేయుచున్నాను. ఇంత ఎంతకాలం జపం చేయవలయునని ప్రశ్నించాడు. అందుకా రమణమహర్షులవారు మందహాస

వదనారవిందంతో నేను జపము చేయుచున్నాను అనే భావం పోయేవరకు చేయవలయునని సమాధానమిచ్చారట. కావున నేను అనే అహంకారము ఉన్నంతవరకు కర్మ విడువరాదు. మోక్షకామియైన వానికి దేహాత్మ భావన నశించేవరకు కర్మసాధనంగా జెప్పబడినది, అరూఢస్థితి ముక్తి బొందిన మహానుభావునికి, శమము ప్రధానంగా జెప్పబడియున్నది. అట్టి ముక్త పురుషులనుండి కర్మదాని పాటికదే జారిపోతుంది.

అర్జునా ! సాధకస్థితిలో కర్మ చిత్తశుద్ధికి కారణమౌతుంది. సిద్ధావస్థలో ఒకవేళ ప్రారబ్దబలంతో కర్మ జరిగినా లోక శ్రేయస్సుకు దోహదం కాగలదు. కావున కర్మత్యాజ్యము చేయుటకంటే ఈశ్వరార్పణంగా కర్మలాచరించుట ఇహపరములలో కూడా శాంతిని ప్రసాదిస్తుంది. అట్టి యోగరూఢత్వము సాధకునకు గల్గుట ఎన్నడనిని

**శ్లో॥ యదాహినేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్జతే**
**సర్వసంకల్ప సన్యాసీయోగారూఢ స్తదోచ్యతే ॥**

పార్థా ! యోగము నధిరోహించునున్న యతి, ఎపుడు శబ్దాది విషయములందును, కర్మలయందును, తగుల్కొనక సకల సంకల్పములను వదలుచున్నాడో అపుడు యోగారూఢుడని చెప్పబడుచున్నాడు.

యోగారూఢత్వమునకు అవధి మూడు గుణాలు జెప్పబడినాయి. (1) బాహ్యాశబ్ద స్పర్శరూప రసగంధాదలులయందు ఆశ జనించకుండుట, (2) కామ్యకర్మలయందు ఇచ్ఛ జనించకుండుట (3) సర్వసంకల్పములు నశించుట అను ఈ మూడు గుణములు గల్గినవారికి యోగారూఢత్వము సిద్ధించుచున్నది.

ఇంద్రియములకు శబ్దాది విషయములందుగల వాసన చాలాగొప్పది. ఇది అంతంతైన వారిని వదిలే దెయ్యముగాదు. ఈ విషయాభిలాపలో తగుల్కొనిన జీవి పారమార్థిక రంగమున పనికిరాదు. శబ్దముచేత జింక, స్పర్శచేత ఏనుగు, రూపముచేత, ......, రసముచేత చేప, గంధముచేత తుమ్మెద ప్రాణములను గోల్పోవుచున్నవి. ఒక్కొక్క విషయ వాసనా ప్రాబల్యముననే ఆ జీవులు ప్రాణములు గోల్పోవుచుండ, ఈ ఐదు విషయములకు జిక్కిన మూఢ మానవుని సంగతి చెప్ప పనేలేదు. " మూఢాజన్మని జన్మని " అని అట్టివాడు జననమరణములను సంసార చక్రమున ఏంతంబానలాగా ఊర్ధ్వ అధోలోకాలు తిరుగుచుండ వలసినదే. కావున యోగ మార్గమున చరించుయతి, సుతరాం వీటిని తన సమ్యక్జ్ఞాన ప్రాబల్యమువలన గల్గిన వైరాగ్యముచే వాటియందు విరక్తి గల్గియుండవలెను.

సర్వకర్మలకు సంకల్పమే మూలము. సంకల్పములేనిదే కర్మలు జరుగవు గావున అట్టి సంకల్పములన్నిటిని సర్వాధిష్ఠానమైన పరమాత్మయందు మనసు లగ్నము చేయుటచే సంకల్పములన్నియు పరమాత్మయందే లయించి పోవును.

సంకల్ప శూన్యుడైన యతియందు ఎట్టికర్మలు జరుగుటకు వీలులేదుగాన కర్మలు కూడా జ్ఞానధ్యానాగ్నిలచేత దహింపబడి పోయినాయి, గావున యోగము రూఢత్వము సిద్ధించినది.

సీ॥ స్థూలశరీరంబు సుస్థిరంబుగనుండు
సకలేంద్రియములుపశాంతి జెందు
సన్మనః పవనముల్ సంచలింపకయుండు
గామాది శత్రువర్గమునశించు
స్ఫురదమానిత్వాది సుగుణముసతమ కూరు
ఘనగుణాతీత లక్షణము లొదవు
బొలుపారు వైరాగ్య బోధపరతులు సం
పూర్ణంబులై మది బొదలు చుండు

తే॥ బరమ సుఖవార్ధి యుప్పొంగి పొఱుచుండు
ముందటవసించు మోహించి మోక్షలక్ష్మి
సంశయములేక దృఢముగా సంతతంబు
సర్వమును బ్రహ్మమని చూచూశాంతినిధికి

ప్రపంచము బ్రహ్మముకంటే భిన్నమని తలంచుటకు అజ్ఞానమే కారణము. మట్టిని విడిచి కుండలు, బంగారమును విడిచి అభరణములు వేరుగానట్లు బ్రహ్మముకన్న ప్రపంచము వేరుగాలేదు. రజ్జువునందు సర్ప భ్రాంతి అప్తవచనములచే వైదొలుగగా రజ్జువురజ్జువుగా కన్పడునటుల సమ్యాక్జ్ఞాన బ్రహ్మదృష్టితో నుండు మహాత్ముని సర్వసంకల్పములు సమసిపోయినందున యోగరూఢస్థితి సిద్ధించినది. అట్టి మహాత్ముని శరీరం నిశ్చలముగా నుండును మరియు అట్టి మహాత్ముని జ్ఞానకర్మేంద్రియములు సైతము తమతమ వ్యాపారములమాని నిశ్చలముగా నుండును. ఆ బ్రహ్మవేత్తకు కామ, క్రోధ, లోభ, మోహ, మదమత్సరములైన అంతఃశత్రువులు నశింతురు అహంకారమనునదిలేక వైరాగ్యపు ఉపరతులు అధిగమించియుండును. అందువలన బ్రహ్మభావమున ఏ విఘ్నములు లేక పరిపూర్ణుడైయుండి బ్రహ్మానంద సాగరమున నోలలాడుచుండును. అట్టివారి ముందు మోక్షలక్ష్మి ముక్తికాంత మోహించి ముందుట నిలుచును అని దెల్పబడియున్నది.

అధిష్ఠాన వస్తువును గుర్తెరింగిన ఆరోపిత వస్తువులు మిథ్యాభూతములై పోవునట్లు అఖండాకార బ్రహ్మదృష్టి గల్గిన మహాత్మునికి సర్వనామ రూపప్రపంచము జడసంఘాతమైన శరీరము. మానసాది ఇంద్రియములెల్ల మిథ్యాభూతమై పోవును. అట్టి స్థితియే యోగారూఢము అని చెప్పబడినది.

సంకల్పములులేని నిస్సంకల్ప స్థితియే యోగారూఢస్థితి. సంకల్పములు వికల్పములు అంతఃకరణ ధర్మములేగాని ఆత్మధర్మములుగావు. ఆత్మ అచలం, స్వప్రకాశం సర్వసాక్షి, సర్వద్రష్టిగాన ఆత్మారాముడైన యోగారూఢుని ఇవన్నియు స్పృశింపజాలవు.

ఆత్మ సర్వప్రాణులయందు పాలలో నేతివలెను, నువ్వులలలో నూనె వలెను, సమిధలయందు అగ్నివలె సర్వప్రాణులలో సర్వత్రావుంది. అట్టి ఆత్మను పొందుటకు అందరికీ హక్కువుంది. అట్టి ఆత్మజ్ఞానం పొందుట ప్రతి మానవుని కర్తవ్యమైయున్నది. అసలు ఆత్మజ్ఞాన నిమిత్తమయ్యే జన్మపొందబడియున్నది. అట్టి ఆత్మజ్ఞానమునకు అర్హమగు జన్మను సదుపయోగపరుచు కొన్నవాడే ధన్యుడు. అట్టివాడే పురుషులలో పుణ్యపురుషుడు.

మానవుని తారకంగాని మారకంగాని తనపైననే ఆధారపడివుంది. పరులెవ్వరో తన్ను ఉద్ధరించగలరని దేబరించుకొని యుండుట పాడిగాదు. తన వుద్ధారకం, వున్నతి, తనపైననే ఆధారపడివుంది. శాస్త్రములు, గురువులు, మార్గం చూపగలవారెగాని ఆ మార్గమున పయనించి గమ్యం చేరవలసింది తానే.

**శ్లో॥ ఉద్ధరేదాత్మనా త్మానం, నాత్మానమవసాదయేత్**
**ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః**

పరంతపా పరాకులేక విను, తన్నుతానుద్ధరించు కొనవలెను. తన్నుతాను అధోగతిపాలు చేసుకొనరాదు. తనకుతానె బంధువు తనకు తానే శత్రువు. తన మంచిచెడ్డలకు తానే కారకుడు.

బైట తనకెవరో బంధువులున్నారుకొనుట సుతరాం పొరపాటు. తన అదుపు దప్పిన మనస్సే శత్రువు. "మార్గంబుదప్పి వర్తించు చిత్తంబు కంటే వైరులెవ్వరు చిత్తంబు వైరిగాక, చిత్తమును నీకు వశము జేయువయ్యా" అని భాగవతం బయట శత్రువులకంటె అంతఃశత్రువులైన సంస్కారములేని మనస్సు గొప్ప శత్రువు. దీని శత్రుత్వము జన్మజన్మలను నాశనం చేయును.

శుద్ధం చేసిన పాదరసం సర్వరోగ నివారకమైనట్లు తవచే శుద్ధీకరించబడిన మనసు, సర్వానర్థములను తొలగించి స్వర్గసుఖాలనేగాక ముక్తిని గూడా గల్గించును. తనకు వశవర్తిగాని దుష్టమనస్సు సర్వానర్థకారిణియై జీవుని నరకమున బడవైచును.

అన్నిటికీ మనస్సే కారణం, బంధ మోక్షములకు ఈ మనస్సే కారణం. తనచే నిగ్రహింపబడిన మనస్సు బంధువుకంటే నెక్కువగానుపకరించగలదు. " మనన శీలమే మానవత్వం. పవిత్రతతో సాధించరాని పనులేలేవు. మనః పవిత్రతవలననే బృహస్పతి దేవతలకు గురువయ్యాడు. మనఃపవిత్రవల్లనే సావిత్రి నరకాన్ని సైతం స్వర్గలోకంగా మార్చింది. మనః పవిత్రతవలననే అనసూయ త్రిమూర్తులైన లోకపాలకులను పసిబిడ్డలు

జేయగలిగింది. మనః పవిత్రతవలననే సుమతి సూర్యోదయాన్ని సైతం ఆపగలిగింది. మనః పవిత్రతవలననే భూజాత జానకిదేవి అగ్నిగుండమున ప్రవేశించి తిరిగిరాగలిగినది. మనోపవిత్రతవలననే ధర్మరాజు శరీరముతోనే స్వర్గలోకం పోగలిగాడు. మనః పవిత్రతకు సాటిరాగల శక్తి త్రిభువనములందులేదు. "ఇంద్రియాణాం మనశ్చాస్మి" అని భగవానుడే చెప్పడం జరిగింది. ఇంద్రియములలో అలాంటి మనస్సు విషయాసక్త ప్రభావముతో జీవునికి మారకమైపోయింది.

మానవ జీవితపు మనుగడ అంతయు ఈ మనస్సుపైననే ఆధారపడియున్నది. ఎవరి మనస్సు నిగ్రహింపబడి తన వశవర్తియైయున్నదో అట్టివారి మనుస్య కామధేనువు వలె కల్పవృక్షమువలె చింతామణి వలె సర్వానందకరమై శాంతిని ప్రసాదించును.

ఎవరి మనస్సు నిగ్రహింపబడక విషయాదులలో ప్రవర్తించునో అట్టివారి మనస్సు అదుపు దప్పిన రథము ప్రక్కకు పోవునట్లు నరకమున బడవేయును. కావున మనోనిగ్రహముకంటే మించినది వేరొకటిలేదు.

శత్రుమిత్రులు బైట ఎక్కడోలేరు. మనలోనే వున్నారు. మనచే జయించబడిన మనస్సు బంధువుకంటే ఎక్కువగా ఉపకారం చేస్తుంది. మనచే నిగ్రహంపబడని మనస్సు శత్రువుకంటే మహా అపకారం చేస్తుంది. కావున బైట శత్రువును జయించడం గొప్పకాదు లోన మనస్సును జయించుటే గొప్ప. మనోజయం గల వానికి ప్రపంచమే పాదాక్రాంతమౌతుంది. మనస్సుకు లోబడిన వానికి తోబుట్టువులు, కన్నబిడ్డలు కట్టకొన్న భార్యకూడా దూరమౌతారు.

మనస్సుకు అధిష్ఠాన దేవత చంద్రుడు. ఎవరి మనస్సు చంద్రునివలె చల్లగా శమం గల్గివుంటుందో అట్టివారు లోకమును సైతము జయించగలుగుతారు. ఎవని మనస్సు కామ క్రోధములతోకూడి ఉంటుందో అట్టివాని మనస్సు భస్మాసురునిలాగా కాలిన యినుములాగా తన్నే దహింపచేస్తుంది.

బ్రాలప్రహ్లాదుడు. బాలధ్రువుడు మనస్సును భగవదర్పితం చేసి లోక పూజ్యులయ్యారు. ఎవరి మనస్సు బుద్ధికి వశవర్తియై ఆ బుద్ధి ఆత్మపరమై వుంటుందో అట్టివారే మహాత్ములు. ఎవరి మనస్సు ఇంద్రియముల వశమై, ఆ ఇంద్రియులు విషయాదులపైకి పరిగిడితే వాడే దురాత్ముడు పాపాత్ముడౌతాడు.

కావున అర్జునా, మనః ప్రభావమును గుర్తెరింగి మనసును జయించిన ఏ మహాత్ములైతే గలరో అట్టి వారు శీతోష్ణాదులకుగాని, మానాపమానముకుగాని, సుఖదుఃఖములనుగాని కలతజెందక పరమాత్మయందు నిలిచి పరమానంద భరితులైయుందురు. ఇందుకు ప్రహ్లాదుని చరిత్రే మనకు నిదర్శనము. హరినామ స్మరణ మానమని తండ్రిపెట్టిన కష్టములన్నియు ప్రహ్లాదునియందు కఠినమైన శిలపై కొట్టెడి కత్తి వేటులవలె

నిష్ప్రయోజనమయి పోయినాయి, రాక్షసులు ప్రహ్లాదుని కొండశిఖరములనుండి దొబ్బారు. సముద్రములయందు ముంచారు, అగ్నిచే దిహించరు. కత్తులచే నరికారు, పాములచే కరిపించారు. విషం ద్రావించారు. ఏనుగలచే త్రొక్కించారు కాని హరిపదాయత్తమైన ప్రహ్లాదుని చిత్తాన్ని అణుమాత్రం పైరవి ఏవీ కూడా నొప్పించ లేకపోయాయి.

పరమాత్మ యందు సమాయత్త చిత్తమైన మీరాబాయికి విషం ద్రావించారు. కాని విషము ఏమి చేయలేకపోయింది. "పరమాత్మ సమాహితః" బాహ్యప్రపంచమునుండి, మనస్సును మరలించి పరమాత్మయందుంచబడి ప్రశాంతినొందిన మనస్సును ఎట్టి ద్వందములు కూడా కంపింజేయజాలవు.

అయ్యా అర్జునా ! యోగారూఢుని గురించి వింటున్నావు. ఆ మహోత్ముని ఆత్మవైభవము మరికొంత వినుము.

" జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతేయోగీ సమలోష్టాశ్మకాంచనః ॥

శాస్త్రీయ స్వానుభవ జ్ఞానములతో తనివి పొందినవాడు. మట్టి, రాయి, బంగారములయందు, సమభావముగలవాడును, నిర్వికారుడును, జితేంద్రియుడును, నగువాడె యోగారూఢుడని చెప్పబడును.

సామాన్య మానవులందరికి బాహ్యావిషయంలతో తృప్తిగల్గుతుంది. కాని యోగారూఢుని విషయమైతే జ్ఞానవిజ్ఞానములతో తృప్తిపొందుతాడు. వారికి విషయానందం విషంగా తోస్తుంది. జ్ఞానమనగా శాస్త్రమనగా శాస్త్రజ్ఞానం, విజ్ఞానమనగా! అనుభవజ్ఞానము, శాస్త్రజ్ఞానము ఎంతవున్నా అది అనుభవానికి రానపుడు అది భుక్తియే, నతుముక్తియే, అన్నట్టు అట్టి శాస్త్రజ్ఞానం పూర్ణఫలదాయకం కాలేదు. అణుభవ జ్ఞానం గల్గినపుడే శాస్త్రీయజ్ఞానానికి కూడా సార్థకత చేకూరగలదు. సద్గురువుల సన్నిధానములో మహావాక్యముల శ్రవణము చేయుటచే పరోక్ష జ్ఞానమును గల్గించును. అట్టి పరోక్ష జ్ఞానము గల్గినపుడు మాత్రమే ఆ జ్ఞానము ఆత్మతృప్తిని గల్గిస్తుంది. అనగా అధిష్ఠానమైన బ్రహ్మమును గుర్తెరింగినపుడు, ఆరోపితమైన జగద్భ్రాంతి పూర్తిగా నశించుటచే అట్టివాడు పూర్ణానాందమును పొందుచున్నాడు.

"కూటస్థో విజితేంద్రియః" కూటమనగా ఆత్మ, ఆత్మను దర్శించినాడు, ఆత్మ అయ్యే వున్నాడు. పాలలోపాలు, నీళ్లలో నీళ్లు, నూనెలో నూనే, సముద్ర జలంలో ఉప్పురాయి కలిసిపోయినట్లు, యోగారూఢుడు, "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మను పొందినవాడు. బ్రహ్మమయై వున్నాడు. అట్టి బ్రహ్మమును పొందినవాని ఇంద్రియమను శత్రువులపై విజయభేరిని ప్రయోగించాడు. అట్టి మహాత్ముని మనసును మరులుగొల్పి

విషయాదులెవ్వియులేవు. "దృష్టంజ్ఞానమయం కృత్వాపశ్యేత్ బ్రహ్మమయం జగత్" అన్నట్లు అట్టి మహాత్ముని దృష్టి బ్రహ్మదృష్టిగాన, ఆయన దృష్టిలో ఇది రాయి గాని, ఇది బంగారు అనిగాని భేదములేదు. కంసాలివాని దృష్టిలో సర్వాభరణము అందు బంగారు దృష్టిగల్గియున్నట్లు, బ్రహ్మవేత్తయైన వాడు సర్వము బ్రహ్మమయంగానే దర్శించును. ఆ మహాత్ముని దృష్టిలో బ్రహ్మభిన్నమైన వస్తువు ఒకటిలేదు. " హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలేదా, హరిమయుగాని ద్రవ్యము / పరమాణువులేదు వంశపావని వింటే."

అన్నట్లు సర్వచరాచర విశ్వమంతయు విశ్వేశ్వరుని రూపమే అన్న దృష్టి గల్గినవాడే యోగారూఢుడని చెప్పబడును. అట్టి మహాత్ముని దృష్టిలో వీరు సుహృత్తులని, వీరు దుర్ఘలులని కాని భేద బుద్ధియుండదు. ఆయన దృష్టి బంగారం దృష్టియేగాని, ఆభరణముల దృష్టిగాదు. స్వప్నప్రపంచమున గనిపించిన శత్రుమిత్రులయందు జాగ్రత్త గల్గినవారికి మిత్రునివలన లాభంగాని, శత్రువుల వలన భయంగాని ఎలాలేవో జగదధిష్ఠాన పరబ్రహ్మమును పొందినవానికి ప్రపంచభావమువలె లెవ్వియునులేవు. వారు సర్వదా ఆత్మరాములైయుందురు.

శత్రుమిత్రుల భావన, మంచిచెడ్డల భావనను సుఖదుఃఖముల భావన, మానావమానముల భావన, ఇవన్నియు అంతఃకరణ ధర్మములుగాని, ఆత్మధర్మములుగావు. ఆత్మ నిష్క్రియము, నిర్గుణము, నిర్వికారముగాన, అంతఃకరణ ధర్మములైన గుణధర్మాలెవ్వియు గుణాతీత పరబ్రహ్మను పొందిన వారికిలేవు. వారెప్పుడూ నిర్వికార బ్రహ్మస్థితి గల్గియుందురు. " చంపగావచ్చిన వారియందు, కాళియందు కరవాలమునందు తానచ్యుత భావముంచి " అన్నట్లు జడ భరతునిలాగా రాగ భయమోహాదిలెవ్వియు లేక ఆత్మావలోకానాతత్పురులై యుందురు. పరుస వేదిని సోకిన యినుము బంగారమైనట్లు, బ్రహ్మస్థితి నొందిన మహాత్ములదృష్టిలో సర్వము బ్రహ్మమేగాని బ్రహ్మేతరమేదియు నుండదు.

అర్జునా ! యోగారూఢుని స్వభావ స్వరూప స్థితిని గురించి విన్నావుగదా! ఇట్టి స్థితిలభించుట లోకమున చాలా దుర్లభము. అట్టి స్థితి పొందుటకు సాధన సంపద పద్ధతి ప్రకారలెవ్వియో చెవుతాను విను.

ఏదేని ఒక వస్తువును పొందవలయుననిన ఆ వస్తుసంబంధమైన సాధన పద్ధతులు నాశ్రయించినగాని ధ్యేయవస్తువు పొందబడదు. ఇక్కడనుండి ధ్యేయవస్తువులైన ఆత్మ స్వరూపమును పొందుటకు, సాధకునికి కావలసిన సాధన ప్రక్రియను గురించి సముమారు ఇరవైమూడు శ్లోకములతో భగవానుడు చెపుతున్నాడు. పరాకులేక విను.

మనసు కుక్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అని ఐదు

భూమికలు గలవని పతంజలి యోగసూత్రములలో సూచించడమైనది. క్షిప్తము, మూఢము, విక్షిప్తము సామాన్య పామర జనాలకుండును. మిగిలిన ఏకాగ్రము, నిరుద్ధము అను ఈ రెండు పరమార్థ సాధకులకు మాత్రముండును.

ప్రతివారి మనస్సు ఏదో ఒకదాన్ని గురించి ధ్యానించుచునే యుండును. ఒకనికి కాంతాకనకాలపై ధ్యాస, మరొకనికి కీర్తిప్రతిష్ఠలపై ధ్యాస, మరొకనికి తిండితీర్థాలపై ధ్యాస, యిలాగే లౌకికులకు ఏదో ఒక చింత వుండనే వుంటుంది. ఇట్టి జడపద్థారలపై చింత వుండనే ఉంటుంది. ఇట్టి జడపదార్థాలపై చింత మానవునికి శాంతిని, సద్గతిని గల్గించలేవు. జడపదార్థమైన జింకను చింతించి జడభరదుడు జింక అయి పుట్టాడు అని భాగవతం చెపుతూంది. గాన ప్రతివారికి పరమాత్మ ధ్యానమే పరమలక్ష్యంగా వుండాలి. అట్టి ఆత్మ ధ్యానం గురించి వినండి.

**"యోగీయుంజీత సతతం, ఆత్మానం రహసి స్థితిః ।**
**ఏకాని యతచిత్తాత్మ, నిరాశీరపరి గ్రహః ॥**

ఏకాంతమున నొంటరిగానుండి చిత్తేంద్రియములను వశపరచుకొని సంగ్రహ బుద్ధిలేనివాడై యోగి యోగాభ్యాసము గావించవలయును.

యోగాభ్యాసపరుడు ఏకాకిగా నుండవలయునని సూచించడమైనది. " ఏకః తపస్య ద్విరధ్యాయీ " ధ్యానయోగపరుడు ఒకడుగా వుండాలి. చదువు కొనుటకు ఇద్దరుగా వుండవలయును. యోగాభ్యాసికి ప్రక్కన మనిషి వున్నట్లైతే, లేనిపోని మాటలవలన మనసుకు విక్షేపం కలుగుతుంది. ధ్యానయోగానికి ముఖ్యంగా మౌనము పాటించుట మంచిది. అధికంగా మాట్లాడేవారికి మనసు ధ్యానమున కుదరదు, మాటలతో మనసులో సంకల్పాలు ఎక్కువౌతాయి. వ్యవహారములలోకి కూడా జారిపోయే ప్రమాదముంది. గావున ధ్యానయోగపరుడు ఏకాకిగా నుండుట మంచిది.

**శ్లో॥ ముహూర్తమపినీశేత, దేశేసోపద్రవేయతిః**
**ఉపద్రుతేతు మనసి, సమాధిర్నైవజాయతే॥**

అని శ్రుతి. ఒక ముహూర్త సమయమైనను ఉపద్రవముగల స్థలములో యోగి నివసింపకూడదు. బాధగల స్థలములలో నుండిన సమాధి సిద్ధింపదు. నిరుపద్రవమైన ప్రదేశమే ఏకాంతమని తెలియవలెను.

**శ్లో॥ ఉద్యానాని వివిక్తాని, బిల్వమూలం తటం, గిరేః**
**దేవతాయతనం కూలం, సముద్రస్య నిజంగృహం ॥**

ఉద్యాన వనములు, మారేడుచెట్టు, గిరితటము, (పర్వప్రాంతము), దేవాలయము, సముద్రతీరము పవిత్రమగు ఈ ప్రదేశములు యతియైన యోగికి ప్రశస్తములు. గృహస్థులైన

వారికి తన పవిత్రమైన నివాస స్థానము యోగమునకు వివిక్త ఏకాంత స్థలమగును.

ముఖ్యముగా మనసుకు ఎచట ప్రశాంతత, అహ్లాదము లభించునో అదియే యోగమునకు యోగ్యమైన స్థానముగా భావించవలయును.

ఏకాకిగానూ, ఏకాంత ప్రదేశములోనే వుండవలెను. ఎందుకనగా జనసమర్థమైన ప్రదేశములలో శబ్దములు మిక్కుటముగా నుండి మనసుకు చలనం కల్గిస్తాయి. కావుననే పూర్వకాలం మునులు ఏకాంతమైన నిర్జరారణ్యములలో నుండి తపస్సు చేసుకొన్నట్లు మనకు పురాణాలు దెల్పుచున్నాయి.

ఏకాంతంలో ఏకాకియున్నా "నిరాశీః" అనగా నిరాశాపరుడై యుండవలయును. జీవునికి ఆశ మహాపాశం. ఈ ఆశాపాశమునకు దగుల్కొనినవాడు సంసారమునుండి బైటపడలేడు. ఆశాపాశమునకు బద్ధుడైన వాడు, ధ్యానయోగమునకు అయోగ్యుడు. వానిమనసు విక్షేపముతో కూడి పాదరసమువలె, విషయాదులందు పరిభ్రమించిచుండును. కావున యోగి నిరాశాపరుడుగా నుండపలయును. "అనన్యాశ్చింతయం తోమాం యోగక్షేమ వహామ్యహం" అని భగవానుడు అట్టివారికి అభయమిచ్చివున్నాడు. అన్యంలేని చిత్తంతో భగవధ్యానపరుడైన వానికి రోజుకు కావలసిన ఆహారం ఏదో విధంగా సమకూర్చగలడు. ఆ ఆహార చింతలేక నిశ్చలచిత్తముతో భగవానునిపై భారమువేసి యోగమభ్యసించవలయును. "విశ్వాసం ఫలదాయకం" అన్నట్లు భగవానునిపై విశ్వాసముండవలయునేగాని తనకు కావలసిన ఆహారం గురించి చింతించాల్సిన పనిలేదు. ఇది నా అనుభవం.

1962వ సం॥లో కావచ్చు. నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా సింగపేట అనే గ్రామములో శ్రీరామకృష్ణాశ్రమమం అనే ఒక చిన్న ఆశ్రమంగలదు. ఆశ్రమానికి యజమాని శ్రీ జయరామిరెడ్డిగారని ఒక భక్తుడుండేవారు. నేను దేశాటన చేస్తూ ఆశ్రమం చేరుకొన్నాను. అక్కడ ఆశ్రమమునందు ఆగ్రామ వాసులైన సీతయ్యగారు, వెంకయ్యగారు, వెంకయ్యగారు అనే ముగ్గురు మంచి వైరాగ్యోపేతులు. నైష్ఠిక బ్రహ్మచర్యంగల సాధకులు. సాధన చేస్తుండేవారు. నేను రెండు రోజులు ఆ స్థలంలోనే వుండిపోయాను. తీవ్రతరమైన యోగాభ్యాస సాధనకు నామనస్సు ఆకర్షింపబడి అక్కడే వుండి పోదామనుకొన్నాను. అయితే ఆహార సమస్యగురించి కాస్తమనస్సు ఆలోచనలో పడింది. ఆరోజు సాయంత్రం ఆశ్రమ యజమాని శ్రీ జయరాంరెడ్డిగారు వచ్చి నావిషయం విచారించాడు. ఆ ముగ్గిరి సాధకులతో, అటు తరువాత నన్ను పిలిపించి ఏమి అబ్బాయి ఇక్కడ వుండి సాధన చేయాలనుకొన్నావా? అని ప్రశ్నించాడు. అవునని తలి వూపాను. అందుకు ఆయన ఇక్కడ మీకు తెలిసినవారెవరైనా వున్నారా అని అడిగారు. లేరని సమాధానమిచ్చాను. అయితే భిక్ష ఏలాగనీకు, ఈ సాధకులు ఈ వూరుగాన వారి తల్లిదండ్రులు సమకూర్చుచున్నారు. మరి నీవిషయమెలాగని ప్రశ్నించాడు. అందుకు నేను గ్రామంలోకి భిక్షకు వెడుతానన్నాను. అలాగైతే ఫరవాలేదని వెళ్లిపోయారు. ఆ రాత్రికి నేను భిక్షకు వెళ్ళాలని భావించాను. వచ్చిన రెండు రోజులు ఎవరో పుణ్యాత్ములు

తెచ్చిపెట్టారు. స్థిరంగావుంటే ఎవరు పెడుతారు అని భిక్షకు వెళ్లుటకు సిద్ధపడ్డాను. ఈలోగా ఆ గ్రామ భక్తుడు మలయాద్రి అనే అయనగారు వచ్చి అబ్బాయి నీవు వూరిలోకి భిక్షకు పోపనిలేదు. రెడ్డిగారు స్వయంపాకం పంపినారు. రోజూ మీరిక్కడే వంట చేసుకొని ధ్యానం చేసుకొనవచ్చునని చెప్పి బియ్యము, పాత్ర, కావలసిన పప్పు, ఉప్పు ఇచ్చి వెళ్లాడు. తదాదిగా దాదాపు తొమ్మిది మాసాలు అక్కడే సాధకులతో కలసి వంటచేసుకొని తింటూ, తోటపని చూచుకుంటూ సాధన చేశాము.

రోజూ రాత్రి రెండుగంటలకు లేవడం, నల్గురు సాధకులం కలసి వూరి బైటికి ఒక కిలోమీటరు దూరంలోగల చేదబావికి వెళ్లి స్నానం చేసి, బట్టలు పిండుకొని త్రాగటానికి నీరు తీసుకొని ఆశ్రమమునకు వచ్చి మూడు గంటలకు హరేరామ హరేరామ రామరామ హరేహరే అనే నామసంకీర్తనం, సుప్రభాతం, గురుస్తోత్రం చేసుకొని తరువాత కుటీరములలోకి వెళ్ళి నాలుగు గంటల నుండి ఉదయం 7 గంటల వరకు సాధనచేసి తదనంతరం ఆశ్రమ పనులు వంటగావించుకొని మధ్యాహ్నం ఒంటిగంటకు భోజనం చేసి, ఒక గంట గ్రంథపఠనం, ఒక గంట విశ్రాంతి తీసుకొని మళ్లీ మధ్యాహ్నం మూడు గంటల నుండి సాధన మొదలు పెట్టి సాయంత్రం 6 గంటలకు లేచి ఆశ్రమములో పూజ, భజన కార్యక్రమం చూచుకొని రాత్రి 8 నుండి 11 గంటల వరకు ధ్యానం చేసుకొనేవారు. రాత్రి రెండు గంటలకు నిద్రలేచి స్నానానికి వెళ్లేవారం. రాత్రి సమయంలో రోజుకు 3 గంటలకు మాత్రమే నిద్ర, భోజనం రోజుకు ఒక పూట మాత్రమే.

ఆ రోజులలో ఆకు మూకుడు, ముంత, ధ్యానానికి ఒక గోనెసంచి, ఒక చిన్న తాటియాకుల చాప, రెండు అంగవస్త్రాలు, రెండు కౌపీనములు తప్ప మరేవి మాకు వుండేవికావు. మేము నిద్రకూడా రాత్రి మూడు గంటలు కూర్చునియో నిద్ర పోయేవారము. ఎవరూ కూడా పడుకునేవారం కాము. మేము ధ్యానానికి ఏర్పాటుచేసుకొన్న రెండున్నర అడుగుల చదరం, అరుగు ముక్కాలు అడుగు ఎత్తుగలిగినదాన్ని ఎవరకి వారే తయారుచేసుకొని యుండేవారం. ఇక ఆహార విషయం అన్నము, అన్నమునుండి వచ్చిన గంజితప్ప మరేకూరలు వుండేవికావు. అయితే ఒక్కొక్కరోజు మేము తోటలో పండించిన కాయకూరలు చిన్న చిన్న ముక్కలుగాజేసి, వుడికించి కొంచెం ఉప్పు ఆ ముక్కలపై చల్లి, గంజి అన్నమునకు తోడుచేసి తినేవారం. ఇక బైట ప్రపంచం ఏలాగుందో తెలిసేదిగాదు. మా ఆశ్రమం చుట్టూ పెద్ద ఎత్తైన తాటాకులదడి. గాన బైట ప్రపంచము ఎలావుందో, ఏమి జరుగుతుందో మాకు తెలిసేదిగాదు.

ఏదైనా పండుగ పబ్బాలువస్తే రెడ్డిగారి భార్య పిండివంటలు అవి, ఇవి చేసుకొనివచ్చి మహాభక్తితో మాకు యిచ్చి తినమని బ్రతిమాలేది. కాని మేము తినుటకుగాని తీసుకోవడం చేసేవారంకాము. అమ్మగారు ఎంతో బ్రతిమాలి బాధపడేది. కాని మేము మాత్రం స్వీకరించేవారం కాదు. కారణమేమంటే ఒకతూరి రుచిగల పదార్థాలు జిహ్వాకు

రుచి చూపిస్తే ఇక మా గంజిఅన్నం మాకు రుచించదని భయం, మరియు సాధక స్థితిలో ఈ అలవాట్లు మంచిదికాదని మా అభిప్రాయం. కొందరు గ్రామంలోనివారే రుచిగల పదార్థాలు భజన దగ్గరకు ప్రసాదాలుగా తెచ్చిపెట్టేవారు. కాని మేము మాత్రం స్వీకరించేవారంకాము. కాకపోతే దేవుని దగ్గర వుంచిన కొబ్బరిముక్కలు యిస్తే మాత్రం తీసుకొనుచుంటిమి.

అలాగా ఆ కాలంలో మా సాధన ఆనందంగా జరిగింది. ఆ రోజులలో వున్న మనశ్శాంతి, దేహారోగ్యం ఇప్పుడులేదు. ఇపుడేగాదు ఇంకెప్పుడూ ఉండదేమో అనిపించును. నిజానికి చెప్పాలంటే ఆ రోజులలో మేము చేసిన సాధన ఇపుడు ఏ ఆశ్రమాలలో లేదేమో అనిపిస్తుంది. ఆ నియమాలు, ఆ సాధన ఆరోజులు ఇప్పటికి నాకు బాగా జ్ఞాపకము వచ్చినపుడు ఆ రోజులే మంచిగా జరిగిపోయాయనిపిస్తుంది.

మేము సాధన కాలమంతయు నిశబ్దము, మౌనము ఎక్కువగా పాటించేవారము. నల్లురముకూడా నిశ్శబ్దము, మౌనము ఎక్కువగా పాటించేవారము. అవసరమైతే మాటలు చాలా చిన్నవిగా, వినయంగా ఒకరికొకరము మాట్లాడుకొనువారము. ఎక్కువంటే రోజుకు పదిమాటలు కూడా మామధ్య జరిగేవికావు. చాలామటుకు కన్నులతోనే మా భాష అంతాజరిగేది. ఆశ్రమము లోపలికి పరులెవ్వరిని రానిచ్చేవారముకాము. సమయం ప్రకారం తెల్లవారుఝామున, రాత్రి 7 గంటలకు భజన సమయములో మాత్రం గ్రామములోని భక్తులు వచ్చిపోయేవారు. అంతే మధ్యకాలంలో ప్రక్కగ్రామాలనుండి మమ్ములను చూడవలెనని వచ్చేవారు. కాని మేము కనిపించేవారంకాము. గేటు తీసేదిలేదు. ఒకపుడు బాపట్ల శ్రీరామక్రిష్ణాశ్రమం శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారు ఆ గ్రామానికి వచ్చినపుడు మా సాధన పద్ధతులను, మావైరాగ్యానికి ఆశ్చర్యపడిపోయారు. తాను రచించిన సాధనా రహస్యములు అనే గ్రంథాన్ని మాకు ఇచ్చి ఇంకాకొన్ని సాధన ప్రక్రియలను చెప్పివెళ్ళారు. ఇదంతా ఎందుకు చెప్పానంటే నిజమైన సాధకులకు మా సాధన ఆదర్శప్రాయం కాగలదనే విశ్వాసంతో నా స్వీయచరిత్ర కొద్దిగా చెప్పడం జరిగింది. ప్రస్తుతం విషయానికి వద్దాం.

కావున సాధకులు ఆహార విహార విషయములలో పిరికితనం గల్గియుందరాదు. గట్టి నమ్మకం, ఆత్మవిశ్వాసం గల్గి సాధనకు ఉపక్రమించవలెను. యోగసాధనకు అపరిగ్రహం చాలా ముఖ్యం. అపరిగ్రహ ప్రభావంతో సాధకుని మనస్సు ఊర్ధ్వగామిగావటం మంచి ధైర్యం గల్గుతుంది. సాధన స్థితిలో ఏమాత్రం పరిగ్రహానికి చేతులు చాచరాదు. అలా చాచాడా వాని సాధన అంతటితో అంతమైనట్లే. అపరిగ్రహ ప్రభావం చాలా గొప్పది. సాధన త్వరలో సిద్ధి పొందుతుంది. పరిగ్రహంతో పుణ్యక్షయం చిత్త చాంచల్యము ఇత్యాది దోషాలు కలిగి సాధకుడు పతనావస్థకు లాగబడుతాడు.

సాధకులు వైరాగ్యమే మహాభాగ్యముగా భావించాలి. వైరాగ్యానికి మించిన సుఖం సాధకులకు మరొకటిలేదు. ఏకాంతానికి మించిన ఆనందం మరొకటిలేదు. తీవ్రమోక్షాపేక్షగల వాడు ఈక్రింది సాధనవలంభించాలి.

శ్లో॥ ఏకాంతవాసో లఘుభోజనాదిః
మౌనం నిరాశా కరణావరోధః
మునేరసోస్సం యమనం షడేతే
చిత్త ప్రసాదం జనయంతి శీఘ్రం॥

ఏకాంతవాసము, మితభోజనము, మౌనము, ఆశలేకుండుట, ఇంద్రియముల నిగ్రహించుట, ప్రాణాయామము. ఇవి ఆరును మునియగు వానికి వేగమే మనోనైర్మల్యమును గల్గించును. ఈ అరు నియమములు గల యోగికి యోగవిఘ్నములు గలుగనేరవు.

ఎందుకనగా ! ఏకాంత వాసముతో సంగదోషమును, మితహిత భోజనంతో ఆరోగ్యము, ప్రసన్నతయు, మౌనమువలన మనసు సంయమమును, నిరాశవలన సంతోషమును, ఇంద్రియ నిగ్రహముచేత ఆత్మబలమును, ప్రాణాయామమువలన స్థూల సూక్ష్మశరీరములయొక్క పాపరాశిని నడంచి శీఘ్రముగా సమాధిని పొందుచున్నాడు.

సాధకులకు అవసరానికి మించిన వస్తుసామాగ్రి సేకరణ యోగవిఘ్నమును గల్గించును.

సద్గురు మళయాల స్వాములవారు బ్రహ్మచారియై దేశాటన చేయుచున్నపుడు ఒక భక్తుడు స్వాములవారికి కమండలము ఒకటి దానం చేశాదు. స్వాముల వారుదాన్ని స్వీకరించారు. అది మొదలు స్వాములవారి మనస్సు ధ్యానమున నిల్వకుండా ఆ ఇత్తడి కమండలంపైననే మనసు పడింది. ధ్యానము చేయుచున్నపుడల్లా కమండలము ఎవరైనా ఎత్తుకుపోదురేమోనని మధ్యమధ్య కన్నులు దెరచి చూడడం ప్రారంభించాడు. ఆ మహాత్ముడు ధ్యానవిఘ్నమునకు ఈ కమండలమే కారణమని గ్రహించి వెంటనే దాన్ని మరొకరికి దానం చేశాడు. అప్పటినుండి యథావిధిగానే ధ్యానం చక్కగా కుదిరింది. కావున సాధకులకు అంగవస్త్రము, కౌపీనము, ముంత, ఒక బొంత తప్ప ఇంతకుమించి వస్తువులుండరాదు. అట్టి వారు ఏ భయములేక నిర్భంయగా సాధన చేసుకొనగలరు.

సాధక స్థితిలో ప్రాణాయామము కూడా ధ్యాన సమాధులకు మహోపకారియగును. సద్గురుదేవుని సన్నిధిలో చక్కగా ఈ ప్రాణాయామమును అభ్యసించి గ్రహించి చేయవలయును. లేకున్న ప్రాణవాయువు అన్ని నాడులయందు ప్రవేశించి అనారోగ్యం గల్గించును. మొదట రేచకపూరకములు చస్త్రికములు మాత్రమే అభ్యసించి శ్వాసనాళములు శుద్ధి పొందిన తరువాత లఘు ప్రాణాయామము తరువాత దీర్ఘప్రాణాయామము, తరువాత కుంభకము, (బహిర్ముఖ, అంతర్ముఖనూ భకము) మెల్లమెల్లగా సాధించవలెను. గ్రంథములు చదివి మాత్రము ప్రాణాయామము చేయకూడదు. అందువలన ప్రమాదము జరిగి రోగబాధలకు గురికావలసిన అవకాశమేర్పడును. కాన సాధకులు బాగా గురుసన్నిధిలో అభ్యసించి యుండవలెను.

ప్రాణాయామము చేత శరీరకాంతి, కోమలకంఠ స్వరము, ముఖమున బ్రహ్మవర్చస్సు, శ్వాసనియంత్రణ, స్థూలసూక్ష్మ శరీరముల పాపక్షయము మొదలగు లాభములెన్నియో గల్గును. కాన యోగాభ్యాసికి తప్పక ప్రాణాయామం అవసరం అని శ్రుతి దెల్పుచున్నది.

**" యధాపర్వత ధాతూనాం, దహ్యన్తేధమతామలాః**
**తథేంద్రియకృతాదోషా, దహ్యన్తే ప్రాణనిగ్రహాత్"**

పాషాణాది విషధాతువులెట్లు అగ్నితప్తములై పుటముచే పరిశుద్ధములగు చున్నవో అవ్విధమున ప్రాణసంయమాగ్నిచే సమస్త విషదోషములు దగ్ధములగు చున్నవి మరియు

**శ్లో॥ యఃప్రాణపవన స్పన్ద శ్చిత్త, స్పన్ద ఏవహి।**
**ప్రాణస్పన్దక్షయేయత్నః కర్తవ్యోధీమతో చ్చకైః ॥**

ప్రాణవాయువు కదలిన చిత్తము చలించును. కావున ప్రాణచలనము నాపుటకు బుద్ధిమంతుడు మిగులప్రయత్నము చేయవలయును.

కాబట్టి మనఃప్రాణవాయువుల స్పన్దనము గూడా నుండుటవలన ప్రాణనిగ్రహముచే మనస్సు నిగ్రహింపబడుచున్నది. ప్రాణక్షయమనగా ప్రాణవాయువు. అనగా ! శ్వాసతగ్గియుండుట అని గ్రహించవలెను. పర్వతము నెక్కువానికి గల్గు శ్వాసాధిక్యత కూర్చున్న వానికి కలుగదు. అలాగున ప్రాణాయామ సామర్థ్యము గలవానికి శ్వాసస్వల్పముగా ప్రవర్తిల్లును. కావున ప్రాణాయామముచేత ప్రాణనిరోధము గలుగగా, చిత్తము సకల దోషరహితమై ఏకాగ్రత పొందును.

"రహసిస్థితః" అని చెప్పుటచేత సాధనాపరుడు, తన సాధన గుప్తంగా ఉండవలెనుగాని, అట్టహాసంగా, బాహాటంగా చేయరాదు. బయటపడిన విత్తనాలు పక్షులపాలైపోతాయి. గుప్తంగా నేలలో పడిన విత్తనములో మొలకెత్తి చెట్టుకాగల్గుతుంది. గోప్యముగా పామర జనాలకు దూరంగానే యోగి యోగాభ్యాసము గావించవలయును. పామర జనాలమధ్య సాధన జేయుటకంటే అడవిలో వన్యమృగముల మధ్య తపస్సు చేయుట శ్రేయోదాయకము. పామర జనాల సంసర్గంతో సాధకుడు అనేకమైన ఉపద్రవాలను ఎదుర్కొనవలసి వస్తుంది. కావుననే సద్గురు మళయాల స్వాములవారు నిర్జరారణ్య ప్రదేశమున తిరుమల తుంబుర తీర్థములో ఏకాకిగా ఆ కొండ ప్రాంతములో వన్యమృగాల కాటపట్టయిన ప్రాంతంలో ద్వాదశవత్సరములు తపస్సు చేసి సిద్ధి పొందారు. రమణ మహర్షులవారు అరుణాచలము కొండ గుహలో తపస్సుచేసి సిద్ధిని పొందారు. ఇలాగ సిద్ధపురుషులంతా నిర్జరారణ్య ప్రాంతములందే ఎక్కువగా సాధన గావించి సిద్ధిని పొందారు.

మరియు యోగి "యతచిత్తాత్ముడు" అనగా! దేహమును చిత్తమును తన స్వాధీనములో వుంచుకోవలె. చపల చిత్తం ధ్యానానికి నోచుకోలేదు. చిత్త స్వాధీనం అయినపుడే ధ్యానం చక్కగా కుదురుతుంది. పూర్వవాసనలను ప్రాణాయామ ప్రభావముతో పోనడంచి చిత్తం స్వాధీనం గావించుకోవలెను. దేహాన్ని కూడ నియమించాలె. సాధనలో కూర్చున్నది మొదలు దేహాన్ని అటు ఇటు వూపటం గాని, క్రింది మీదికి ఎగనీల్గడం గాని చేయరాదు. దేహం నిశ్చలంగా వున్నపుడే ధ్యానం కుదురుతుంది.

పూర్వకాలంలో చూచుకొనే అద్దాలు లేవు. అప్పటివారు ఒక పాత్రలో నీరుపోసి ఆనీటిలో ముఖాన్ని చూచుకొని ముఖాలంకారం చేసుకొనేవారు. పాత్ర కదిలితే పాత్రలోనీరు చలిస్తాయి. నీరు చలిస్తే తన ముఖ ప్రతిబింబం చక్కగా గోచరించదు. అలాగే సాధకుడు ఘటం లాంటి ఈ దేహాన్ని కదలకుండ నిశ్చలంగా నుంచుకోవాలె అపుడే జలం లాంటి చిత్తము నిర్మలమై తన ఆత్మస్వరూపాన్ని చక్కగా ధ్యానించగల్గుతాడు. (స్వరూపస్థితిలో నిల్వగలుగుతాడు) దేహ నిశ్చలతకు ఆసనము ప్రధానముగా జెప్పబడింది. ఆసనసిద్ధి గల్గిన వారికి దేహం నిశ్చలమైపోతుంది. ఆసన సిద్ధి లేనిదే సాధన సాగదు, "సతతం ఆత్మానంయుంజీత" యోగి అయినవాడు నిరంతరము చిత్తమును ప్రత్యగాత్మ యందే సంలగ్నము చేయాలో. పూర్వ వాసనా బలముతో చిత్తము బహిర్ముఖమైనపుడు పురుషప్రయత్నముతో మళ్ళీ దాన్ని అంతర్ముఖం చేస్తు వుండాలె. విసుగుతనం, సోమరితనానికి బద్ధకానికి అవకాశమివ్వక సాధన సాగించాలి. "సతుదీర్ఘకాల నైరంతరీ సత్కారసేవితో ధృఢభూమిః అనిపతంజలి యోగసూత్రం, సాధన సత్కారముతో శ్రద్ధతో, విడవకుండ దీర్ఘకాలం చేయవలయును, సాధనకు కాలపరిమితి లేదు. గమ్యం చేరు వరకు ప్రయాణం సాగించినట్లు సిద్ధి పర్యంతం సాధన చేయవలయును. యోగి ఈ విధంగా తన మనస్సును పరమాత్మయందు నియమించాలి. మనస్సులోగల విజాతీయ ప్రత్యయ సంకల్ప ప్రవాహాలు తొలగి, సజాతీయ ప్రవాహం కలుగు వరకు సాధనాభ్యాసం చేయుచుండవలయును.

అలా ధ్యానానికుప్రకమించవలసిన ఆసన విషయమై భగవానుడు వివరిస్తూన్నాడు.

శ్లో ॥ శుచౌదేశే ప్రతిష్ఠాప్య, స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం, చైలాజినకుశోత్తరం॥

శ్లో ॥ తత్రైకాగ్రం మనఃకృత్వా, యత చిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యా సనేయుంజ్యాత్, యోగమాత్మ విశుద్ధయే॥

సాధకుడు సాధన నిమిత్తమై పవిత్రదేశమును నెన్నుకొనవలెను. ఆ స్థలమునందు మిగులనెత్తును మిగుల పల్లమును గాకుండ సమస్థలమందు చాపయుదా౯పై తెల్లటి

వస్త్రమును వేసుకొని దానిపై తనకిష్టమొచ్చిన ఆసనము వైచుకొని కూర్చొని, మనస్సును ఏకాగ్రముచేసి, ఇంద్రియవృత్తులను అరికట్టి చిత్తశుద్ధి నిమిత్తము యోగి సాధన సాగించవలెను. ఇదే విషయమును సీతారామాంజనేయ సంవాదమున దెల్పినది చూడుడు.

సీ॥ వితతమై విమలమై సుఖమై
పొ సంగు వివక్త దేశంబు 'నందు'
సమభూమియందు నిశ్చలముగా
మిఱ్ఱుపల్లములుగాకుండ బేలవముగాగ
బూని పద్మాసనాసీనుడై యామీద
గాయమధ్యమమును గళముశిరము

తే॥ జక్కగాని క్కిదృక్కులు ముక్కిచక్కి
జిక్కిదక్కించితక్కి నదిక్కు గనక
మిక్కిలి దశేంద్రియంబుల ద్రుక్కజేసి
ఫలితముగ యోగమభ్యసింపంగవలయు,

అని సీతాదేవి ఆంజనేయునికి యోగప్రక్రియను గురించి విపులముగా బోధించినది, యోగాభ్యాసమునకు స్థలము తగినదిగానుండవలయును. ఆ స్థలము నందు దుర్గంధ ద్రవ్యములే వియునుండరాదు. ధ్యానమునకు భంగము గల్గించు దోమలు, ఈగలు, ఇత్యాది ప్రాణులుండరాదు. జన సంచారము లేనిదిగా ప్రకృతి సౌందర్యము గల్గియుండవలయును మరియు ఆ స్థలము హెచ్చుతగ్గులు లేక సమముగానుండవలెను. అట్టి స్థలము సాధకుడు ఎన్నుకొని అచట మొదట దర్భాసనము, దాని పై కృష్ణా జినముదానిపైన తెల్లటి వస్త్రమును వేసుకొని అటునిటు కదలకుండ అమర్చుకొని, దానిపై సిద్ధాసనముగాని, సింహాసనముగాని, లేదా సుఖాసనముగాని వేసి కూర్చుని, నడుము, కంఠము, తలను, అటునిటువంచక నిలువుగా శరీరమును సమస్థాయిలో నిల్పిచూపును, నాసితాగ్రము నందే నుంచి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములనన్నిటిని విషయములపై బారనీక గురుకీలునందే మనసునేకాగ్రముగా చేసి యోగమభ్యసించవలయును.

సాధకుడు సాధన చేయు స్థలము పవిత్రంగా మండవలయును. వనాంతరములందు కొన్ని స్థలములు సహజంగానే పవిత్రంగామండును. అట్టి స్థలము సాధకుడు ఎన్నుకొనుటమంచిది. "శుచౌదేశే" అని చెప్పుటచేత స్థలశుద్ధియేగాక, దేహశుద్ధి మానసికశుద్ధి కౌపీనశుద్ధి, ఆహారశుద్ధి వీటన్నిటిని గ్రహించవలయును. మానసిక శుద్ధికి భగవాన్నామస్మరణ కౌపీన శుద్ధికి ప్రాణాయామము ముఖ్యముగా నుండవలయును. దేహశుద్ధికి, స్నాన, యోగాసనములు ముఖ్యాంగములుగా భావించాలె. దేహము చక్కగా ఆరోగ్యంగా వున్నపుడే యోగియోగాభ్యాసము చక్కగా చేయగల్గును.

రోజు ఉదయం లేస్తూముందు కాలకృత్యములు దీర్చుకొని 30 నిముసములైనా యోగాసనములువేయుట చాలామంచిది. యోగాభ్యాసములు దేహమును వజ్రకఠినముగా గావించును. దేహసంబంధమైన సకల రోగములను, దునుమాడి దేహమునకుమంచి ఆరోగ్యమును తేజస్సును, మనసుకు ఆహ్లాదమును గల్గించును. మొత్తము ఆసనములన్నియు వేయలేకపోయినను కనీసము ప్రముఖమైన 20 ఆసనమ్ములైనను ఒక్కొక్క ఆసనము రెండు నిమిషములకు తక్కువలేకుండ వేయవలయును. 1. సింహాసనము, 2. సిద్ధాసనము, 3. యోగనిద్రాసనము, 4. తులాసనం 5. మయూరాసనము, 6 శలభాసనము, 7. చక్రాసనము, 8. అర్థచక్రాసనము, 9. భుజంగాసనము, 10. శీర్షాసనము, 11. అర్ధమత్స్యేంద్రాసనము, 12. గరుడాసనము, 13. బద్ధపద్మాసనము, 14. ధనురాసనం, 15. ఊర్ధ్వసింహాసనము, 16. వృక్షాసనము, 17. పశ్చిమోత్తసనము, 18. పద్మాసనము, 19. కామదహనాసనము, 20. వీరాసనము పై ఆసనములనుగాని లేదా అందుపది ఆసనములను అయినా రోజు వేయుట చాల యోగాభ్యాసమునకు అనుకూలమగను.

"స్థిరమాసనః" అనుటచేత సాధకుడు ఏదో ఒక ఆసనము తానుకు అనుకూలమైన ఆసనము ఎక్కువ సేపు కూర్చోగల ఆసనమును ఎన్నుకొనవలయును. మధ్యమధ్య ఆసనమును మార్చరాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆసనము అనుకూలముగా నుండును గాన పలానా ఆసనమనేని బంధనలేదుగాని, ఏ ఆసనమైనను ముందుతానెన్నుకొన్నదే, సిద్ధిపర్యంతం దాన్నే అభ్యసించవలెను, అన్నిటికంటే సర్వులకు అనుకూలమైన ఆసనం సిద్ధాసనము, ఈ ఆసనము త్వరలోనే ఆసన సిద్ధిని గల్గించునని మహాత్ములు అనుభవం గాన సిద్ధాసనము యోగమునకు చాలమంచిది..

సిద్ధాసనమనగా! ఎడమకాలుపై కుడికాలు వైచుకొని, దేహమును సమస్థాయిలో నిల్పిరెండు చేతులు కలపియుంచుట సిద్ధానమగును. మరికొందరు, ఎడమకాలి మడిమ మలాదారమందు అనగా గుదస్థానమునకున్న, కుడికాలిమడిమను లింగస్థానమందుంచి శరీరమును సమస్థాయిగా నుంచి, భ్రూమధ్యమునవలోకించుట సిద్ధాసనమని యందురు. ఇందు ఎవరికేది సులభమో దాన్నివేసికొనవచ్చును.

"నాత్యుచ్ఛ్రితం నాతినీచం" అనుటచేత తానుకూర్చొను చోటు మరీ పల్లమైనది. మరీ ఎత్తైనది గాక మధ్యరకంగా అనగా తొమ్మది ఇంచుల ఎత్తుకంటే ఎక్కువ వుండరాదు. ధ్యానసమయమున ఒక్కొక్కపుడు శరీరముపడిపోవును. సాధనకాలమందు, గాన మిక్కిలి ఎత్తుగావుండరాదు.

" చైలాజినకుశోత్తరమ్ " అనుటచేత చర్మము వస్త్రము, దర్భాసనము వేసుకొనవలయునని సూచించడమైనది. భూమికి సహజముగా ఆకర్షణ శక్తి మిక్కుటముగానున్నది. కావున భూమిపైన జింక చర్మముగాని పులిచర్మముగాని వేసుకొనుటచేత భూమియొక్క ఆకర్షణశక్తి మనపైన పనిచెయ్యక మనసు చక్కగా నిలుచుట

కవకాశము గలదు. పులిచర్మము కంటె జింక చర్మమే మంచిది. సాత్త్విక గుణమును గల్గిస్తుంది. పులిచర్మము రాజసికము గాన రజోగుణాన్ని గల్గిస్తుందని వాడుక వస్త్రముపైన కూర్చొని ధ్యానం చేస్తే **దరిద్రమును** గల్గించునని కొన్ని శాస్త్రములందు జెప్పబడినది. అదే కేవలం కామ్యబుద్ధి **ధ్యానం చేసే సంసారుల** గురించి చెప్పినదేగాని, కామ్యబుద్ధిలేని యోగసాధకుల **గురించిగాదని గమనించవలెను**. దానిపైన మెత్తగా వుండుటకు పవిత్రతకు చిహ్నముగా, **దర్భాసనము దానిపై తెల్లటి** వస్త్రమును వైచికొని యోగమభ్యసింపవలెను.

"తత్రైకాగ్రం మనఃకృత్వా" మనసును ఏకాగ్రముగా నుంచవలెనని సూచించడమైనది. ముందు గరుధ్యానంచేసి తరువాత మంత్ర జపంచేసి, అనేకాగ్రముగాయున్న మనసుమ ఏకాగ్రము చేసుకొని తానుకూర్చున్న చుట్టుశాంతి మంత్రములు చేత దిగ్బంధన చేసుకొని ధ్యానమునకుపక్రమించవలెను.

అనంతరం "యతచిత్తేంద్రియక్రియః" చిత్తాదియింద్రియములను అరికట్టాలె, స్థూల శరీరానికి వాతపిత్తశ్లేశాది దోషములున్నట్లు సూక్ష్మ శరీరమైన మనసుకు, మలవిక్షేప ఆవరణ దోషాలున్నాయి. ఇవి ఉన్నంతవరకు యోగాభ్యాసము కుదురదు. కాన వీటిని ప్రయత్న పూర్వకంగా తొలగించు కోవలయును. ఇంద్రియాదులకు బహిర్ముఖవృత్తేగాని అంతర్ముఖవృత్తి లేదు. గాన బాహ్యావిషయాదులయందు గలదోషములును విచారించి, మానసేంద్రియములు అంతర్ముఖం చేసుకొనవలెను. ఇంద్రియాల సంయోగముతో మనసు మలినమై పోయింది. వస్తుతః మనసు శుద్ధమైనదే (అపంచీకృతంగాన దానికి మాలిన్యం లేదు) మనసును ఇంద్రియాది వృత్తులనుండి మరలించి ఆత్మపరంగా జేసుకొనవలెను.

ఈ పదకొండవ శ్లోకమునకు ఈ విధంగా అర్థము సూచించిరి. మొదట దర్భాసనమును వేయవలయుననియు ఆదర్భవాసలను తూర్పుదిక్కుగా వుండునట్లు వేయవలయుననియు, ధర్భలనగా మనపలుకులే దర్భలనియు, అట్టి దర్భ పలుకులు వెలువడుచున్న అపోస్థానమనబడు స్థూలమే దర్భాసనము అని జెప్పుదురు. ఆ బ్రహ్మనిష్ఠయందున్నపుడు మాటలాడవలెనను సంకల్పము లేకుండటమే దర్భాసన సీసుడగుట అని అంతరార్థం మరియు జింకను శల్యగ్రహణముమెండు, చలించునట్టి మనస్సే జింకయనియు, సూక్ష్మ శరీరమనబడు మనసునందలి మాలిన్యమును తీసివేసి శుద్ధసాత్విక వృత్తిగల్గియుండు హృదయమే జింక చర్మమున ఆసీనుడయినాడని దెల్పిరి.

చేలమనగా వస్త్రము, తెల్లని వస్త్రమును ఆసనముపై వేయుట అనగా! కారణశరీరమందలి తమోగుణమనెడి నలుపును దీసివేసి శుద్ధబుద్ధి గల్గియుంటమే తెల్లని వస్త్రమని తెల్పిరి.

అనగా! మొదట పలుకులుమాని, పిదప సంకల్పములను మాని తరువాత తమోగుణమునునడంచుటయే దర్భాసన, కృష్ణాజిన, వస్త్రములని తెలియవలెను, ఆసనమనగా!

ఆ॥ ఎద్ది సిద్ధమగుచునే ప్రొద్దువిలసిల్లు
నరసిచూచి యెద్ధియైన యపుడె
సర్వసిద్దులోకట సమకూరునదియె, సి
ద్ధాసనంబు కేవలాత్మ రూపా.

అని సీతారామాంజనేయ సంవాదమున దెల్పబడినది. అనగా! సర్వకాలములు యందు చలింపక నిశ్చలముగానుండునట్టి పరబ్రహ్మమే తానయిన బ్రహ్మవిద్యవరిష్ఠునకు సకల సిద్ధులు సిద్ధించును. ఆయనికి ముందు ఏ కోరికలు లేవు గావున అట్టియునికే సిద్ధాసనమని చెప్పబడినది. దీనిని బట్టి బ్రహ్మనిష్ఠయందు మనోలయము అయి సర్వసంకల్పములుడుగుటయేని నిజమైన ఆసనమని దెలియవలయును.

ఏకాంతప్రదేశమనగా!

సీ॥ ధీరులచేతనే దేశమాచార్యోప
దేశంబుచేనర్థి దెల్పియబడియె
బరమపవిత్రమై భాసిల్లునే దేశ
మేదేశమన్నింటి కెక్కుడయ్యె
నేదేశము మానసేంద్రియ ప్రాణాది
సంచార శూన్యమై సమతనొప్పు
నే దేశమున సాధ్వ స్వేచ్ఛా మదక్రోధ
దుఃఖగంధలవంబు దోపకుందు

తే॥ గరమునిరుపద్రవంబునిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్యమానందమగుచునే దేశమలరు
నదియె యేకాంతదేశ మౌనాంజనేయ(సీ॥రా॥3అశ్వా 154ప)

యోగాంగమైన యాదేశము విద్వాంసులగువారెయెరుంగుదురు గాని యన్యులెరుగరు. మరియు నాచార్యోపదేశము చేతనే వాస్థానమును పొందవచ్చును గాని మరొక విధముగా పొంద శక్యము గాదు. ఆ స్థానము అతి పవిత్రమైనది. మరియు నయ్యేదిజ్ఞానభూమికల ఏడింటిలోను త్తమోత్తమయినది. అస్థానమునందు, మనస్సు గాని, ఇంద్రియములుగాని ప్రాణాదివాయువులు గాని యెవ్వియునే మాత్రము సంచరింపజాలవు. ఆ స్థానమునందు భేదమనునదే లేదు. ఏ విధమైన కోరికగాని, కోపముగాని దుఃఖములోగాని లేవు. సర్వోత్తమమైనది. సర్వకాలముల యందు చెక్కుచెదరనిది. పరిశుద్ధమైనది. ఆనంద స్వరూపమైనది. అదియే బ్రహ్మము. అదియే నిజమైన ఏకాంత దేశము అనియెరుగువలెను. అని సీతారామాంజనేయ సంవాదము.

అయినను పై వివరించిన అర్థమంతయూ కేవలం సిద్ధావస్థ గురించి చెప్పబడినదేగాని సాధకుని గురించి మాత్రముకాదు. గాన ముందు బాహ్యార్థమును గ్రహించి సాధన చేసినగాని పై వర్ణించిన అంతరార్థాము సిద్ధించదు అని గమనించవలయును. మరియు యోగమునకు యమనియమాలు ముఖ్యాంగములుగా పతాంజలి యోగ సూత్రములలో జెప్పబడినవి.

అయ్యా ! పార్థా ! యోగ సాధనకు ముఖ్యంగా యమనియమాలు రెండు నేత్రముల వంటివి. ఈ యమనియమాలు పాటించనివాడు యోగికాలేదు.

యమమనగా : అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యం, అపరిగ్రహము అని ఐదు, నియమమనగా : శౌచము, తపస్సు, సంతోషము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము, ఈ ఐదు నియమాలు అని చెప్పబడినాయి. యోగశాస్త్రము యొక్క హెచ్చరిక ఏమంటే.

యమములను తప్పక నియంతగా అనుష్ఠించాలె, నియమాల విషయములో అపస్యంగా ఆచరించాలనే పట్టుదలేమిలేదు. యమాలపై అశ్రద్ధచూపి కేవలం నియమాలనే ఆచరించేవాడు తప్పక భ్రష్టుడవుతాడనటంలో సందేహము లేదు. కాబట్టి నియమాలకన్న యామాదులైన అహింస, సత్యం, అస్తియం, బ్రహ్మచర్య, అపరిగ్రహాలు తప్పక అనివార్యంగా అనుషించాలె, యమనియమాలు పది ఆచరించినా ఇంకామంచిది. ఇంతకు ఫలితార్థమేమనగా! యమాదిగుణాలు లేని నియమాలు డాంబికాలు మాత్రమే అట్టి ధార్మతికి సద్గతి లేదు. తర్వాత విషయం వినండి.

**" సమంకాయశిరోగ్రీవం / ధారయన్నచలం స్థిరం ।**
**సంప్రేక్ష్యనాసికాగ్రం / స్వందిశశ్చానవలోకయన్" ।  6-13**

**" ప్రశాంతాత్మ విగతభీః , బ్రహ్మచారివ్రతేస్థితః ,**
**మనస్సంయమ్యమచ్చిత్తో, యుక్త ఆసీతమత్పరః, ॥  6-14**

తలను, మెడను, శరీరమును, చక్కగా ధృఢముగా నిలిపినా శికాగ్రమున దృష్టినిలిపి, దృష్టిని చెదరనీక స్థిర చిత్తముతో బ్రహ్మచర్య దీక్షావ్రతుడై సర్వభయముల వదలి పరమాత్మయే పరమగతిగా నమ్మి యోగమభ్యసింపవలయును.

ధ్యానమునకు కూర్చున్నపుడు ఇష్టవెుచ్చినట్లు కూర్చొనరాదు "సమంకాయశిరోగ్రీవం" కాయమును అనగా గుదస్థానం మొదలుకొని విశుద్ధచక్రం వరకు గల భాగాన్ని కాయమని తెలియవలెను. మెడ, శిరస్సు ఈ మూడు చక్కగా వంకర లేక యుండవలెను. వెనుకభాగం వెన్నముక చక్కగా, నిటూరుగా నుంచవలెను. అలాగే మెడను ప్రక్కలకు వరగిపోకుండ చక్కగా నిల్పితలను కేవలం ముందుకు వంచక కేవలం వెనక్కివంచక

నిల్పియుంచవలెను. అలా శరీరమును నియమించినపుడు, నమతూకముతో శరీరముండుటవలన ఎంతసేపు కూర్చున్న నొప్పి బాధ వుండదు. అలాకాకుండా తలగాని, మెడగాని, ప్రక్కకు వరగాబెట్టినను, వెనక్కిముందుకు శరీరమును వంచి కూర్చున్నపుడు ఆవంగిన భాగంలో తీరని నొప్పి బాధగలుగును. గాన ఆ సనమున చక్కగా కాయం, గ్రీవం, శిరస్సు సమస్థాయిలో నిల్పి కూర్చొనవలెను. అలావున్నపుడే క్రిందమూలాధార చక్రములోని కుండలినీ శక్తి సహస్రారం చేరుటకు సుషుమ్నానాడి చక్కగా పనిచేయును. కాబట్టి ధ్యానానికి చక్కగా సమస్థాయిగా శరీరమును నిల్పి కూర్చొనవలయును. "ధారయన్న చలం స్థిరః॥ అనుదానికిదియే అర్థము, కూర్చున్న తరువాత అటు ఇటు కదలరాదు. శరీరం కదలిన చిత్తం చలిస్తుంది. చిత్తచలనం గల వానికి ధ్యానం కుదురదు. కూర్చున్న కొద్దిసేపైనా కదలిక స్థిరంగా కూర్చునేది అలవాటు గాలించుకొనవలెను. "స్వంప్రేక్ష్యనాసికాగ్రం స్వందిశశ్చానవలోకయన్" అలా స్థిరంగా కూర్చొని దృష్టిని నాసికాగ్రముపై కేంద్రీకరించవలెను. దిక్కులు చూడరాదు. అనగా! దృష్టిని చదరనీయ్యకూడదు. నాసికాగ్రమనగా! ముక్కుకొన భాగమని గాదు. నాసికా పుటములగుండా వచ్చిపోయెడి శ్వాసయని గ్రహించవలెను. శ్వాసపైనిగా వుంచడమే నాసికాగ్రము, కన్నులు మూసుకొని మనసును గురుకీలు యందు నిల్పివచ్చిపోయెడి శ్వాసపైనిగా యుంచవలయును. సాధకుడు శ్వాసపై నిఘావుంచి ప్రతిశ్వాసనుక్రమం తప్పకగమనిస్తూ వుండాలె. దీనివలన మనసు అన్యసంకల్పాలు మాని శ్వాసను అంటియేవుండును. శ్వాసతో మనస్సు లీనమైనపుడు మనసు అమనస్కమైపోవును. అమనస్కమైనమన సుసర్వశక్తులు యోగమహిములు పొందుటకు అర్హమైయుండును దీనినే యోగవాశిష్ఠము నందు బుషుండోపాఖ్యనములో బుషుండుడు వసిష్ఠమహర్షులకుయోగమును గురించి చెప్పుచుదీనిని ప్రాణాపానగమనమని పేర్కొన్నారు.

ఈ ప్రాణాపానగమనం వల్ల యోగసాధకుడు త్వరగానసును స్వాధీనపరచుకొని నిస్సంకల్పస్థితి పొందుచున్నాడు. దినమునకు 21600 ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుగుచున్నవి. వీటిని విడవకుండా ఒక్కరోజు లెక్కపెట్టితే వాడెయోగి అన్నారు కైవారం యోగనారాయణగారు.

"కనుగ్రుడ్డు కనురెప్ప గదలనివ్వకపక్కజామునిల్పిన చాలు వాడుయోగి. ఎక్కుచుదిగుచున్న వాయువుల్ ఒక్క దినములెక్కపెట్టిన చాలు వాడుయోగి. నిదురమేల్కొనిలేచి నిడురవచ్చిన జాడతెలిసి చూచినా చాలువాడు యోగి

హెచ్చుక్రయంబైన ఇష్టవస్తువుల్ భ్రమలేక ఉన్నవాడెవ్వడో వాడుయోగి ఇన్ని గుణములు గల్గిన విజ్ఞానపరుడు వాడు యోగీంద్రుడన వచ్చు వసుధలోన॥

అంటూ యోగి లక్షణాలను గురించి చక్కగా ప్రవచించాడు. ఏ చింతాలేక నిశ్చితంగాయున్న మహానుభావుడే మహాయోగి, చింతలేని చిత్తంలో చిత్స్వరూప పరమాత్మ ప్రతిబింబిస్తాడు. ఏ చింతాలేనివాడే మహాయోగి.

**"యతో నిర్విషయస్యాస్యమనసోముక్తిరిష్యతే,**
**అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా"**
**అమృతబిందంపనిషత్**

ఎపుడైతే మనస్సు సర్వవాసనలు వదలి నిర్విషవాస్థితి గలుగునో అదియే ముక్తి గావున ముముక్షువైనవాడు సర్వదా మనసును వాసనారహితముగా నుంచుకొనవలెనని చెప్పబడినది అమృతబిన్దూపనిషత్తులో.

వాసనలులేని హృదయంలో వాసుదేవుడు కొలువై వుంటాడు. మనసు బహుజన్మల వాసనాప్రాబల్యమున సదా బహిర్ముఖమై విషయములపైకి పోవుచునే యుండును. అట్టి మనసపును ప్రయత్న పూర్వకంగా విషయాదుల నుండి మరలించి అంతర్ముఖము చేయుటే ధ్యానయోగము.

మనసుకు సదా ఏదో ఒక విషయ సంకల్పం చేయుట సహజం, అలా విషయ సంకల్పముగల మనసును ధ్యానమున నాసికాగ్రము ద్వారా వెళ్ళివస్తున్న శ్వాస ఉచ్ఛ్వాసలపైనిగా వుంచినచో తన సంకల్పముల మాని మనసు నిశ్చలమగును. మనసును శ్వాసపై నుంచి గమనించు అభ్యాసము స్థిరమగుకొలది, శ్వాసకూడ తగ్గుచుండును. శ్వాస తగ్గు కొలది సంకల్పాలు తగ్గిపోవుచుండును. ఇలా సాధన చేయగా కాలక్రమాన శ్వాసపూర్తిగా బైటికి పోక లోపలెనిల్చును. ఇది యెసహజకుంబకము. ఇది యోసమాధి ఈ సమాధియందు మనసు సంకల్పరహితమై బ్రహ్మమునందు లీనమగను.

ధ్యానమును గురించి భీష్ములవారు భారతమున దెల్పినది చూడదు.

**"సర్వసంకల్పసంశాంతౌ ప్రశాంత ఘనవాసనం'**
**నకించిద్భావనాకారం తద్బ్రహ్మపరమం విదుః॥**

సమస్తమగు సంకల్పములును శాంతింపగానణిగి పోయిన వాసనలు గలదియు, నేవిధమగు భావనయులేనిది యున గురూపమును పరబ్రహ్మముగానెఱుంగుము. అనివసిష్ఠుల వారా శ్రీరామచంద్రునికి దెల్పిరి.

ఈ ప్రాణాగమన రూపమగు ధ్యానమునందు సంసక్తమై బాహ్య విషయముల విడచిపెట్టి మనస్సుకొన్ని దినములలోనె వైకల్యమును పొందును. "ముక్కులోని గాలిముక్తికి బాటరా. అని ఈ అర్థమునే వేమనయోగి గారన్నారు.

ఈ విధంగా ప్రాణచింతననభ్యసించుచున్న పురుషుని యొక్క చిత్తము కుక్కతోలుచే చేయబడిన తిత్తియందు బ్రాహ్మణుడు ఆసక్తి గొననట్లు బాహ్యవిషయములు యందాసక్తి నొందదు. మరియు ఈ (ప్రాణధారణ, (ప్రాణాపానగమనము) నను సంధించి స్థిర బుద్ధులైయే యోగులున్నారో వారలు పొందదగిన బ్రహ్మ వస్తువును పొందినవారలు, దుఃఖరహిత స్థితిని

పొందినవారు. అనియోగవాసిష్టమున యోగస్వరూప పద్ధతిని జెప్పబడియున్నది. కావున సాధకులు పై దెల్పిన ప్రాణా ప్రాణగమనమును అనగా। శ్వాసపైనిగా వుంచడమే నాసికాగ్రముపై దృష్టినుంచడమని గ్రహించి సాధన గాలించవలయును. ఈ విషయమై విస్తారముగా తెలియగోరువారు యోగవాసిష్టము నిర్వాణ ప్రకరణమున భుషుండో పాఖ్యానమును చూడగలరు.

"బ్రహ్మచారి వ్రతేస్థితః॥ యోగాభ్యాసపరుడు బ్రహ్మచర్యమును తప్పక పాటించవలయును. యోగసాధనకు ముఖ్యంగా దీనిని మునులు భావించియున్నారు. సాధకుడు వీర్యసంరక్షణయందు కడుజాగరూకడుగా నుండవలెను. మానవుని మనుగడకు ఇదియే ప్రధానమైనది. దీపము నందలినూనె పైకి పోతే జ్యోతియై ప్రకాశిస్తుంది. క్రిందికి జారితే గలీజౌతుంది. అలాగే మనయందలి వీర్యము ఊర్ధ్వముఖమైతే ప్రజ్ఞాన జ్యోతిగా వెలుగునిస్తుంది. "బ్రాహ్మ చర్య వ్రతనిష్ఠాయాం వీర్యలాభః॥ బ్రహ్మచర్యవ్రతనిష్ట వలన బ్రహ్మవర్చసు లభించును. అనగా మేధస్సు పరిశుద్ధమై ఆత్మ జ్ఞానమునకు దోహదచేయును.

**శ్లో॥ ఆయుస్తే జోబలం వీర్యం ప్రజ్ఞాశ్రీశ్చ మహద్యశః।**
**పుణ్యంచమత్ప్రి యత్యంచ, లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్య మహత్తుచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, భగవదను గ్రహము గలుగుచున్నవి. అస్ఖలిత బ్రహ్మచర్య వ్రతనిష్టునికి అప్రయత్నంగా పండ్రెండు సంవత్సరములలో బ్రహ్మీశక్తి గల్గునని స్వామి వివేకానందుని మాట.

నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతము పరిపాలించుయోగి అష్టవిధ బ్రాహ్మచర్యమును కాపాడుకొనవలయును.

**శ్లో॥ శ్రవణం, కీర్తనం, కేళిః ప్రేక్షణం గుహ్యాభాషణం ।**
**సంకల్పోఽ ధ్యవసాయశ్చక్రియా నిర్వ ృతిరేవచ ॥**
**ఏ తన్మైథునమష్టాంగం, ప్రవదన్తి మనీషిణః ।**
**విపరీతం బ్రహ్మచర్యమనుష్ఠేయం ముముక్షుభిః ॥**

తా॥ 1. విషయ సంబంధమాటలను వినుట, 2. వాక్కుతో విషయముల గూర్చి మాట్లాడుట, 3. స్త్రీలతో ఆటలాడుట, 4. దుష్టభావనతో స్త్రీ పురుషులు పరస్పరము చూచుకొనుట, 5. ఆ విషయమై స్త్రీ, పురుషులు రహస్యముగా మాట్లాడుట, 6. ఆ విషయమై ప్రవర్తించుటకు కల్పించుట, 7. ఆ విషయమై ప్రవర్తించుటకు స్థిరము చేసుకొనుట, 8. విషయములలో ప్రవర్తించుట, ఈ ఎనిమిది విధములగు దోషములు లేనిదే పవిత్రముగు బ్రహ్మచర్యమునబడును.

బ్రహ్మచర్యమంటే బ్రహ్మమునందు చరించుట అనివేదాంతులు అర్థము చెప్పారు. బ్రహ్మప్రాప్తికి కావలసిన శ్రవణమనన, నిది ధ్యాసనలు సలుపటం బ్రహ్మచర్యమని వారిభావం. ఇది కూడ సమంజసమే, ఈ అర్థాన్ని గ్రహించుటం కూడ సాధకునికి మంచిదే.

ఈ విధంగా యోగి బ్రహ్మచర్యవ్రత పాలనాపరుడై "మనస్సంయమ్య మచ్చిత్తో । యుక్త ఆసీతమత్పరా అన్నట్లు.

ముందు పంద్రెండవ శ్లోకములో మనస్సు యొక్క ఏకాగ్రతను గురించి చెప్పటం జరిగింది. ఇపుడు మనస్సంయమం గురించి చెప్పుతున్నాడు. ఏకాగ్రత కుదిరిన తరువాతనే మనస్సును గురుకీలునందు (శ్వాసపైనిగా) నిల్పుటకు సాధ్యమగును. కావున సాధకుడు ఏకాగ్రత గల్గిగురుకీలుపై మనస్సు నుంచి ప్రాణా పానములను గమనిస్తూ ॥ ఆసీత అనగా కూర్చుండి పోవాలె. త్వరపడి ఆసనం నుండి ఎపుడంటే అపుడు లేవకూడదు. ఓపికతో సాధన సాధిస్తూ రావాలి. అపుడే యోగసిద్ధి గల్గుటకు అవకాశము భగవదను గ్రహం గల్గుతుంది.

కనీసం పూటకు మూడుగంటలకాలం అయినా సాధనకు కాలాన్ని వినియోగించవలెను. కాలక్రమేన రోజుకు 12 గంటలు సాధన యందు కాలాన్ని గడిపినపుడే యోగసిద్ధిగలుగుటకు అవకాశము కలుగుతుంది.

సాధకులు సిద్ధిపర్యంతం ఉత్సాహమును ధైర్యమును, పట్టుదల వదలరాదు. మధ్య మధ్య యోగ విఘ్నములు గలిగినను. నిరుత్సాహపడక మళ్లీ ధైర్యముతో ఉత్సాహంతో సాధనకుపక్రమించి సిద్ధి పొందాలె, కొందరు అల్ప స్వల్ప విఘ్నములకే జంకి విషయాసక్తులై సంసారంలో పడిపోతుంటారు గాన తీవ్రము ముక్షుత్వం గలవారు ఎన్ని విఘ్నములొచ్చిన పారం ముట్టువరకు సాధన వదలరాదు.

**శ్లో॥ ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిశక్తి పరాక్రమః ।**
**షడతేయత్రతిష్ఠిన్తి తత్రదేవోపితిష్ఠతి ॥**

అని శ్రుతివచనం, 1. ఉత్సాహము 2. సాహసము, 3. ధైర్యము, 4. బుద్ధి, 5. శక్తి, 6. పరాక్రమము అనునీయారు గుణములు గల సాధకునికి తప్పక ఆత్మసాక్షాత్కారము గల్గును.

**శా॥ ఆరంభింపరు నీచమానవులు, విఘ్నాయాస సంత్రస్తులై**
**యారంభించి పరిత్యజింతురారీ, విఘ్నాయస్తు మధ్యముల్**
**ధీరుల్ విఘ్ననిహన్య మాన్యులగుచున్, ధృత్యున్నతోత్సాహులై**
**జ్ఞగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్ ప్రారద్ధార్థములు**

అని భర్తృహరి హితోక్తి కావున సాధకులు సాధనా మార్గమునుండి ఎన్ని

విఘ్నములెదురైనను ఎదుర్కొని పూర్ణ సిద్ధిని పొందువరకు సాధన విడువరాదు. అలాంటి ధృఢతునికి కలుగు లాభమేమిటనిన పరమాత్మ స్థానమగు పరమనిర్వాణమును, సుఖముగా పొందగల్గుచున్నాడు. మనసు చలంతో జీవాత్మ అయినవాడు. మనో నిశ్చలతో పరమాత్మ కాగల్గుతున్నాడు. బియ్యం గింజకు, వడ్లగింజకు తేడా, మధ్య పొట్టు మాత్రమే, పొట్టువున్నంతవరకు వడ్ల గింజ పొట్టు తొలగిపోగా బియ్యం గింజ అవుతుంది.

అలాగే జీవాత్మకు పరమాత్మకు తేడామనసే, మనసు అమనస్కమైతే జీవాత్మే పరమాత్మ, పరమాత్మ కొత్తగా పొందబడేది గాదు. అది నిత్యసిద్ధం అయ్యేవుంది. మనసంచలనం, విషయాసక్తి తొలగితే అత్మతానే అయివున్నాడు. ఆత్మప్రాప్తి, అప్రాప్తిప్రాప్తిగాదు. ప్రాప్తప్రాప్తి.

అర్జునా! అట్టిప్రాప్తి రూపమైన పరమాత్మస్థితి పొందుటకు యోగసాధకులకు వుండవలసిన ఆహార విహారాదులగురించి కూడా కాస్త విను.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగో౽స్తినచైకాంతమనశ్నతః ।
నచాతి స్వప్నశీలస్యజాగ్రతోనైవచార్జున ॥

అతిగాతినియెగబోయువానికి, అస్తులు పస్తులతో అమలటించు వానికి, మితిమీరి నిద్రబోవు వానికి, అమితముగా నిద్ర మేల్కొను వానికి, యోగము ఫలించదు.

వీణకుగల తంతులను పూర్తిగా మితిమీరి బిగించిన తెగిపోవును. మరీ వదులుగా బిగించిన వీణ అపశ్రుతి పలుకును. గాన వీణావాయిద్యపరుడు సమానస్థాయిలో తంతువులను బిగించునట్లు, సాధకుడు మితాహారపరుడు కావాలె. అతి ఆహారం అనర్థాన్ని కల్గిస్తుంది. మితాహారం మతికి హాయినిస్తుంది. అలాగే నిద్రకూడ తగినంత మాత్రమే వుండాలె, కుంభకర్ణునిలాగా పగలంతా పడి వుండేవానికి ధ్యానం ముట్టరానికబలం, అట్లని పగలంతా రాత్రంతా జాగరణ చేయువారికి యోగం సిద్ధించదు. సరిగాదా అట్టివారికి ఆరోగ్యం చెడి రోగం వచ్చే అవకాశం వుంది. కాబట్టి ఆహార నిద్రాదులందు మితంగా ప్రవర్తించాలి.

చ॥ వనరుచునేమియున్ దిననివానికి మిక్కిలి వెక్కసంబుగా
దనియెగబోయువానికినిదీరని నిద్దురయెల్ల ప్రొద్దు బై
కొనబడియుండు వానికిని గొంకరేబగలొక్క రీతి మే
ల్కొనివసించువానికి నగోచరముల్వరయోగ లక్ష్యముల్

అని సీతారామాంజనేయ సంవాదము. అతి సర్వత్రవర్జయేత్, అన్నట్లు అతి ఎందునా పనికిరాదు. సాధకునకు తినడం తిరుగడం, నిద్రబోవడం అన్నియు మితంగానే వుండాలె, అతిగా వున్న వానికి అనర్థాలు తప్పవు. యోగికి కావలసింది యోగజీవితమే గాని భోగజీవితంగాదని గుర్తెరుగవలె భోగలాల సులకుయోగం పట్టుపడదు.

బ్రతుకుటకై తినువాడు బుద్ధుడు, తినుటకై బ్రతుకువాడు బద్ధుడని శ్రమళయాళ సద్గురు స్వాముల వారనే వారు ఆహార విషయము గురించి యోగవాసిష్ఠమున వసిష్ఠులవారు దెల్పినది చూడుడు.

॥ పూరయేదశనే నార్థం తృతీయముదకేనతు,
వాయోస్సంచరణార్థాయ, చతుర్థమవశేషయేత్ ॥

సగముపొట్టను అన్నముతో నింపవలయుననియు, మిగతా సగభాగములో ఒకభాగమును నీటితో నింపవలయుననియు, మిగిలిన నాల్గవ భాగమును గాలిసంచారమునకై ఖాళీగా వుంచవలయుననియు దెల్పిరి. కావున ఆహారనియమాన్ని సాధకుడు జాగ్రత్తగా కాపాడుకోవాలి. సమస్థాయిలో నడుపుకోవాలె.

అతి ఆహారం భుక్తాయాసం గల్గిస్తుంది. అతినిద్రగల్గించి, తమోగుణానికి దారితీస్తుంది. అలాంటి వానికి యోగం కుదురదు. మరీతక్కువగాను ఆహారం ఉండరాదు. ఆకలిమిక్కుటమైతే మనో ప్రాణములు బలహీనమైపోతాయి. అసలు కూర్చోటానికి కూడా చేతకాకుండా పోతుంది. కావున సాధకుడు హితమైన ఆహారమును మితంగా తీసుకొనవలయును. అలాంటి హితమిత ఆహారము మనస్సుకు హాయినిస్తుంది. దేహానికి చురుకు తనాన్ని ఇస్తుంది. సాధన యోగ్యముగాను వుంటుంది.

నిద్రకూడ సాధకునికి మితంగానె వుండాలె, నిజమైన యోగి రోజుకు నాలుగు గంటలు మాత్రమే నిద్రకు వినియోగించాలె. అంతకుమించి నిద్రకు అవకాశము యిస్తే దుస్వప్నాలతో కాలందురపయోగమైతుంది. అసలే నిద్ర లేకుండా కూడ వుండరాదు. అదికూడ సాధనకు మత్తత గల్గించి అనారోగ్యానికి, మతి భ్రమణకు కారణమవౌతుంది. అతనిద్ర తమోగుణాన్ని పెంచితే అతిజాగరణ రజోగుణాన్ని పెంచుతుంది. గాన సాధకుడు ఇవి రెండు వదలి మధ్య మార్గాన్ని అవలంభించాలి.

ఈ విధంగా క్రమబద్ధంగా ఆహారవ్యవహార నిద్రాదులందు మితమెరింగి యోగాభ్యాసం చేయువారలకు "యోగోభవతి దుఃఖహా॥ త్రివిధములగు ఆధ్యాత్మిక, అదిభౌతిక, ఆధిదైవక దుఃఖముల నుండి యోగము విముక్తిన్ని చేస్తుంది. యోగాభ్యాస ప్రాబల్యము వల్ల చిత్తవృత్తులన్నియు నిరోధించబడుతాయిగాన సుఖదుఃఖముల ప్రసక్తి యోగికి లేదు. అటుగాక అస్తవ్యస్తంగా ఇష్టమొచ్చినట్లు యోగము చేసిన రోగకారకమై కూర్చుంటుంది.

అయ్యా! అర్జునా! ఇంతవరకు యోగము యొక్క అంతరంగిక బాహ్యాంతరముల ప్రక్రియను గురించి విన్నావు. అలా యోగమునందు ఆరితేరిన పూర్ణయోగి దశయెట్టిదో అది కూడా విను.

శ్లో ॥ యదావినియతం చిత్తం / ఆత్మన్యేవావతిష్ఠతే ।
నిస్పృహాసర్వకామేభ్యో । యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 6-18

చిత్తము అడగి వృత్తి రహితమై ఆత్మానుసంధానమున నిష్ఠకుదిరిన దైనచో, అట్టియడకామనలన్నింటిని త్రోసిరాజని, యోగి, యోగసిద్ధిని పొందగల్గుచున్నాడు.

యోగాభ్యాస సాధకుడు ధ్యానమునందు కూర్చుని భ్రూమధ్య స్థానమున దృష్టినుంచి శ్వాసపైనిఘా వుంచి సాధన చేస్తూరాగా, క్రమేపి, చిత్తమునందలి వృత్తులు నశిస్తూ మనసు నిర్మలమగును. అలా నిర్మలమైన మనస్సులో ఏ వికారములు లేక ప్రశాంతమైన స్థితిగల్గును. నిర్మలమైన నీటిలో అట్టడుగున వున్న వస్తువులు కనుపించునట్లు, వృత్తి రహితమైన ప్రశాంత హృదయములో ఆత్మదర్శనము గల్గును. ఇట్టి స్థితి యందు మనస్సు బ్రహ్మాకార స్థితియుండుటవలన ఎట్టి కామనలు కూడ అట్టి బ్రహ్మస్థితి పొందిన మనసు ఆకర్షింపలేవు. ఇట్టి స్థితిని గురించి సీతారామంజనేయ సంవాదము ఎట్లు వర్ణించినదో చూడుడు.

మ॥ వనితానందనచందనాది విషయవ్రాతంబులం బొంది, చ
య్యనవంతంతకు జొక్కునెమ్మనము బ్రహ్మానందవారాశి వా
సనయొక్కించుకసోకెనేని బ్రవినాశం బొందునా నాద్రుపు
ష్పనటద్భృంగము చంపక ప్రసవసంస్పర్శాప్తి గూలుంగతిన్ ॥

తుమ్మెదనానా విధములగు వృక్షము యందలి పుష్పములయందు సంచరించుచు అందలి మకరందాన్ని గ్రోలి ఆనందించుచుండును. కాని సంపెంగి పుష్పము యొక్క స్పర్శసోకినచో వెంటనే నశించును. ఆ ప్రకారముగనే మనస్సు ప్రాపంచక విషయాదులయందు అనగా స్రక్చందనవనితాదుల పై దిరుగుచు ఆనందించుచుండును. అట్టి మనస్సు బ్రహ్మానందము యొక్క జాడసోకినచో వెంటనే నశించును. అనగా బ్రహ్మానందమున లీనమగును మరియు

తే॥ ఇతర సంకల్పములులేక యెపుడుదాను
సచ్చిదాత్ముడనని సుప్రసన్న వృత్తి
దన్ను గనువానిచిత్తంబుదనకు దాన
పోలియుదనయంద యింధనానలము పగిది.

నేను చిత్స్వరూపుడను నేనుభూత భవిష్యత్ వర్తమాన కాలము లందు నశింపనివాడను, జ్ఞానస్వరూపుడను, సచ్చిదానందరూపమైన బ్రహ్మమును నేను అని ఇతర సంకల్పములు లన్నియు విడచిపెట్టి నిర్మలచిత్తముతో సదా ఉన్నటివాడు బ్రహ్మవేత్త. అట్టి వాని మనస్సు కట్టె యందలి నిప్పువంటిది. కట్టెయందలి నిప్పు కట్టెను దగులబెట్టి తాను కూడా నెట్లు నశించునో ఆ ప్రకారంగా బ్రహ్మవేత్త యొక్క మనస్సు కూడ తనయందె తాను నశించును.

అనగా! పరిపూర్ణ యోగసిద్ధిని పొందిన వాని చిత్తము ఉండియులేనట్లు వుండును. మిట్ట మధ్యాహ్నం ఎండలో పెట్టిన దీపము వలె చిత్తము చేష్టలు డిగియుండునని అర్థము. అసలే చిత్తముండదనిగాదు. మిట్టమధ్యాన్నం ఎండలో వుంచిన దీపం వుంది. అందమా దాని ప్రకాశం సూర్యప్రకాశంలో లీనమై పోతుంది. లేదందామా కంటికి కనిపిస్తూ వుంటుంది. అలాగే పూర్ణయోగి చిత్తము కూడ వున్నట్లు వుండినా! దానివృత్తులేవి లేవు గాన వున్నా లేనట్లే గ్రహించాలె. కావున పూర్ణయోగి యొక్క స్థితి జాగ్రత్తగాదు. సుషుప్తిగాదు. స్వప్నము అంతకంటే కాదు. ఆ స్థితి ఈ మూడువస్థలకు అతీతమైన స్థితి.

"యథాదీపోనివాతస్థో - నేంగతేసోపమాస్మృతా ।
యోగినోయత చిత్తస్య - యుంజతోయోగమాత్మానః ॥ 6-19

ఆ మహాయోగి యొక్క చిత్తము, గాలిలేని చోట దీపమువలె స్థిరంగా వుండునని చెప్పబడింది. కాని కొండవలె స్థిరంగా వుండునని చెప్పలేదు. కారణమేమంటే కొండజడం, దానికి చలనస్వభావం లేదు. అ ఉపమానం ఇక్కడ అన్వయించదు అని అర్థం. దీపానికి చలించే స్వభావం వుండి కూడ చలించక ఉండడమే విశేషం.

చిత్తవృత్తి రహితమై నివాతదీపమువలె వుండేస్థితిని అసంప్రజ్ఞసమాధి అని యోగశాస్త్రకారులు పేర్కొన్నారు. సంప్రజ్ఞా సమాధి, అసంప్రజ్ఞ సమాధి అని, సమాధి రెండు రకాలు అందులో సంప్రజ్ఞాత సమాధిలో చిత్తమునగల వృత్తులు అణగి వుంటాయి. సమాధి నుండి బహిర్ముఖంకాగానే యధావిధిగా వృత్తులు ప్రకోపిస్తాయి. కాని అసంప్రజ్ఞాసమాధి యందు వృత్తులు రహితమైవుండును గాన చిత్తంబహిర్ముఖమైనప్పటికి చిత్తవృత్తులు గలుగనేరవు. ఇదియే జీవన్ముక్త స్థితి. ఈ స్థితిని గురించే భగవానుడు ముందు శ్లోకములలో చెప్పబోవుచున్నాడు.

"యత్రోపరమతే చిత్తం । నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం । పశ్యన్నాత్మనితుష్యతి ॥ (6-20)

యోగప్రాబల్యము అధికమించుకొలది చిత్తమునందలి సర్వవృత్తులు కూడ శమించును. అట్టి వృత్తులు శమించిన చిత్తము నందు మాత్రమే ఆత్మానందం కల్గును.

వృత్తితో కూడిన చిత్తము బహిర్ముఖమై చిత్తచాంచల్యమును గల్గించి అశాంతికి కారణమౌతుంది. ఒకవేళ విషయములగుండా ఆనందం గల్గునుగదా? అన్నచో అది ఆనందం కాదు. ఆనందాభాస, ఆనందమువలె తోచు దుఃఖములే యగును.

రాజాధిరాజ కుమారుడైన సిద్ధార్థుడు శుద్ధోదనికి అన్ని విషయ భోగాలున్నను శాంతిలేక సర్వసంగ పరిత్యాగం చేసి మనసును అంతర్ముఖం చేసుకొని బుద్ధుడైనపుడే ఆద్యంతిక దుఃఖ నివృత్తి, ఆనందప్రాప్తిని పొందగలిగాడు. ఆత్మలాభం అన్ని లాభములకన్న

మిన్న ఈ ఆత్మానందం ఒకతూరి కలిగితే మళ్లీ తొలిగేదికాదు. ఆ ఆత్మదర్శనం గల్గువరకు సాధకుడు అకుంఠిత దీక్షతో, ఇంద్రియ సంయమము గల్గి దృష్టిని అంతర్ముఖంచేసి నిశ్చలమనస్కుడై సిద్ధిపర్యంతం సాధన చేయవలసి వుంటుంది.

ఒక్కొక్క మారు యోగిరసాస్వాదనలో పడిపోయె అవకాశము కూడా రావచ్చు. కాని సద్గురువుల అనుగ్రహంతో వివేకజ్ఞానంతో దాన్ని దాటి ముందుకు పోవాలె. రసాస్వాదనమంటే ఆత్మ దర్శనం కలుగకపోయినా! మనసుపొందినట్లు సాధకుని మోసం చేస్తుంది. రావణబ్రహ్మ సీతమనసును లొంగదీసుకోవడానికి మాయారామ లక్ష్మణుల తలలను జూపినట్లు మనసు కూడ ఆద్యంత్మిక దుఃఖ నివృత్తి రూపకమైన ఆనంద ప్రాప్తిని పొందక పోయినా పొందినట్లు అనిపింపజేస్తుంది. దీన్ని సాధకుడు బాగా గమనించి సాధన విరమింపక దృఢవ్రతుడై సాధనలో మునిగిపోవాలె.

యోగం సిద్ధించినందుకు దుఃఖసంయోగం వియోగం కావలయును. ఏకించెత్ దుఃఖసంయోగమున్న ఇంకా సిద్ధి లభింపలేదని భావించాలె.

సిద్ధిపొందిన యోగి ఇంద్రియాతీతమై బుద్ధిగ్రాహ్యమైన కాలాతీతమైన బ్రహ్మానందమును పొందుచున్నాడు. ఇట్టి బ్రహ్మానందస్థితి పొందిన యోగి పుంగవుడు ఎట్టి పరిస్థితులలోను కలత జెందక బ్రహ్మానందపరుడై యుండును. కావుననే అట్టి యోగిస్థితిని గురించి చెప్పినది జూడుడు.

**మ॥ శివజీవైక్య సమాధియందు విలసచ్చిన్మాత్రతత్త్వంబు, దా**
**నవలీలంగని పూర్ణుడై పిదపమాయాసంసృతిం జెందినన్**
**దవులన్నేర్చునెయోగి, పాలుపెరుగై ద్రచ్చంగ వేత్తైన యా**
**నవనీతం బికజల్లలోగలివయునే నానాప్రకారంబులన్॥**

అసంప్రజ్ఞసమాధి సంపాదనాపరుడైన యోగిపుంగవుడు తన జీవస్వరూపమును పరమాత్మ స్వరూపమునందు లీనంచేసి, పెరుగును చిలికి తీసిన వెన్న మళ్ళీమజ్జిగతో ఎలా కలువదో పరమాత్మస్థితి పొందిన యోగిపుంగవుని చిత్తము ప్రకృతి గుణాలనంటదు. దుఃఖంగాని, సుఖంగాని మనో వికారములె, ఆత్మయందు అట్టి వికారము లేవియు లేవు. ఆత్మస్థితి పొంది ఆత్మజ్ఞానం పొందిన మహాత్మునికి ప్రారబ్ధవశాత్ కష్టములొచ్చినా వాటికి చలింపడు. దుఃఖానికి కారణమైన దృశ్యముతోటి సంబంధ, యోగబలంతో దాటిన వాడు గాన అట్టి యోగికి ఆనందం తన స్వరూపమై యుంటుంది.

అర్జునా! తరువాత విషయం విను, యోగారూఢుని గురించిన విషయం.

**"సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।**
**మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 6-24 శ్లో॥**

"శనైశ్శ నైరుపరమేత్ బుద్ధ్యాధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనఃకృత్వానకించి దపి చింతయేత్ ॥ 6-25 శ్లో॥

యోగాభ్యాసతత్పరుడు, సంకల్పజన్యములగు కోరికలను పూరవదలి, మనస్సుతో ఇంద్రియాలను నిగ్రహించాలి. ధైర్యయుక్తమగుబుద్ధి చేత విషయములను, మెల్లమెల్లగా ఆ[illegible]ంచి మనస్సును, ఆత్మయందె నెలకొల్పి యోగి నిశ్చింతుడు కావలయును.

బంధమోక్షములకు మనసే కారణమని అమృతబిందూపనిషత్.

మనస్సు అనగా! నేమి సంకల్ప, వికల్పాలెమనస్సు యొక్క స్వరూపం. సంకల్పమనగా! తనకు అధీనమైన విషయములగురించి చింతించడం, వికల్పమనగా! లేనివాటిని గురించి చింతించడం, ఈ రెండింటిని విడచి మనస్సు ఉండదు. ఎపుడు మనసు తనకున్న వాటిని గురించి లేని వాటిని గురించి యోచిస్తూనే వుంటుంది. ఈ సంకల్ప వికల్పాలున్నంతవరకు మనసుకు నిశ్చలత లేదు. అలానిశ్చలతలేని మనస్సు యోగమునందు నిలువలేదు. కాబట్టి యోగసాధకుడు ఈ సంకల్ప వికల్పాలు లేకుండా మనసును నిర్మలం గావించుకోవాలె.

ఈ సంకల్ప వికల్పాల ప్రవాహమును దాటుటే యోగం యొక్క ప్రక్రియ నదీజలాన్ని దాటవలసినవచ్చినపుడు, దానిపై ఒకవంతెన నిర్మించి ఎలాదాటగలుగుతారో, అలాగే? ఈ సంకల్ప ప్రవాహమును దాటుటకు ఒక వంతెన అవసరం ఆ వంతెనే సోహంభావమన్నారు పెద్దలు. లేక ప్రాణా ప్రాణగమనం అనగా! శ్వాసపై నిగా వుంచడం; అన్నమాట. సహజంగా మనకు గల్గు శ్వాస ఉచ్ఛ్వాసముల యందు మనసును చక్కగా నిఘవుంచిలోనికి వచ్చు శ్వాసతో "సో" అనియు, బైటికి వెళ్ళు శ్వాసతో "హం" అనియు ఈ ప్రతిప్రాణాపానములయందు సోహంభావమును గల్గిగాని లేక పూరకె ప్రతిప్రాణాపానములను గమనిస్తూ వుండటం వల్ల మనస్సు అన్య సంకల్పములు మాని శ్వాసనే నిగాకుదురుతువచ్చును. ఇలా సాధన ప్రాబల్యమువలన క్రమక్రమంగా మనస్సులోని సంకల్పాలుడిగి మనసు నిర్మలమగును.

నిర్మలమైన మనస్సు బాహ్యంగా విషయాదులపై పోవక అంతర్ముఖమయ్యే యుండును. అంతర్ముఖమై తన యందె తానుండుటచేత బాహ్యేంద్రియ సంయోగం కూడ మనసు మనసు నుండి వియోగమగుటచేత యోగి యొక్క మనసు సమాధిని పొందుచున్నది. ఇట్టి అభ్యాసము చేత యోగం సిద్ధించు చున్నది.

ఈ విధంగా యోగాభ్యాసకుడు ప్రాణాప్రాణ గమనంతో చిన్నచిన్నగా మనసును అంతర్ముఖం చేసుకొని, బాహ్యేంద్రియముల సంయోగమును విడచి ఆత్మయందే సంలగ్నము చేయవలయును. అలా అభ్యాసం వలన ఇంద్రియ మనస్సులు నిర్మలమై యోగనిష్ఠయందు నిలకడ జెందుచున్నది.

తే॥ ఆత్మతే జంబు వీక్షించు నతని మాన
సేంద్రియంబులు చేష్టలనెడల విడచి
యొదిగి చెదరక కదలక యూరకుండు.
సింగములగన్నగజముల భంగిననఘ.

అని సీతారామాంజనేయ సంవాదము. సింహముల ఏనుగులు ఎలా తమ చేష్టలుడిగి భయభ్రాంతులతో కదలక నిలుచుండిపోతాయో, ఆ విధముగా యోగనిష్ఠయందు బ్రహ్మస్థితి పొందినవాని మనసు ఇంద్రియములు తమతమ సంకల్పవ్యాపారముల మాని కదలక మెదలక నిర్మలమై పోతాయి. చలస స్వభావం మనసుకు స్వభావ సిద్ధము గదా దానిని నిల్పివుంచడం అనుకొన్నంత సులభంగాదు. మాటలు ఎన్నైనా చెప్పవచ్చు చెప్పినట్లు చేసి చూపించడమే గొప్ప అని సందేహింప పనిలేదు. పురుషప్రయత్నంతో దాన్ని మనస్వాధీనం సేసుకోవచ్చును.

**"యతోయతో నిశ్చరతి - మనశ్చంచలమస్థిరమ్ ।**
**తతస్తతోనియమ్యైత - దాత్మన్యేవవశం నయేత్ ॥ 6-26**

అర్జునా! మనస్సు యెప్పుడు చలించిపోవుచున్నదో అపుడపుడే దానిని, నిగ్రహించి ఆత్మీయత్తము చేయుటకై యోగి ప్రయత్నించుచుండవలెను.

సాధనలో మనస్సు వున్నట్లుండి వేమరుపాటు గల్గించి విషయాదులపై పరుగెత్తుచుండును. దీని పోకడ గుర్తించడం మహాకష్టం అయినా సాధకుడు ధైర్యముతో దాని పోకడ గమనించి ఆత్మవైపు మళ్లిస్తూవుండాలె. విషయాదులు యందలి అనిత్యాన్ని వాటివల్ల గలిగె దుఃఖాన్ని దానికి బాగా బోధిస్తూలాలిస్తూ మనస్సును అంతర్ముఖం చేసుకుంటూ వుండాలె. మనసుపోయినట్లు బుద్ధిని పోనిస్తే దాని ఆటకట్టడం సాధ్యము గాదు. ధ్యానసమయములో ఏవేవో తలాతోక లేని ఆలోచనలోకి తీసుకవెడుతుంది. దాన్ని బుద్ధి బలంతో ఆత్మవైపు లాగుతూవుండాలె.

మనసు కోరినట్లు శరీరాన్ని పోనివ్వక పట్టుదలతో ధ్యానములో కూర్చో బెట్టాలె. ధ్యానసమయంలో సినిమాకు పోవాలంటుంది. పోదాంలనేదానికి వాయిదాలు వేస్తూ వుండాలి. అలా చేస్తూరాగా, గూటానికి బంధించిన పశువుచుట్టు దిరిగి మళ్లిగూటము దగ్గరకు వచ్చునట్లు, మనసు కూడ చింతించి చింతించి విసిగి చల్లబడిపోతుంది. అలా చల్లబడినపుడు చిన్నగా ఆత్మానందము వైపు దాన్ని మళ్లిస్తూ ఆత్మానందాన్ని చింతిపచేస్తూ రావాలె.

రమణ మహర్షుల వారిదగ్గరకు ఒక భక్తుడు వచ్చి స్వామీ నామనస్సు ధ్యానములో నిలువలేదు ఏమి చేయాలె అని విన్నవించుకొన్నాడు. అందుకు మహర్షులవారు అన్నారు నా మనస్సు ధ్యానంలో నిలువలేదని అంటున్నావే. మనసు నీవుగాదుగదా! మనసుధ్యానంలో నిలిచేది నిలవంది చూచి తెలుసుకొనే సాక్షివి నీవు. గాన మనసు వేరు నీవు వేరు. అలాంటప్పుడు మనసు పోతే పోనీ నీవు మాత్రం పోకపోతే సరి అన్నారు.

అనగా! మనసే మనమైపోరాదు. మనసుకుద్రష్టంకావలె అయ్యేదేమిటి అయ్యే వున్నావు. అలా నీవుద్రష్టస్థానంలో వుండి. మనస్సు సుదృశ్యంగా చూస్తువుండు. దృశ్యం యొక్క ద్వందాలు ద్రష్టను అంటజాలవు. ఇలా సాక్షిగా మనం వుండిపోయినవుడు మనో వికారాలేవి చలింపజేయజాలవు. ఇలా సాక్షిభావాన్ని అభ్యసించినపుడు క్రమంగా మనో వికారాలు గూడా మటుమాయమై మనస్సు నిశ్చలత పొందుతుంది.

**తే॥ ఇంద్రియమనంబులటు చలించె నేని**
**నే జలించితినంచు నీ వెఱుగ బోకు**
**నిశ్చలుండనంచు దెలియుమునిన్ను గాంచి**
**యలియునతి నిశ్చలములగునంత మీద ॥**

అని సీతారామాంజనేయ సంవాదము. కావున మానసేంద్రియముల నెల్లదృశ్యములుగా భావించి నేను నిర్వికారుడను. నిర్మలుడను వాటి చలాచలములు నంటవు అని సాక్షి భావముగా యుండినచో అవికూడ నిశ్చలత పొందుచున్నవి.

**"యుంజన్నేవం సదాత్మానం - యోగీవిగత కల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శం - అత్యంతం సుఖమశ్నుతే ॥ 6-28**

పై శ్లోకములో చెప్పినట్లు ఎవడైతే మనస్సును ఆత్మస్వరూపము నందు నిలుపగలుగుతాడో, శివజీవైక్యాన్ని కోరుతాడో వాడే యోగి, వానిచిత్తము విషయముల నుండి విముఖత నొంది శాంతి పొందుతుంది. అందువల్ల వాని చిత్తానికి రజోగుణతమోగుణములైన విక్షేపాలు లేవు. పాపరహితుడయ్యాడు. బ్రహ్మ సంస్పర్శచే బ్రహ్మస్వరూపుడైపోయాడు. అందువల్ల సర్వోత్కృష్టమగు సుఖము చేకూరుతుంది.

పరుసవేదని సోకి ఇనుము బంగారు అయినట్లు, యోగాభ్యాసప్రభావము వలన విగత కల్మషుడైన యోగిబ్రహ్మానంద సుఖమును పొందుచున్నాడు. అలాధ్యాన యోగము ద్వారా సర్వాత్మ దర్శనం పొందిన యోగి యొక్క స్వరూప స్వభావముల గురించి భగవానుడు మూడు శ్లోకముల ద్వారా వివరిస్తున్నాడు వినండి.

**"సర్వభూతస్థమాత్మానం - సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతేయోగయుక్తాత్మా - సర్వత్ర సమదర్శనః" ॥ 6-29**

ఈ విధంగా యోగాభ్యాసంతో యోగసిద్ధిని పొందినయోగియల్లడల సమదృష్టి గలవాడై తన్ను అన్ని భూతములందు, తనయందు అన్ని భూతములను చూచుచున్నాడు.

యోగి అంటే గోళ్లు జడలు గడ్డాలు పెంచుకొని అస్తులు పస్తులు వుండి కొండగుహలలో వుండే వారు గాదు సర్వత్రసర్వాత్మభావ గల్గినవాడని అర్థము. యోగికి గాని జ్ఞానికి గాని బాహ్యవేషం ప్రధానం గాదు. అంతరంగిక ఆత్మ సంపద ముఖ్యము ఆ

విషయాన్నే భగవానుడు మూడు శ్లోకముల ద్వారా తెలుపుతున్నాడు. ఇక్కడ నుండి 31వ శ్లోకం వరకు తత్త్వమసి మహావాక్య బోధ అందిస్తున్నాడు.

అందరికి తానున్నానే సంగతి తెలుసుకాని తాను అనగా ఎవరో తెలిసన వారు చాల తక్కువ ప్రతివాడు తాననగా ఈ మంసమయ శరీరాన్ని గురించే భావిస్తున్నాడుగాని అఖండమై అపరిచ్ఛిన్నమై సర్వభూతాత్ముడనే భావాన్ని గ్రహించలేక పోతున్నాడు.

ఒకతూరి రామతీర్థస్వామి అమెరికా వెళ్ళాడు స్టేషన్‌లో దిగగానే ఒకాయనవచ్చి స్వామి లగేజి ఏమైనా వుందా అని అడిగాడు. అవును వుంది అన్నాడు. స్వామి ఎంతవుంది అని అడిగాడు 90 కేజీలు వుందన్నాడు. ఏది? ఇదిగో అని స్వామి తన శరీరాన్ని జూపించాడు అడిగిన వ్యక్తి తెల్లముఖం వేసి చూశాడట.

ఆటో రిక్షావాడొకనాడు శ్రీరమణ మహర్షులవద్దకు వచ్చి స్వామి ఈ బండ్లోకూర్చునండి నేను ఫోటో తీసుకోవాలన్నాడు. అందుకు మహార్షులవారన్నారు. నాయనా! ఇపుడుండే బండిచాలదా, ఈ బండికి మళ్ళీ బండెందులకు.

అలాగా! మహాత్ములెప్పుడు కూడా దేహాత్మ భావన వదలి బ్రహ్మాత్మ భావనగల్గే వుంటారు. వారి దృష్టిలో సర్వం వాసుదేవమయం, వారి దృష్టికి ఆత్మేతరమైనది ఏది లేదు. అధిష్టానదృష్టి గల్గిన వారికి ఆరోపితవస్తుజాలాలు, మిధ్యలైపోతాయి. అందువలన నామరూపాలతో తోచు ఈప్రపంచమున ఏది ఆ మహాత్ముల మనస్సును ఆకర్షింపజాలదు. తత్త్వమసి అనే మహావాక్యంలో తత+త్వం+అసి, అని మూడు పదాలున్నాయి. త్వంపద వాచ్యార్థము జీవుడు. తత్పద వాచార్థం ఈశ్వరుడు అసిపదం జీవేశ్వరుల ఐక్యతసు సూచిస్తుంది. ఈ ఇద్దరికి ఏకత్వ ఉపాధుల దృష్ట్యా గలుగదు. భాగత్యాగలక్షనము చేత ఉపాధలను నిరసించినపుడు, త్వంపద లక్ష్యార్థము అయిన జీవసాక్షికూటస్థునికిని, తత్పదలక్ష్యార్థము ఈశ్వరసాక్షి అయిన పరబ్రహ్మమునకు, నిరుపాధికములకు ఏకత్వము సిద్ధించుచున్నది.

పై శ్లోకమునత్వం పదార్థశోధన చెప్పబడింది. ఈ క్రింది 30 శ్లోకమున తత్పదార్థశోధన చెప్పబడుతూవుంది. పాఠకులు కుశాగ్రబుద్ధితో గ్రహించాలె.

**"యోమాంపశ్యతి సర్వత్ర - సర్వంచమయిపశ్యతి ।**
**తస్యాహంన ప్రణశ్యామి - సచమేన ప్రణశ్యతి ॥ 6-30**

అయ్యా ! అర్జునా సర్వభూతములందు నన్ను, నాయందు సర్వ భూతములను ఎవడు చూచుచున్నాడో అట్టివానికి నాకును భేదము లేదు, అనగా! వాడు బ్రహ్మమయ్యే వున్నాడని గ్రహింపుము. మహాకాశము, ఘటాకాశము రెండు వేరువేరుగా అనిపించి నారెండింటి యందు వుండునది ఒకే ఆకాశమే, అలాగే పూర్ణసిద్ధి గాంచిన యోగికి పరబ్రహ్మమునకు వాచాభేదమేగాని వస్తుతః భేదము లేదు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అన్నట్లు బ్రహ్మము పొందిన వాడు బ్రహ్మ అయ్యే వున్నాడు.

కావున అర్జునా! అట్టి బ్రహ్మస్థితిగాంచిన యోగికి నాకును ఏవిధమైన తేడా లేదు. నన్ను విడచి ఆయనగాని, ఆయన్ను విడచి నేను గాని లేము. మా ఇద్దరి సంబంధం విడదీయరాని ఏకస్వరూప సంబంధం.

ఈ విధంగా తత్పదలక్ష్యార్థాన్ని చెప్పి ఇపుడు "అసి, పదార్థ నిశ్చయం ఈ క్రింది శ్లోకం ద్వారా బోధిస్తున్నాడు.

**శ్లో॥ సర్వభూత స్థితంయోమాం - భజత్యేకత్వ మాస్థితః ।**
**సర్వథావర్తమానో . పి-సయోగీమయివర్తతే ॥ 6-31**

అన్ని భూతములయందును నేనున్నానెడి ఏకత్వభావనతో ఒప్పియున్న యోగిపుంగవుడు ప్రారబ్ధవశమున నెట్లెట్లు ప్రవర్తించిననువాడు నన్ను వదలి లేడు.

"ఏకమేవాద్వితీయం బ్రహ్మనేహనానాస్తికించిన" అనువాక్యమును బట్టి వున్నది ఒకే ఒక బ్రహ్మ, బ్రహ్మభిన్నమైన దేదియు లేదు. అనియోగినిష్ఠవలన గల్గిన బ్రహ్మజ్ఞానతత్పరుడు, సర్వకాల సర్వావస్థయందును, సమస్తము బ్రహ్మమే అనెడి దృఢభావన వలన సర్వమునందు తన్ను, తనయందు సర్వమును జూచుచున్నాడో అట్టి ఆత్మావలోకనాపరుడు ప్రారబ్ధకర్మ వశమునదే దేహమెట్లెట్లు ప్రవర్తించినను అట్టి ప్రవర్తన వలన కలుగు పుణ్యాపాపములకు నంటిక సదా బ్రహ్మమయ్యే వున్నాడు. అట్టి వానికి నాకు భేదము లేదు. ఎండుటాకు గాలిచే కొట్టబడినట్లు అట్టి మహానుభావుని కర్మజాలము లెల్లయోగజ్ఞానాగ్నిచే దహింపబడి పోవుటచే ఆకర్మలెవ్వియు ఆమహానుభావుని బంధింపజాలవు.

**సీ॥ ఏ దేశముననైన నేకాలముననైన**
**నేమి సేయుచునైన నెట్టులైన**
**నఖిల వికారంబు లా విద్యకంబులు**
**నేనవికారుండ నిష్ప్రపంచ**
**నిర్వికల్పాఖండ నిశ్చల నిర్మలా**
**వ్యయ సచ్చిదానంద మయ నిరీహ**
**పరిపూర్ణ నిర్గుణ ప్రత్యగాత్మా భిన్న**
**పరమాత్ముడనటంచు బరమనిష్ఠ**

**తే॥ సంతతంబును దనుగాంచు సజ్జనునకు**
**మంత్రతంత్రంబులేల కర్మంబులేల**
**జపతపోవ్రత దానయజ్ఞంబు లేల**
**నామవర్ణాశ్రమాభిమానంబులేల.**

పుణ్యాపాపములుగాని మంచిచెడ్డలు గాని దేశకాలాదులుగాని ఇవన్నియు అజ్ఞానజన్యములే. మాయామయమైన జగధభి మానము గలవారలకే గాని. మాయాతీతులైన జగద్భ్రాంతి లేని మహాత్ములకు ఇవేవియు లేవు.

జగత్తే మాయ అయినపుడు జగద్భాసితములైన నామరూపాలు ఎట్లు సత్యమగును. సత్యము గావని నిశ్చయ జ్ఞానము గలిగిన మహాత్ములకు మంత్రముల తోడగాని, జపతపంబులతో గాని, దానము జ్ఞాదులతో గాని, వర్ణాశ్రములతో గాని, వాటియందు అభిమానముగాని నుండనేరవు అని సీతారామాంజనేయ సంవాదము.

ఇట్టి మహనీయులు జనకాదులవలె లోకశ్రేయస్సు గురించి కర్మల యందున్నప్పటికి, యాజ్ఞావల్క్యాదులవలె సర్వసంగ పరిత్యాగులైనప్పటికి దత్తాత్రేయ అవధూతల వలె, నియమనిష్ఠలు లేక ప్రవర్తించినప్పటికి, సమాధిస్థితులైయున్నను, లేకున్నను, వారు నాస్వరూపులయ్యే వున్నారు. వారెట్లున్నను నాకన్న అన్యముగాలేరు. అంటూ భగవానుడుపై 29,30,31 శ్లోకములలో తత్త్వమసి మహా వాక్యాన్ని బోధించి, తనివి తీరని తమకంతో అట్టి పూర్ణ యోగసిద్ధ పురుషుని గురించి ఇంకా వర్ణిస్తున్నాడు.

**"ఆత్మౌపమ్యేన సర్వత్ర - సమంపశ్యతి యోర్జున,**
**సుఖంవాయది వాదుఃఖం - సయోగీ పరమోమతః ॥ 6-32**

సర్వప్రాణుల సుఖదుఃములు తనవిగా భావించి సమహితత్త్వమున మెలగువాడె యోగులలో శ్రేష్ఠుడని నా అభిప్రాయము.

అన్ని రూపులు తన రూపమని నిశ్చయజ్ఞానం గల్గి అన్ని ప్రాణుల సుఖదుఃఖాదులు తనవిగా భావించే అఖండాత్మ స్వరూపం అందరికి గలుగదు. అట్టి మహత్ భాగ్యము ఏ పుణాత్మునికో తప్ప, ఆ స్థితి పొందటానికి తగిన కృషి చేయాలెననే గీతాసందేశము.

"తనయందు సకల భూతములందు నొక భంగి సమహితత్త్వంబున జరుగువాడు" అని భాగవత సందేశము. తోటి ప్రాణిని తనతో సమానంగా, జూచువాడు, గుండెనిండా కరుణ, దయ,గలిగినవాడు, ఆర్తులకు చేయూతనిచ్చువాడు ఆకలి కొన్నవారికి పట్టెడన్నం పెట్టువాడు జీవత్వంలో శివతత్వంను చూచినవాడు, జీవారాధనే శివారాధనగా భావించినవాడు సర్వాత్మ భావం పొందినవాడను కోవాలె, వాడే నిజమైన భక్తుడు జ్ఞాని యోగి కాగల్గుతాడు.

సర్వాత్మ భావనలేని వాడు కళ్లు మూసుకొని వెలుగును వెతుకువాని వలె పరమాత్మను పొందలేడు. ముక్తి అంటే సదాచార జీవనం మాత్రమే గాదు. సర్వాత్మ భావము, అని డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు అన్నారు.

**క॥ బరులేయువి యొనరించిన / నరవరయప్రియము తన**
**మనంబునకగు తా / నొరులకవి సేయకునికి / పరాయణ**
**ము, పరమధర్మ పదములకెల్లన్, అని భారతం.**

ఏది నీకు యితరులు చేస్తే సహించవో దానిని ఇతరులకు నీవు చేయకుండుటే పరమధర్మము.

అందరిలో వుండేది ఒకే ఆత్మ కాబట్టి ఇతరులకు చేసిన అపకారం కాలాంతరములో నీకే చేరుతుంది. "అహింసా పరమోధర్మః" అని వేదవచనం, గాన సర్వాత్మ భావం. గల్గిన మహానుభావుడే నిజమైన యోగిపుంగవుడు. ఈ విధంగా భగవానుడు, యోగీయుంజీతసతతం అనే సాధనాస్థితి నుండి పూర్ణయోగ సిద్ధివరకు, కావలసిన బహిరంగ అంతరంగ సాధన ప్రక్రియ గురించి సంపూర్ణ యోగఫల ప్రాప్తి వరకు సాంగోపాంగము గాదెల్పిన, అదివినన అర్జునునకు సంశయంగల్గినది. సంశయమున్న మనసులో నిశ్చ యజ్ఞానముగలుగదు. కాన తన సంశయమున భగవానునకు నివేదించు కుంటున్నాడు.

సాధకులైన వారు వేదాంత శ్రవణమునందు సంశయము పొడసూపిన వెంటనే దాన్ని సద్గురువుల సన్నిధిలో అడిగి సంశయనివృత్తి గావించు కొనవలయును. అట్లు గాక అర్థంకాక పోయిన అర్థమైనట్లు తలలూపుతూ సంశయం కలిగినా అడుగుటకు సిగ్గుపడో, తన గొప్పతతనానికి లోటు అనో అహంకారంతోనో ఉంటే అట్టివారికి గురువల ద్వారా పొందవలసిన నిశ్చయజ్ఞానం కలుగకపోగా జన్మ వ్యర్థమైపోతుంది. కావున బుద్ధిమంతులు, సంశయము కల్గిన వెంటనే సమయాసమయములు గమనించి అడిగి తెలుసుకొనుట మంచిది.

అర్జునుడు తనకు గల్గిన సంశయాన్ని భగవానుని అడుగుతున్నాడు.

**శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తః / సామ్యేన మధుసూధన ।**
**ఏతస్యాహంనపశ్యామి । చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥**

మధుసూధనా ! నీవు చెప్పిన సమత్వరూపమగు యోగము మానసిక చంచలత వలన కుదిరి నిలుచుటకడుంగడం కష్టము. ఎందుకంటావా మనసు ఇదిమితమని ఒకదాని మీద ఒక క్షణకాలం కూడ నిల్వదు. మహా చపలమైనది. గృహమేని సవతులు గలచునట్లు ఇది మహాగయ్యాళిలో నెంబరువన్, దీని రాపిడి అంతింతరానిది, జీవుని ముప్పతిప్పలు బెట్టి మూడు చెరువులనీళ్లు త్రాగిస్తుంది దీనిని బట్టి నిల్పుట, గాలిని మూటగట్టినట్లు ప్రయాసేగాని, ఫలితం లేదు. అనిపిస్తుంది నాకు, కోటి కోటి ఉపాయలతోనైనా దీని కూడగట్టడం సాధ్యముగాదని భావిస్తున్నాను. సముద్రాన్ని పానం చేయుట కంటెను, మేరుపర్వతమును పెకలించుట కంటెను, అగ్నిని మింగుటకంటెను, మనోనిగ్రహము మహాకష్టతరమైన పనిగా భావిస్తున్నాను. ఈ సంశయమును దీర్చుటలో నీకన్నవేరెవరు ఆప్తులు గలరు. వాసుదేవా? కృపతోనాసంశయనివృత్తి చేయగోరుచున్నాను.

సాధకస్థితిలో మనసుచేయు ఆగడములు అపారము దీనిపోకడలు గమనించుట నీటి జాడలు గమనించుట వంటిది. ఎన్ని జన్మల నుండియో, జీవుని వెంటాడుతూ జన్మలకు జన్మలు దాటవేస్తున్న మహామాయావి. "మనమ్ము నాపియంతర్ముఖము జేసి యనవతరము, నిశ్చలసమాధి నిష్ఠచే నిలుపరాదు! అని సీతారామాంజనేయ సంవాదము మరియు

**చ॥ అలయకసప్తవారిధులనావలి కీవలికొక్కరీతిగా**
**గలయగనీదవచ్చును, నఘంబులనచ్చనగుండ్ల గాగరం**

బులగొనియాడవచ్చు నభమున్ గబళింపగవచ్చుగాని యి
య్యెలనమలనస్కయోగము గ్రహింపగరాదు దలంపనేరికిన్ ॥

సప్త సముద్రములైనా ఆవలకీవలకి బక్కరీతీగా ఒకేతూరి ఈదవచ్చును. మేరుపర్వతాన్ని ఎత్తి, గుండ్లమాదిరి చేతలపై నాడించవచ్చును. ఆకాశాన్ని కబళింపవచ్చును గాని ఈమనస్సునాపి అంతర్ముఖంచేసి అమనస్కం గావించుట మహాదుస్తరము, దుర్భేద్యము.

అయినను భగవదను గ్రహమము, సద్గురు దేవులకృపగల్గినచో.

శమదమాదులుగల్గి గురూపదిష్ట మార్గములో శ్రద్ధా విశ్వాసములతో వైరాగ్యోపేతులై సాధనగావించు తీవ్రము ముక్షుత్వము గల్గినవారికి పుష్పము యొక్క రేకులు విడిపించుట కంటె, కనురెప్పలు మూయుటకంటె మనస్సును, ఆత్మయందు నిల్పి అమనస్కము గావించుట సులభము అని చెప్పబడినది.

అలా అడిగిన అర్జునునకు సమాధనమిస్తున్నాడు.

**"అసంశయం మహాబాహో / మనోదుర్నిగ్రహంచలం । 6-38**
**అభ్యాసేనతుకౌంతేయ / వైరాగ్యేణచగృహ్యతే ॥**

గొప్ప బాహువులు గల ఓ అర్జునా ! నీవు చెప్పినట్లు మనస్సు చంచలమని దానిని నిగ్రహించుటకష్టమనే మాటనిజమే, అయినా అభ్యాసము చేత ఆ మనస్సును స్వాధీనము చేసుకోవచ్చు. శక్తితోకన్న యుక్తితో దాన్ని వశం చేసుకోవాలె.

"అభ్యాసవైరాగ్యాభ్యాంతన్నిరోధః" అని పతంజలి యోగ సూత్రము, అభ్యాస వైరాగ్యాలతో మనస్సును నిరోధించవచ్చును. అభ్యాసముతో, లయావస్థను, వైరాగ్యముతో విక్షేపావస్థను నిరోధింపబడగా చిత్తవృత్తి శూన్యమై యోగమునందు మనసు నిష్ఠకుదురుతుంది. అభ్యాస ప్రభావముతో లోకములో సాధించరానిదేలేదు.

ఓయీ శత్రు భయంకరా! అభ్యాసంవల్ల గదా నీవు అస్త్ర విద్య యందు ఆరితేరిన అరివీర భయంకరుడయ్యావు. ఫాలాక్షుని సైతము అస్త్ర విద్యలో యెదుర్కొనడం అస్త్ర విద్యాభ్యాసము వల్లనే గదా! కాబట్టి అభ్యాసవైరాగ్యముల రెండింటి చేత మనస్సును నిగ్రహింపవచ్చు. అయితే హఠముతోగాక క్రమముతో దాన్ని చంచలతను పోగొట్టవచ్చును. నీబాహుబలం దాని ముందుపనికిరాదు. దానికి అభ్యాసము మహా అంకుశం, వైరాగ్యం అభ్యాసానికి కవచం లాగా పనిచేస్తుంది. ఈ రెండిటితో మనసును జయించవచ్చు.

మనోనిగ్రహానికి సాధకుడు వాని అధికారాన్ని బట్టి సగుణధ్యానమో, నిర్గుణధ్యానమో, ఏదో ఒకటి ఎన్నుకొని దాన్ని బాగా అభ్యాసము చేయాలె. ఉత్తమాధికారియైన వానికి నిర్గుణ ధ్యానాభ్యాసమంచిది. దాన్నే బ్రహ్మాభ్యాసమంటారు.

**"తచ్చింతనం, తత్కథనం - అన్యోన్యంతత్ప్రబోధనం ।**
**ఏతదేకపరత్వంచ - బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" ॥**

మనసుతో బ్రహ్మను గురించి చింతించడం, వాక్కుతో బ్రహ్మను గురించే చెప్పుకోవడం, బ్రహ్మను గురించే శ్రవణం చేయడం, అదే ఒక పిచ్చిలాగా అయిపోవాలె లేదా ప్రహ్లాదునిలాగా ఇష్ట దైవాన్ని అయినా ఆయన రూపురేఖలన్ని మనసుతో హృదయం నందు కల్పించుకొని అయినా! ధ్యానం చేయవచ్చు.

నాదాను సంధానంతో కూడ మనస్సున్ను స్వాధీనం చేసుకోవచ్చు ఇది వారి వారి అధికార భేదాన్ని బట్టి సద్గురువుల చేత నిర్ణయించుకొనవలెను. ఇక రెండవది వైరాగ్యం, యోగాభ్యాసానికి, భక్తికిగాని, జ్ఞానానికి గాని ఈ వైరాగ్యం వుండి తీరవలసినదే వైరాగ్యం లేనిదే ఏది సాధింపబడదు. ప్రాపంచిక విషయాదులపై విముఖత గల్గియుండుటమే వైరాగ్యము.

ప్రపంచము జననమరణాదివికారములు గలది అని తెలుసుకొన్న వానికి ప్రపంచము నందు వైరాగ్యము కలుగుచున్నది. వైరాగ్యమునకు ముఖ్యస్వరూపము విషయములపై విముఖత, అనగా యేహ్యాభావం గల్గియుండుటయే, విషయములు దుఃఖ పూర్తిములు, దోషయుక్తములని తెలిసికొనిన వానికి వాటి పై విరక్తి జనించుచున్నది.

వైరాగ్యము పరమనియు, అపరమనియు రెండు విధములు అందులోన పరవైరా[illegible]తమానము, వ్యతిరేకము, ఏ కేంద్రియము, వశాకారము అని నాలుగు భేదములతో [illegible]ప్పబడుచున్నది.

ఈ లోకమునకు సంబంధించిన విషయములు స్రక్చందనవ వనితాదులు, వేదములో చెప్పబడిన, స్వర్గాదులు పరలోకమునకు సంబంధించినవి. వీటియందు ఆసక్తివున్నను వీటిలో సారమేమిటి, అసారమేమిటియను విషయమును గురు శాస్త్రముల ద్వారానెఱుంగవలయునను, ప్రయత్నము యతమానవైరాగ్యము.

తనమనస్సునందున్న దోషములలో నభ్యాస వివేకము చేతనెన్ని పరిపక్వములైనవి, ఇకనెన్ని మిగిలియున్నవి. అని విచారించుట వ్యతిరేక వైరాగ్యము.

ఇహ లోకపరోలక విషయసుఖములందు దుఃఖమును తెలుసుకొని వాటి ప్రవృత్తి వదలి మనస్సు నందు త్యాగం గల్గి వుండుట ఏకేంద్రియ వైర్యాగ్యము.

ఏ విషయములందును సంస్కారూప ఆశనుగూడ వదలియుండుట వశీకార వైరాగ్యము ఇదియే అపర వైరాగ్యము, ఈ వైరాగ్యము అష్టాంగ (యమ, నియమ, ఆసన, &ప్రాణాయామ, ప్రత్యహార, ధారణ, ధ్యాన సమాధులు) యోగాములుగా అని అష్టాంగములతో కూడి యున్నది. 8 విధములకు సాధకముగను, సంప్రజ్ఞాత సమాధికి, అంతరంగముగను, అసంప్రజ్ఞసమాధికి, బహిరంగ సాధనముగా జెప్పబడినది.

ఇట్లు అభ్యాస వైరాగ్యములు ఏక కాలములోనే సాధకుడు అలవచుకుంటు రావాలి. వైరాగ్యము విధ్వంసక పద్ధతి. అభ్యాసము విధాయక పద్ధతి, కావున రెండిటిని అలవరచుకోవలయును.

"అభ్యాసవైరాగ్యాభ్యాంతన్నిరోధః"

అని పతంజలి యొక్క యోగ సూత్రము అభ్యాసవైరాగ్యములచేత సుఖదుఃఖమోహరూపమైన ప్రపంచానుభవమును కలుగజేయు వృత్తులను, ఆ వృత్తులకు కారణమైన చిత్తమందులయమొందించుటయే చిత్తవృత్తిని నిరోధమనబడుచున్నది. అభ్యాసము చేత వృత్తుల యొక్క విముఖత సిద్ధించుచున్నది మరియు వృత్తియనగా! బుద్ధి అయాయింద్రియములలో నుండి వెలుపల ప్రసరించుట, ఇట్లు ప్రసరింపనీయక పోయిన యడల వృత్తులు అంతర్ముఖములై తనకు కారణమగు చిత్తము నందు శక్తి (సూక్ష్మ) రూపమగసుండును. విషయములందుడు దోషములను కనుగొనుట వలన పుట్టెడి వైరాగ్యము చేత విషయములలో దగుల నీయక విముఖత నొందించును. అభ్యాసము వలన చిత్తమును స్థిరముగా నుండునట్లు దృఢీకరింపజేయును. కాబట్టి చిత్తవృత్తి నిరోధము అభ్యాస వైరాగ్యములను, నీరెండిటి చేతనే కలుగునని తెలియవలెను.

**"అసంయతాత్మనాయోగో - దుష్ప్రాప ఇతిమేమతిః ।**
**వశాత్మనాతుయతతా । శక్యోఽవాప్తుము పాయతః " 6-36**

లెస్సగాని యమింపబడని మనస్సుగలవాని చేత ఈ యోగం పొందుట సాధ్యము గాదని నా అభిప్రాయము, ప్రయత్నము చేత స్వాధీనమైన మనస్సు గల వాని చేతనే ఉపాయమువలన ఈయోగము పొందుటకు సాధ్యమగును.

వాస్తవమున సంయమనములేని వారికి చపలచిత్తులకు యోగముకుదురదు. సంకల్ప ప్రవాహమును దాటిన మహాత్మునికే ఈయోగము కుదురును గాని ధ్యానమున కూర్చున్నది మొదలు సంకల్ప ప్రవాహమున కొట్టుమిట్టాడు వానికి యోగమెన్నటికి కుదురదు.

మనోమారుతములకు అవినాభావ సంబంధముగలదు. శ్వాసప్రకోపము ఎక్కువెక్కువ సంకల్పాలకు కారణముగాన సంకల్పముడుగవలెనన్ని శ్వాసపరిమితి తగ్గవలెను. ప్రతివారికి నాసికాగ్రము నుండి బయటికి పండ్రెండు అంగుళములు శ్వాసవెళ్ళి అక్కడలీనమై, మళ్లీ నాసికమునకు పండ్రెండు అంగులముల దూరమున ఉద్భవించి నాసికాపుటముల గుండా హృదయమున గల అంతరవేష్టి (నాడీ చక్రం) చేరి అక్కడ లయించును. హృదయమునగల అంతర్‌వేష్టి అనే నాడీ చక్రమందే పరమాత్మ వుంది. ఈ ప్రాణవాయువును ఆకర్షిస్తూ వున్నాడు. అంతర్ వేష్టి నుండే పరమాత్మ దేహమునగల 72 వేల నాడులకు చైతన్యాన్ని ప్రసాదిస్తూ వున్నాడు.

నాసికా పుటముల గుండా శ్వాసవెళ్లి హృదయమునగల పరమాత్మను రోజుకు 21600 సార్లు ముట్టి వస్తూవుంది. అట్టి శ్వాసపై సాధకుడు మౌనముగా ఆసనమున కూర్చొండి కనులు మూసి, మనసును శ్వాసపై నిఘావుంచి చూచినట్లైతే శ్వాసతో చేరి మనస్సు నేరుగా హృదయమున ప్రవేశించి పరమాత్మను, ముట్టి క్రమక్రమంగా మనసు

హృదయస్థమైన పరమాత్మ యందు లీనం కావాలదు. "ఉపాయతః" అని ఈ శ్లోకమున ఈ రహస్యాన్ని గురించే చెప్పబడినది. మనసును అంతర్ముఖము చేయుటకు ఇదియే ఉపాయము. ఈ ఉపాయముచే సాధకుడు సాధన అభ్యసించినట్లైతే మనోమారుతములు, (శ్వాసమనసు) రెండు ఏకమై పరమాత్మను పొందగలరు. మనోమారుతములు రెండు ఏకమై అంతర్ముఖమై ప్రత్యగాత్మ యందు లీనమగుటయే సమాధి అనబడును. ఈ సమాధిని యోగి అభ్యసింపక కోటిసార్లు బ్రహ్మమును గురించి శ్రవణంచేసినను సరియే ఈ సమాధి నొందనిదే సమ్యక్‌దృష్టి (నిశ్చయజ్ఞానం) గలుగనేరదు.

యోగికి సమాధియే పరమలక్ష్యమైయున్నది. సమాధి సాధించనిదే మోక్షము గలుగనేరదు. మనసును, ఇంద్రియములను నియమించినవాడై తీవ్ర మోక్షా పేక్షగలవాడై అపరవైరాగ్యపరుడై, కాలము యొక్క విలువను గుర్తెరిగి. కాలమును వృథా చేయక శ్రద్ధావంతుడై పై జెప్పబడిన యోగయుక్తిని ఆశ్రయించి యోగమభ్యసించవలెను. ఇట్టి యోగము చేతనే మోక్షము కరతలామలకము గలదుగాని, వేరు ఉపాయముతో కలుగనేరదు.

యోగమును గురించి మాటలు చెప్పుకొన్నంతమాత్రమున యోగసిద్ధినెన్నటికిని గలుగనేరదు. అన్నము భుజించినవారికే ఆకలితీరునుగాని, పాక వర్ణన చేతపాకశాస్త్రము కంఠస్థం చేసి నంతమాత్రమున ఆకలి తీరునా! అట్లెన్నటికి దీరదు.

తే॥ రాజితానంద తారకరాజయోగ
పావనసమాధిలేనిచో పరమశుష్క
తర్కవేదాంత వాదతత్పరుల చేత
నింద్రియమనంబులు వినిగ్రహింపబడునే

బాహ్యేంద్రియ, అంతరింద్రియముల విజయము గలిగి ఆత్మసాక్షాత్కార మునకు యోగమొక్కటియే మార్గము. యోగ సమాధియే కాలపరిపక్వముచే జ్ఞానసమాధియై ప్రకాశించగలదు. యోగ సమాధి లేక జ్ఞానసమాధి గలుగ నేరదు అని సాధకులు గుర్తెరుంగవలయును.

తే॥ జండివడి బుద్ధిలో వెలినిండి మిగుల
దట్టమైనట్టి యజ్ఞాన తమముదెగునె
తర్కిత విచిత్ర శబ్దబోధంబువలన
ఫలితయోగాను భవదృష్టివలన గాక.

మొదటనుండి గీత అనుష్ఠాన వేదాంతమే బోధిస్తూ వుంది. శుష్కవేదాంతమునకు అసలు అవకాశమే ఇవ్వలేదు. కాన మోక్షాపేక్షపరులు అనుష్ఠాన వేదాంత పరులు గావలయును. యోగం యొక్క జ్ఞానాన్ని గురించి చెప్పుతున్న భగవంతుని మాటలు వింటున్న అర్జునుడు మళ్లీ సందేహంలో పడ్డాడు. సందేహం వినేవానికే గాని అసలు వినని వానికి,

పరధ్యానంగా వుండే వానికి సందేహమెలా కలుగుతుంది. కాబట్టి అర్జునుడు మళ్లీ సందేహంతో పడ్డాడంటే భగవానుని మాటలో అక్షరం వదలకుండా ఏకాగ్రంగా వింటున్నాడని అర్థము.

**అర్జున ఉవాచ :**

**శ్లో॥ అయతిః శ్రద్ధయాపేతో, యోగాచ్చలితిమానసః,**
**అప్రాప్యయోగిసంసిద్ధిం / కాంగతింకృష్ణగచ్ఛతి"**

కృష్ణా ! ఈ యోగధ్యానమునందు శ్రద్ధగలవాడై యుండి కూడ, ప్రయత్న బలము కొఱబడుటచే పూర్ణసిద్ధిని పొంద జాలక నడమంత్రమున యోగమునుండి జారిన వాడు యేగతిని పొందును.

అలా పట్టుదప్పి యోగమార్గమునుండి జారిన యోగ భ్రష్టుడు రెండిటికి చెడిన వాడై, చెదిరిన మేఘమువలె వ్యర్థుడు కాడా? ఈ నా నందేహమును తుదముట్టి నివారింపుము. ఓ కృష్ణా నా సందేహమును తీర్చుటకు నీవు తప్ప వేరు దిక్కులేదు.

యోగ భ్రష్టుడు అనేమాటలో రెండు అర్థాలు వున్నాయి. ఒక రకం వాడు సిద్ధి పొందక ముందే దేహాన్ని విడచినవాడు, రెండవవాడు యోగం నుండి జారి మనస్సు ప్రాపంచిక విషయములచే సంసారమున బడినవాడు. వీరి జీవితములు ఇహపరాలకు చెందకపోవలసిందేనా, లేక ఏమైనా కొంచమైన సద్గతి వుందా? అని అర్జునుని ప్రశ్న.

మొదటివాడు సంసార సుఖాలవదలి యోగము సిద్ధి పొందకముందే మరణించుటచే వానికి పరలోకగతులు లేవు. రెండవవాడు యోగం నుండి భ్రష్టుడై సంసారములో ప్రవేశించుటచే వానికి పాపలోకాలగతి తప్పదు. గదా? అని అర్జునుని సందేహం, ఆయనకే గాదు అందరికి కలిగే సందేహం కూడ.

అందుకు భగవానుడు తన శ్రీముఖంగా చెప్పుచున్నాడు.

**శ్లో॥ పార్థ ! నై వేహనాముత్ర / వినాశస్తస్య విద్యతే ।**
**నహికల్యాణకృత్ కశ్చిత / దుర్గతింతాత , గచ్ఛతి ॥ 6-40**

పార్థా! యోగ భ్రష్టునకు ఇహపరములలో యొక్కడను చెడులేదు. నాయనా! మంచి చేసుకొన్నవాడు యెప్పుడును చెడిపోడుసుమా!

యోగసిద్ధిని పొందకనే మరణించినవాడు, పుణ్యవంతుల కర్షములైన స్వర్గాదిలోకములందు చిరకాలము సుఖించి, మీదట పవిత్రులగు శ్రీమంతులయిళ్లటనో లేక, ప్రజ్ఞావంతులగు యోగుల ఇండ్ల యందైనను, జన్మించును, నిజమునకు ఇట్టి జన్మలు లోకమున అరుదు. అట్టివాడు వెనుక జన్మమున వదలిన యోగ బుద్ధిని మళ్లీ పొంది ఈ జన్మమున పూర్ణసిద్ధిని పొందుచున్నాడు.

హిందూ మతానికి ముఖ్యమైన పునర్జన్మ సిద్ధాంతాన్ని కర్మ సిద్ధాంతాన్ని ఈ 41వ శ్లోకం, 42 శ్లోకముల బలపరస్తూవున్నాయి. కొన్ని మత సిద్ధాతంతములు పునర్జన్మ సిద్ధాంతమును ఒప్పరు. అలా పునర్జన్మను నిరసిస్తే! అకృతాభ్యాగమ దోషము 2 కృతి విప్రణాశమదోషము అనే రెండు దోషాలుగల్గే అవకాశం వుంది.

(1) అకృతాభ్యాగమంటే మనమెప్పుడు చేయనికర్మ ఫలం అనుభవించడం.

(2) కృత విప్రణాశమంటే? మనమెంత ఘోరకర్మచేసినా దాని ఫలతం మనకంటకుండా పోవడం అనే దోషాలు జీవునినెత్తినపడే అవకాశం వుంది గాన పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించి తీరవలసిందే.

ఈ పునర్జున్మ సిద్ధాంతాన్ని గురించి చాలా మందికి అపోహలువున్నాయి. అట్టి అపోహలను తుదముట్టిస్తూ పై శ్లోకములద్వారా భగవానుడు పునర్జన్మ సిద్ధాంతాన్ని ఉద్ఘాటిస్తున్నాడు.

హిందూమత సిద్దాంత ప్రకారంగా పునర్జన్మ సిద్ధాంతాన్ని కొన్ని సంఘటనల వల్ల ప్రత్యక్ష ప్రమాణాల వల్ల ఇపుడిపుడు సర్వమతాలు ఆమోదిస్తున్నాయి.

యోగం నుండి విషయాసక్తిచేత యోగభ్రష్టుడైన వాడు కూడ వానికి నరకలోకాల యొక్క భయం లేదు. అజామిళుని వలె వానికి సద్గతి వుంది. "స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" మంచి కర్మలు ఏ కొద్ది పాటైనా ఇహపరలోకాలలో కూడ మంచినే కల్గిస్తాయి. అట్టివాడు దేహత్యాగం తరువాత పుణ్యలోకాలలో బహుకాలం వానియోగ పుణ్యఫలాన్ని బట్టి నివసిస్తాడు. అటు తరువాత తిరిగి భూలోకంలో మంచి శ్రీమంతుల ఇండ్ల యందు జన్మంచి భూలోక సుఖాలు అనుభవిస్తాడు. ఈ జన్మలో శ్రీమంతుల ఇండ్ల యందు జన్మించిన వారందరు గత జన్మలో యోగ భ్రష్టులే. అయితే ఆ సంగతి వారికి తెలియదు. శాస్త్రాధ్యయనం ద్వారా మహాత్ముల సాంగత్యముతో జన్మయొక్క విలువను, గుర్తెరిగినవాడు మళ్లీ ఈ జన్మలోనైనా దృఢతరమైన ప్రయత్నంతో యోగాభ్యాసము చేపట్టి యోగసిద్ధి నోందినచో వాడు పుణ్యాత్ముడే, లేకున్న వచ్చిన జన్మను విషయభోగలాలసతో వ్యర్థం చేసుకొన్న అట్టివానికి మళ్లీ నీచ జన్మల ప్రాప్తి తప్పదు. అట్టివాడు సుడిగుండమున బడిన క్రిమిలాగా జననమరణాలలో పరిభ్రమిస్తుంటాడు.

ఇక రెండవవాడు యోగము పూర్తికాక ముందే విషయాసక్తుడు కాకుండా యోగబుద్ధితోనే దేహం వదలినవాడు కూడ వూర్ధ్వ లోకాలలో అనేక వేల సంవత్సరాలు వుండి మరల మంచి యోగాభ్యాసం గల యోగుల ఇండ్లలో జన్మించి శేషించిన యోగమును పూర్తి చేసుకొని జన్మను చరితార్థం చేసుకుంటాడు.

"శుచీనాంశ్రీమతాంగేహే" అని చెప్పుటచేత యోగభ్రష్టుడు పవిత్రులు అనగా శుచి శుభ్రత ఆచారం ఐశ్వర్యం గలవారి ఇండ్లలో ఉద్భవిస్తాడు.

తీవ్రతర యోగసాధకుడు మధ్యలో దేహత్యాగం చేస్తే మళ్లీ వెంటనే గొప్ప

జ్ఞానుల ఇండ్లయందు జన్మించి ఆ యోగాన్ని పూర్తి చేసుకుంటాడు. దేహాలు మారినా యోగసాధన సంస్కారం అలాగే ఉంటుంది. అందుచేత వారు మరో జన్మలో తాను మిగిలిన యోగాభ్యాసం పూర్తి చేసుకొని తరిస్తారు.

ఒకవేళ తాను జన్మించిన ఇంట యోగాభ్యాసమునకు అనుకూలం లేని పక్షములో పూర్వజన్మ వాసనా బలంతో ఏ ఆశ్రమాలకో, ఏ వనప్రదేశాలకో వెళ్ళి మిగిలిన యోగాన్ని పూర్తి చేసుకుంటాడు. అట్టి పుణ్యాత్ములకు ఎందును చెరుపులేదు.

ప్రతిదానికి శ్రద్ధ అవసరము శ్రద్ధగలవాడు లోకాలు గూడ జయిస్తాడు. అటుగాక ఇది నా కర్మ, నాకా అదృష్టం లేదు. అంటు సోమరులైపడియుండే వారికి ఇహం లేదు పరం అంతకంటే లేదు. అట్టి పురుషార్థహీనుడు ఎందును పనికిరాదు.

**"ప్రయత్నాద్యతమానస్తు / యోగీసంశుద్ధకల్బిషః ।**
**అనేక జన్మసంసిద్ధః / తతోయాతి పరాంగతిమ్ ॥ 6-45**

అయ్యా! పట్టు వీడక ప్రయత్నించెడి యోగి బహుజన్మ పరిపాకమున సమస్త దోషరహితుడై పరమసిద్ధిని పొందుచున్నాడు.

బుద్ధభగవానుడు పదునాలుగు జన్మలకు సిద్ధి పొందాడు. జడ భరతుడు రెండు మూడు జన్మలకు సిద్ధి పొందాడు. సిద్ధి వారి వారి పట్టుదల శ్రద్ధలపై ఆధారపడి వుంటుంది. యోగం చెయ్యాలనే దృఢభావముంటే అదే క్రమక్రమంగా యోగంలో ప్రవేసింపజేస్తుంది. ముందు ఆసక్తి అవసరము. అన్నిటికంటె పురుష ప్రయత్నం చాలా గొప్పది. పురుష ప్రయత్నం గలవారు నరకాన్ని గూడ స్వర్గతుల్యంగా మారుస్తారు. నేలపై కూడ ఓడను నడిపిస్తారు. యోగసాధనకు శ్రద్ధగలవారికి యోగం కుదిరినట్లే.

శ్రద్ధ వలననే విశ్వామిత్రుడు అంతటి మహర్షి కాగాలిగాడు. ప్రయత్నం గల వానికి భగవంతుడు సాయం చేస్తాడు. ఇలాగా పట్టు వీడక శ్రద్ధతో యోగం చేయు యోగి విదియ నాటి చంద్రుని వలె, దిన దిన ప్రవర్ధమానుడై సర్వకిల్బిషముల పోనాడి సిద్ధిని పొందుచున్నాడు.

శ్రేయాంసి బహువిఘ్నాని అన్నట్లు మంచి పనులకే విఘ్నాలు జాస్తి అయినా, జంకరాదు. యోగ మార్గములో కూడ ఎన్నో విఘ్నాలు ఎదురైనా వాటిని ఓపిక పట్టుదల ధైర్యంతో ఎదొర్కోవాలె. భాగవతములో బాలధృవునిలాగా, బాల ప్రహ్లాదునిలాగా, కొండంత ఆపదలొచ్చినా చలించని స్థిరత్వముండాలె. ధృవుని తపస్సును విఘ్నపరచుటకు దేవేంద్రుడు రాళ్ళ వాన కురిపించాడు. పెనుగాలిచే కులపర్వతాలనే చలింపజేశాడు. అయినా! ధ్రువుడు చలించలేదు. పట్టు విడువలేదు. కాననే ఆరుమాసాలకే సిద్ధి పొందాడు. అలా యోగసాధకుడు స్థిరచిత్తుడై యోగ విఘ్నములకు చెలించకముందుకు సాగిపోవాలె.

హఠయోగ ప్రదీప గ్రంథమున యోగ విఘ్నముల గురించి ఈ విధముగా దేల్పబడియున్నది.

శ్లో॥ భయంక్రోధమథాలస్య / మతిస్వప్నాతి జాగరమ్ ।
అత్యాహార మనాహారం / నిత్యం యోగీవివర్జయేత్ ॥

తా॥ భయము, క్రోధము, ఆలస్యము, (సోమరితనము) అతనిద్ర అతి జాగరణము, అత్యాహారము, అనాహారము, వీనిని యోగి యెల్లపుడును విడువ వలయును.

శ్లో॥ అత్యాహారః ప్రయాసశ్చ / ప్రజల్పోనియమగ్రహః ।
జనసంగశ్చ తౌల్యంచ / షడ్భిర్యోగో వినశ్యతి ॥

తా॥ అధిక భోజనము, పరిశ్రమను గలుగ జేయు కర్మయు, అధికముగా మాట్లాడుట, నియమగ్రహణము, జనసాంగత్యము, చపలత్వము, అనునీయారును యోగమునకు ప్రతిబంధకములు.

మితిమీరిన భోజనము, ఆకలి కధికమైన భోజనము రోగకారణము, తమోగుణమును గల్గించును. పగలు ఎక్కువ కర్మ లాచరించువారికి యోగము కుదురదు. మనస్సుకే యోగము నుండి విముఖత గల్గును. అధికముగ మాట్లాడుట వలన కర్తవ్యమును మరచును. కాలం వృథాయగును.

నియమగ్రహణము అనగా : చన్నీళ్ల స్నానం వేకువజాముననే చేయకుండుట, రాత్రి భోజనం చేయుట, ఇత్యాది నియముల్లంఘన చేయుటచే యోగమునకే ఉత్సాహం వుండదు. ఎక్కువ జన సాంగత్యము వలన చంచలత గలుగును. కాన యిలాంటి విఘ్నములకు గురికాక సాధకుడు కడు జాగరూకుడై నియమపాలన సడలక యోగమభ్యసించవలయును.

క్రమశిక్షణతో విధి ప్రకారము నిత్యము యోగమభ్యసించుచు వచ్చినచో అతనికి మూడు మాసములలో తప్పక స్వయముగ జ్ఞానముత్పన్నమగును. ఇందుకు సందేహము లేదు.

శ్లో॥ చతుర్భిః పశ్యతేదేవాన్ / పంచభిర్వితతక్రమాన్ ।
ఇచ్ఛయాఽఽప్నోతికైవల్యం / షష్టేమాసినసం శయః॥

తా ॥ నాలుగు మాసములలో యోగి దేవతలను గాంచును. ఐదు మాసములలో, విశాల దృష్టి రహస్య క్రమమును తెలుసుకొనును, ఆరు మాసములలో తలంచిన మాత్రముననే కైవల్యసిద్ధిని బడయ గల్గును, అనిశ్రుతి ప్రమాణం.

యోగసాధకుడు, ప్రాపంచిక విషయాదుల యందు ఎండమావుల వలె, మిథ్యయని యెరింగి వాటియందు ఇచ్ఛ లేక ప్రపంచము అసత్యమని, బ్రహ్మాసత్యమని విజ్ఞాన పూర్వకముగ గుర్తెరిగి, సంగ సంసర్గం, దుర్గుణ దాయకమనియు, సంగవిసర్గము, సద్గుణదాయకమనియు, నెంచి ఏకాకిగా యోగమును అభ్యసించవలయును. అట్టి వారికే

యోగ సిద్ధి తప్పక కల్గును. అతడు పెట్టిన బంగారము వలె, అకుంఠిత యోగ ప్రభావము వలన, సర్వ పాపముల నుండి విడబడి పవిత్రుడై ముక్తిని గాంచుచున్నాడు.

**శ్లో॥ తపసిభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః ।**
**కర్మేభ్యశ్చాధికోయోగీతస్మాద్యోగీ భవార్జున ॥ 6-46**

అర్జునా ! యోగి యొక్క జన్మ అపరూపము. ఎన్నో జన్మల పుణ్య ఫలం ఒకరాశిగా కూడిన, వారికే ఈ జన్మ లభ్యమవుతుంది. ఎన్ని యజ్ఞాలు చేసినా, ఎన్ని తపస్సులు చేసినా! కృచ్ఛ చాంద్రాయణాద్రి పాపం పోతుంది పుణ్యం గల్గచ్చుకొని జ్ఞానం మోక్షం మాత్రం గలుగదు. ఎన్ని వేదాలు ఏ కరువు పెట్టినా అనుష్ఠాన పరుడు కాకపోతే "భుక్తయేనతముక్తయే" అన్నట్లు అదంతా పోట్టకూడటికే గాని ముక్తిని యివ్వలేవు. వేదశాస్త్రాలు పఠిస్తే కాదు. పఠించిన వేదం అనుష్ఠానానికి వచ్చినపుడే గదయ్యా ఫలం దక్కేది.

కాబట్టి అర్జునా ! నా మాటవిని నీవు యోగివి కవాలి. అంతకు మించిన భాగ్య మరొకటి లేదు. దానికి మించిన శాంతి లేదు.

**శ్లో ॥ సమాధినా, నయేత్కాలం వృథాచిన్తాం విసర్జయేత్,**
**ధ్యానేనవిలయం యాన్తి సంస్కారా బహుజన్మనాం ॥**

అనిశ్రుతి, ధ్యానం చేత సకలజన్మల నుంచి రూఢములయిన, సమస్త సంస్కారముల నశించుచున్నవి. కాబట్టి సర్వ చింతనల వదలి ఆత్మ ధ్యానము చేతనే, కాలము పవిత్ర గావించుకొనవలయును. ఇట్టి యోగ జీవితం, ఎవరికి కడసారి జన్మయో అమహాత్మునికే గల్గుచున్నది.

**శ్లో॥ యోగినామపిసర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతేయోమాం సమేయుక్త తమోమతః ॥ 6-47**

కాబట్టి అర్జునా ! చిత్తము నాయందే (అంతరాత్మయందె) ఉంచి శ్రద్ధతో నన్ను సేవించువాడేవడో యోగులందరిలో మహాయోగిగా యెరుంగుము.

చిత్తం వలన పరమాత్మ యందు యోగికి వికల్పబుద్ధి గలుగును. చిత్తము నిశ్చలమైనపుడూ బ్రహ్మమందు నిష్ఠకుదురును. అట్టి నిష్ఠాపరుడు నిర్వికల్ప సమాధిస్థితుడై బ్రహ్మమునే పొంచుచున్నాడు.

అర్జునా ! యోగ సమాధియందు చిత్తమున పూర్ణ బ్రహ్మమునే ధ్యానించు చుండును. అనగా ! బ్రహ్మమయ్యే వుండును. ఇట్లు నిర్వికల్పక సమాధి వలన అనేక జన్మార్జిత పుణ్య వశమున బ్రాపించిన ఈ పురుష శరీరమును, యోగి సఫలము గావించుకొనుచున్నాడు. జన్మనే చరితార్థము గావించుకొనుచున్నాడు. ఇట్టివారే పురుషులలో పుణ్య పురుషుడనిపించుకొనుచున్నాడు.

★★★

శ్రీరామకోటి
రామ కృష్ణా నందస్వామి
ఈదుల బళ్ళాపురం,
సోమందేపల్లి మండలము,
అనంతపురం జిల్లా.

---

నామధేయం : శ్రీరామకోటి రామకృష్ణా నందస్వామి

స్వగ్రామము : క్రిష్ణంగారిపల్లి, పులివెందుల తాలూకా, కడప జిల్లా.

జననం : 1938వ సంవత్సరము

తల్లిదండ్రులు : శ్రీయల్లటూరి సాంబశివారెడ్డి,
శ్రీమతి చంద్రమ్మగార్లు.

విద్యాభ్యాసం : స్వగ్రామములోని ప్రాథమిక పాఠశాలలో 5వ తరగతి తండ్రి గతించుటచే చదువు ఆగిపోగా, 1956 సంవత్సరములో ప్రయివేటుగా 8వ తరగతి పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులైరి.

సన్యాసం : తదుపరి, సత్యాన్వేషణలో దేశ పర్యటన గావించుచుండగా 1964వ సంవత్సరములో శ్రీ చిద్గగనానంద స్వాముల వద్ద సన్యాసము స్వీకరించి, 1969 వరకు పాదయాత్ర సాగించిరి.

☆☆☆☆☆